మే, ౧౯౫౮

# జయంతి

# 7

సంపుటము 1 సంచిక 7

---

ఈ సంచికలో

మాచిరాజు దేవీప్రసాద్

ఉన్నవ విజయలక్ష్మి

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

శప్పగంతుల లక్ష్మణశాస్త్రి

శంజల

...దర్



...రామమూర్తి

...శ్వరరావు

...తమరావు

...శర్ల వేంకటావధాని

విశ్వనాథ సత్యనారాయణ

# జయంతి

7 97

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.




సంపాదకమండలి :
విశ్వనాథ సత్యనారాయణ
(అధ్యక్షులు)
మల్లంపల్లి సోమశేఖరశర్మ
దివాకర్ల వేంకటావధాని
కేతవరపు రామకోటిశాస్త్రి
జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా రూ. ౫-౦
విడిప్రతి ౫౦ న. పై.

# సంపాదకీయములలో:

ఒక సంస్థ ఉన్నదనగా అది రాచరికమువారిచేత నడపబడుచున్న ప్రజాసంస్థ యైనచో దానినిగురించి పలు ప్రశ్నలు పుట్టక మానవు. అచ్చముగా ప్రభుత్వ సంబంధ మైనచో ప్రశ్నలు రాజసభలలో వేయుదురు. అది ప్రజాసంబంధమైన దైనచో లోకములో పలుమంది తమకుగూడ దానిమీద నధికార మున్నదనుకొని ప్రశ్నలు వేయుచునే యుందురు.

ఇట్టి ప్రజాపరిషత్తులలో సాహిత్యపరిషత్తులు ముఖ్యమైనవి. రాజధానిలో కేంద్రపరిషత్తు కలదు. హైదరాబాదులో ఆంధ్రప్రదేశ సాహిత్యపరిషత్తు కలదు. ఈ ఆంధ్రప్రదేశ సాహిత్యపరిషత్తునుగూర్చి ఉన్నత సంవిధానసభలో కాబోలును, ప్రశ్నలు వేయబడినట్లు పత్రికలద్వారా తెలియుచున్నది.

అది యట్లుంచి దేహాళిలోని కేంద్రపరిషత్తు విషయములో మాకు చేరిన కొన్నిలేఖలను పురస్కరించుకొని కొంత వ్రాయవలసియున్నది. ఈకేంద్ర పరిషత్తునకు సంబంధించిన యాంధ్రసాహిత్యవిషయములో పలుమందికి సందేహములు అతృప్తియు దేశములో నున్నవని మాకు లేఖలద్వారానేకాక కర్ణాకర్ణిగాకూడ తెలియును. ప్రస్తుతము ఈ యేడాది తెలుగులో నైదువేల బహుమతి పొందదగిన యుత్తమగ్రంథము లేకపోవుటచేత నా బహుమతి యెవరికిని రాలేదు. పూర్వ మీయబడిన బహుమతులను గురించి ఇప్పుడు ప్రస్తావనచేయుట గతజలసేతుబంధనము.

మాకు చేరిన వార్తలనుబట్టి ఈ బహుమతికి కొన్ని మంచి గ్రంథములే చర్చలోనికి వచ్చినట్లు వినికిడి. ఏ గ్రంథమునకును బహుమతి యీయబడలేదు. లోకము విచిత్రముగా చెప్పికొనును, అచట ఆంధ్రభాషను గూర్చి ప్రతినిధులుగా నున్న వారికి యన్యాయము చేసిరని పలువు రనగా మేము విన్నాము. ఆంధ్రభాషా ప్రతినిధులు ముగ్గురు. ముగ్గురు సమర్థులే. వారు తక్కినవారి గ్రంథములకు బహుమతి రాకుండ చేయవలసిన యగత్యమేమున్నది. వారిలోనే ఒకరి గ్రంథము చర్చలోనికి వచ్చినదని వినికిడి. తమ గ్రంథమునకు బహుమతిరాకుండ తామే చేసికొందురా?

ఇంతకు ఏ ప్రణాళికమీద ఏ సూత్రముమీద నీ బహుమతు లీయబడుచున్నవో తెలియదు. ఆ సంగతి తెలియకుండ విమర్శ చేయుటయు న్యాయము కాదు. '[1]ఆంధ్ర వాఙ్మయ చరిత్రమన్న యొక గ్రంథము వానిలో నున్నదని తెలిసినది. ఆ గ్రంథము బాగుగనే యున్నది. ఆ గ్రంథమును మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించినారు. మరియొక గ్రంథము '[2]లిపిసంస్కరణము. అదియు మంచి గ్రంథమే. మూడవది '[3]సాహిత్య సమీక్ష. అదియు చాల సమర్థతతో వ్రాయబడిన గ్రంథము. పద్య గ్రంథములుకూడ మంచివే బహుమానార్థము వెళ్ళినట్లు తెలియవచ్చినది. అందులో '[4]పెన్నేటి పాట యొకటి. ఈ గ్రంథము నిస్సంశయముగా క్రొత్తమార్గమున చేయబడిన కల్పనలతో పద్యరచనతో కూడుకొని యున్నది. దీనికి బహుమతి యిచ్చినచో నీయదగినదియే. శ్రీమద్రామాయణ కల్పవృక్ష సుందరకాండము దానిలో నున్నదని తెలియవచ్చినది. ఈ గ్రంథము ఏకదేశము. సంపూర్ణ గ్రంథము కాదు. ఈ గ్రంథ రచయితనుగూర్చి దేశములో పలు భేదాభిప్రాయములు కలవు. దానిని వదలిపెట్టవచ్చును. తక్కిన గ్రంథములలో నేదో యొకదానికి బహుమతి యీయవచ్చునుకదా!

---

1. శిష్టా రామకృష్ణ శాస్త్రి. 2. తిరుమల రామచంద్ర. 3. దీపాల పిచ్చయ్య శాస్త్రి. 4. విద్వాన్ విశ్వం.

ఇతర భాషలలో బహుమతులు పొందినవారిలో ప్రశస్తులు కలరు. రాహుల్ సాంకృత్యాయన్ గాని, జేంద్రే గాని, తక్కినవారు గాని సమర్థులు, ప్రసిద్ధులు. రాజాజీ వ్రాసిన తమిళ భాషలోని రామాయణ వచనమునకు బహుమతి యొసగబడినది. ఇది గొప్ప విషయము. తమిళములో గద్యములో వ్రాసిన రామాయణమునకు బహుమతి వచ్చి తెలుగులో పద్యములో వ్రాసిన రామాయణమునకు బహుమతి రాలేదు. దానికి కారణమిది యేకదేశమగుటయే కావచ్చును. కాదా ఇది గద్య యుగము గాని పద్య యుగము కాదు గదా! ఈ బహుమతులు ఓట్లమీద నాధారపడి యున్నవని విన్నాము. ఆ ఓట్లు 'వ్యాయామము' చేయువా రెవ్వరు? సలహాసంఘమువా రందరును. మరి అప్పటికి యెవరికో కొందరికి వారి యిష్టము వచ్చిన వారికి ఈ 'వ్యాయామము' కొఱకు పంపింతురట, ముప్పొద్దులు చక్కగా తినుటయే కాని 'వ్యాయామము' పొంతపోని పొన్నకాయల వంటివారి కీ బాధ యెందుకు? ఈ సలహాసంఘములో నున్నవారైనను గ్రంథములు చక్కగా చదివి నిష్పాక్షికముగా ఈర్ష్య మొదలైనవి లేకుండ గ్రంథములయొక్క గుణాగుణ పరిశీలన చేయుదమన్నవారు కలరో లేరో చెప్పలేము. కాని అందరును పండితులే. అందరును ప్రసిద్ధులే, వారి రుచి భేదములు, వారి గుణాగుణ పరిజ్ఞానము మొదలైనవానిని గురించి చెప్పుటకు మనము సమర్థులము కాము. ఒక్క విషయముమాత్రము నిస్సంశయముగా చెప్పవచ్చును. బహుమతిపొందిన ఇతర భాషా గ్రంథములలో దోషములే లేవని అవి పరమోత్తమ గ్రంథములని చెప్పుటకు ఆ భాష రాని మన మెవ్వరము? నిజముగా అవి అట్టి గ్రంథములైన యై యుండవలయును లేనిచో ఆ గ్రంథములకు బహుమతులు వచ్చుటకు ఆ భాషలలోని సలహాదారు లందరు స్వభాషాభిమానము మిక్కుటముగా కలవారైన నై యుండవలయును.

దీనినిబట్టి మన భాషలో ఏదియో యొక గ్రంథమునకు బహుమతి రావలయును. అది మన భాషకు గౌరవము. మన గ్రంథకర్తలకు మర్యాద అనెడి యభిమానము మన వారికి లేదని నిశ్చయముగా చెప్పవలసి యున్నది. ఎవడో యొక కవి యున్నాడు. వాడు ప్రసిద్ధుడు. ఒక గ్రంథము వ్రాసినాడు. అది మనకు బాగుగా ఉన్నదా లేదా అన్న ప్రశ్న కాదు. మనమను కొన్నట్లు వాడు వ్రాయలేదని మనము దానిని మత్సరించకూడదు. పలుమంది కవులలో వేని మార్గము వానిది. నన్నయ్య గ్రంథము, తిక్కన గ్రంథము, పింగళి సూరన గ్రంథము, ముక్కు తిమ్మన గ్రంథము, చేమకూర వేంకటకవి గ్రంథము ఇవియన్నియు నొక్కసారి బహుమతి కొఱకు వచ్చినవి. ఓట్లీయవలసిన వారైదుగురు. ఐదు గురకు తలా ఒక ఓటు వేసినచో తెలుగు భాషలో కవియే లేడు. ఇదా మనవారి తెలివి? అవునో కాదో చేమకూర వేంకట కవి గ్రంథమునకు ఐదువేల బహుమానము తెచ్చితిమి. ఈ ఐదు గురిలో చేమకూర కవి యెంతటి వాడో మనలో మనకు తెలియును కాని పైవాంధ్ర కేమి తెలియును? వారికి తెలియవలసినదేమిటి? తెలుగులో కూడ గొప్పకవులున్నారు అని మాత్రము వారికి తెలియవలయును. గొప్ప గ్రంథకర్తలున్నారని తెలియవలయును. ఆ చేమకూర కవి గ్రంథమును ఇంగ్లీషులోనికో హిందీ లోనికో భాషాంతరీకరించినచో నది యేమి తక్కువ గ్రంథము? పరభాషావేత్తలాశ్చర్య పోదురు. తిక్కన్ననో, నన్నయ్యనో భాషాంత రీకరించి ప్రక్కన పెట్టినప్పుడు కదా వారికి తెలియును. అప్పుడు మాత్ర మెంతమందికి తెలియును అన్న ప్రశ్న ఇక్కడ నున్నట్లే అక్కడనున్నది.

అందరును సామాన్య సంసారులే. బహుమతి వచ్చినచో బొమ్మలు విరుచుకొని తిరుగుటమాట యట్లు పెట్టి తాత్కాలికముగా కొన్ని చిక్కులు

తీర్చుకొన గలడన్న విషయము మానవ జీవితమునకు సంబంధించినది.

కేంద్ర ప్రభుత్వమువారు మేమైదు వేలిత్తుమో యనుచుండ నేను తినెడిదెట్లను లేదు వారిలో నా యిష్టము వచ్చినవాడు తినవలయును. అన్న భావము స్వార్థమునకు మేన మామ కొడుకు వంటిది. మేము గుణము కల గ్రంధమునకైదు వేలిత్తుము కాని వట్టి గ్రంథమునకీయమని వారు పట్టు పట్టినచో నేటి కాలమున సాహిత్య విషయమున గుణ నిర్ణయము చేసెడివాడు ఇంత వరకు పుట్టినట్లు కనిపించలేదు. ఎవడైన చేసినచో బంగారముతో తులాభారము తూగిన వానిని వెక్కిరించుటకు వంకాయలతో తులాభారము తూగినవాడు ప్రక్క నేయున్నాడు.

అందుచేత వచ్చిన గ్రంథములేవియు చెడ్డవి కావు. దేనికైన నీయవచ్చును. ఓటు అనుట తోడనే దానివెనుక బోలెడంత తతంగమున్నది. అది ప్రజా స్వామ్యమునకు జీవగఱ్ఱ. డబ్బు పెట్టి ఓటు కొనవచ్చును. ఆశ్రయించి ఓటు వేయించుకొనవచ్చును. అభిమానాదులను పురస్కరించుకొని అది సాగవచ్చును. దేనికైనను ప్రయత్నము నిస్సంశయముగా కావలయును. ఆ ప్రజా స్వామ్యము యొక్క లక్షణమట్టిది. మనమేమి చేయగలము ? ఒకశే పుస్తకమునకు కనీసము పది ఓట్లు రావలయునన్నచో గ్రంథము యొక్క మేలిమిని బట్టి వచ్చునన్నది కలలోనివార్త.

ఈ సలహా సంఘము వారందరు కలసియో వారిలో నెక్కువమంది కలసియో మన తెలుగు భాషలో గ్రంథమునకు బహుమతి రాకపోవుట బాగుగా లేదు. అని కూడ బలుకుకొని దేశములో కవులున్నారుకదా ముఠాలున్నవికదా ఈ యేడాదికీ ముఠాకు సంబంధించినకవికి, ముందు నాటికి ఆముఠాకు సంబంధించిన కవికీ ఇట్లు ఏర్పాటు చేసికొన్నచో అన్ని ముఠాలకు బహుమానములు వచ్చును. ఇందులో మరల ముందెవరికి అన్న ప్రశ్న పుట్టించుకొని సుందోపసుందులవలె ప్రవర్తింపరాదు. ముందునాటికి మా కవి బ్రతికియుండునో యుండడో అన్న చింత యక్కరలేదు. చనిపోయినవారి గ్రంథమునకు బహుమతి యిచ్చిన సందర్భమున్నది గదా.

ఇంతకు మేము ఆంధ్ర కవులకు పండితులకు చెప్పెడి దేమనగా మీలో మీరెట్లయినను కండు. మన సీమ దాటిపోయిన తరువాత మనమందర మొకటిగా భావించవలయును. అచట ప్రధానము మీ మాత్సర్యము కాదు. ఆంధ్ర భాష యొక్క గొప్పదనము. మీలో నొక్కొక్కరు దిగ్దంతులవంటివారు. మీలో సమైక్యము లేకపోవుటచేత శతవిధాల మీకంటె తక్కువ శక్తికల యితర భాషాకవులు గొప్పవారగుచున్నారు. ఆంధ్ర సరస్వతి మర్యాదాహీనురాలగుచున్నది. ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత.

# *వసంతఋతువు

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి
కీ. శే. మాదిరాజు విశ్వనాథరావు

కంతుశరసఖము, వీరు
త్కాంతావిభ్రమ నియామకము పికరుతి వి
క్రాంతిస్థాయి విధాయక
మంత వసంతము శుచిప్రియంబై పొలిచెన్.

తముదిను పాములకు నివా
సముల మరచెననుచు గినుకసారించి, పటీ
రమహీధ్రకుంజములు విడు
తమినన నుత్తరముదిక్కుదారె ననిలముల్.

తనరథమును బూనుపురా
తన వాహనములను మార్చ తలపుననో నాన్
దినకరుడు తురగ జననా
వని గల నుత్తరముదెసకు వడి జనబూనెన్.

చెలి! నీపరుషవచస్సుల
నలయామ్యదిశానిలంబు నదలింపకు; మ
త్యలఘు రుషానిశ్వాసా
నిలపటలిని బలిసి వడను నిజముగ బడయున్.

యమదిఙ్మరుదేణము బా
ణమున దునిమిగాలిచాలనం బడచగ గం
దము మలనిలుచు పుళిందున్
దమి ప్రార్థింపగవలయు దలగింప వెతన్.

దీనతయది వృథయగునో
పూనరు వైరము సమీరమున శబరులు, కే
శీనిరతనిజవధూజన
మీనాంకగ్లాని నది శమింపగజేయున్.

పాంథజనపాపమో యామ్యవాయువునకు
బుద్ధిభేదంబుగానిట్లు బుట్టెగాని
కదలబోదు దిశామోహకారణమున
జందన ధరంబుదాటి వేర్పాయనెపుడు.

ఈరీతి దిరుగు పరిమళ
భారపటీరానిలమున బరగె జిరముగన్
గారామఱు వ్యాహారము
లౌరా! భూగృహవసత్ప్రియ స్వగృహిణులకున్.

స్మరసుర విమానసర్గము
సురభిసమస్తర్తు విభవసూచకము, రసో
ర్వీరమణు ప్రసాదమాలిక
కరిగమనాదోలికా వికాసం బొప్పెన్.

దోలాధిరూఢనారీ
లీలాయిత పృథుకటిస్థలీభారనమా
లోలాలంబగు గుణత్రుటి
గ్రాలదు కుసుమాస్త్రశ్రీ భాగ్యకారణమ యగున్.

దోలాక్రీడాందోళన
నాళీకాస్యాపునఃపునర్దర్శనకృ

---

* ఆంధ్రీకృత విక్రమాంకదేవ చరిత్రమండి.

శ్రీలారత జనలక్ష్య వి
శాలత క్షితిదొలగ నతనుశరములు గురిసెన్.

ఊగుడు వేడుక బల్దవు
నూగిమరలు గరితలంది రుప్పరవీథిన్
మూగిన వేల్పు వెలందుల
లో గననౌ సోయగంబులో సగపాలున్.

డోలాలోలాంబుజ నే
త్రాలీ సౌందర్యకలన నభివర్ణింపన్
బోలుం బూవిల్తుడు తగ
గ్రాలెనయేన్ గవితయది పరమహిమచేతన్.

వెలదుల యుయ్యేలలాటలు
గెలకులమల్లికలు, గలయగెరలు లవంగా
నిలములు ముఖ్యాంగరమా
కలనమిదేన్ భువనమోహకారిమ రునకున్.

సారెకు మారంబెగయుచు
జారుచు క్రిందికి నితంబజాడ్యంబబు దో
లారతి క్రాంతి జయించుచు
నారులు పురుషాయితంబు నన్గని రెమ్మెల్.

అలివేణీ స్తనసీమా
దళితుండై శ్వాసమారుతముల బ్రదికి య
త్యలఘుక్లేశత మరుభృ
త్యులలో మలయానిలుడు సమున్నతిగనియెన్.

డోలావిలాసరతలగు
బాలల వదనాబ్జములను బరిచుంబించెన్
మేలిదుకూలములాగెన్
వ్రాలెన్ గటిపై బటీరవాయువు గరిమన్.

కాననచరపుంస్కికచయ
మూనెన్ గలపంచమము సమున్నతి, లీలా
గానాసక్త వధూజన
తానూనచ్ఛాత్ర భావ మందుటకతమో.

వనదేవతాయుతంబుగ
ననయంబుద్యానవాటి నలరెడుపులుగుల్
వనజాక్షులతోపాటుగ
గనె శ్రమ నుయ్యేలలకేళిగ్రాలుకతమునన్.

కరసరసీరుహద్వితయగాఢ
గృహీతవిలోల డోలికా
భరణ సమర్థరజ్జుచయ
వారిజదృగ్జనతానిరస్తవి
స్తరపరిధానబంధనవిధాన
నితంబతటీ నిజోచ్ఛ్వస
న్మరుడురు మోహింతుడగుచు
మ్రాన్పడియెన్ మరు దంత వింతగన్.

కిసలవ్యజననివారణ
మసమీరనికేతనోదరావాసంబు
ల్లసిలె, విరహిణీమూర్ఛా
వసర క్లేశాపనయనపథనూతనమై.

అతిముదమునఁ గోకిల కూ
జితముల లీలాశుకములు సెందె, విరహిణుల్
వెతగని యిలువెలలించిరి
మతిమద్గుణ మదనుఁబట్టి మార్పుఁ గనుఁగదా.

వెలినిలిచిన యలిరవముల
వలన జలియుడుగుట వినుచు బంకోదరమున్
వెలలుచు నలినము పొలిచెన్
గలితాబ్దద్వితయ కన్యకాముఖకాంతిన్.

అరవిరి మొల్లల మొగడల
సరిసొబగగు నవరదముల సౌరునవరలెన్
కరమటపీస్థలుల యొడుల
మరగెడు బాలుండనాగ మధుడు మురువునన్.

క్రమముగ వర్ణజ్ఞానో
ద్యమనియముడు, మధుడు వ్రాయు నక్షరమాలా
క్రమమున మహిఫలకంబున
భ్రమరీపదచిహ్నసుమపరాగం బడరెన్.

ఆనెన్ వననలినాలయ
మానితమలయానిలాతిమానసురభిగా
నూనశ్వాసము, ముగ్ధము,
సూనస్మితదంతురంబు సురభిముఖంబున్.

తరువులనెక్కెను బుప్పొడి
బురుజులపై బొరలెఁదీవ బూవుపలువఁ దా
నురవడిలాగెను, వని గే
శిరతి వసంతుండు సేయలే దెట్టి పనుల్?

యుమదిగనిలరాశీకృత
సుమరేణూత్కరములెల్లఁ జొప్పుసెడనిపై
సమదమధుద్విరదంబున
కమరించిన పాంసుశయ్య లనఁగా బరగెన్.

చరియించె నామ్రతరుమం
జరులన్, జుంబించె సకలనవ్యకలికలన్
తరుణీగణమధ్యస్థుని
కరణి క్షణంబేని నిలువ గన దలి యిటులన్.

రటదలిపటలీకంకణ
వటుచూతనగాళి బాహుపంజరమున, సం
ఘటిత పికమృదు నినదలం
పటుడై హితు గంతు మధుడు పడిఁబొదివె నెదన్.

ఎదిచూతాంకురకందళీ కబళ
నాహీనస్రవఃపేయమై
కదియున్ గాయజజైత్రపత్రిత
బొదన్ గన్నంతనే పంచమం
బదె తాలుస్థల సంకటాటనముచే
నామూల ముస్మూలమై
నవదన్యైథితకామినీగళ
బిలాంతస్సీమలన్ వీడెడున్.

విరహవిధుర వరవర్ణిని
పరంపరాప్రహితచిత్త భవలేఖవచః
పరిమిళితచైత్రవేళా
వరవర్ణన పందు లిడిరి పతికి బ్రియంబున్.

దివాకర్ల వేంకటావధాని

# మణిప్రవాళశైలి : మార్గవులు

మణులను ప్రవాళములను గలిపి సరము గ్రుచ్చి నట్లు దేశాభాషాసంస్కృత శబ్దములను గలిపి వ్రాయు శైలికి మణిప్రవాళమని పేరు. ఈ శైలి యిప్పటికిని మలయాళమునఁ గానవచ్చుచున్నది. మలయాళ లక్షణ గ్రంథములలో నాద్యమైన లీలా తిలకము "భాషా సంస్కృతయోర్యోగో మణి ప్రవాళ" మ్మని యీ శైలిని నిర్వచించియున్నది.

ఞానఙ్ఙుచన్ట్రళవిలే పరిముచ్య గోష్ఠీం
నిద్రాచ్ఛలేన నిజవాసగృహం ప్రజంత్యాః
యన్మేలు మజ్జరయిలుం కుళిరొ్కంగమేలుం
గూఢస్మితార్ద్రిముడనే పతితః కటాక్షః.

మలయాల నైషధమందలి యీ పద్యమును బరిశీలించిన మణిప్రవాళశైలి స్వరూపము బోధ పడును. ఇందు సుబాద్యంతములైన సంస్కృత పదములును, (తత్సమములు కాదు) మలయాళ భాషాపదములును గలగలుపై యున్నవి. ఞాన్ = నేను; అఙ్ఙు = అక్కడికి; చన్ట్రళవిలే = వెళ్లి నప్పుడే గోష్ఠిని విడిచి నిద్రామిషచేఁ దనవాస గృహమున కరుగుచున్న యామె కటాక్షము అజ్జరయిలుం = అగదిలో; యన్మేలుం = నాపైని; కుళిరొ్కంగమేలుం = చల్లనియామె స్తనములపైని; ఉడనే = తోడనే; గూఢస్మితార్ద్రిముగాఁ బడినదని యీ పద్యమున కర్థము. పై నర్థములు వ్రాయఁ బడిన పదములు మలయాళ పదములు. మిగిలినవి శుద్ధ సంస్కృతపదములు. ఈ పద్యమునందలి పద ముల కూర్పు కూడ సంస్కృత శ్లోకములందు వలెనే యున్నది. అర్థము చెప్పుకొనునప్పు డచ్చ టచ్చటఁ జెదరియున్న పదముల నన్వయక్రమము ననుసరించి వరుసగాఁ జేర్చుకొనవలయును.

ఆంధ్రభాషలోఁగూడ నొకప్పు డిట్టిమణిప్రవాళ శైలి యుండెననుటకుఁ దార్కాణములున్నవి. పాల్కురికి సోమనాథుఁడు తన వృషాధిపశతకమున వివిధ భాషలలోఁ బద్యములు వ్రాయుచు నీ మణి ప్రవాళశైలిలోఁగూడ నొక పద్యమును వ్రాసి యుండెను.

'అనయము చేతులందు *భవసంభ్రమసరోజయుగం నమామి* నెమ్మనమున *సంస్మరామి* యను మాటల నిన్ *వరివస్కరోమ్యహ* మ్మనుచు మణిప్రవాళమున నంకనసేయుదు *భక్తలోకహృద్వనజ విహారలోల* బసవాబసవా బసవా వృషాధిపా' ఈ పద్యమునఁ గూడఁ బై మలయాళ నైషధమందలి పద్యము నందువలెనే కొన్ని శుద్ధసంస్కృతపదములున్నవి. తనరోజులలోనో, యంతకుఁబూర్వమో యట్టి శైలి యుండుట నెఱింగినవాఁడగుటచేతనే సోమనాథుఁ డీపద్యమును వ్రాసియున్నాఁడు. కాని యతఁడన్య భాషలుకూడఁ జెక్కు నేర్చినవాఁడగుటచే నందెందో యిట్టి శైలిని జూచి, తెలుఁగునఁగూడ దాని ననుక రించి యుండెనేమో యని యనుమానించుట కవ కాశము లేకపోలేదు. అందుచే నతనికిఁ బూర్వము తెలుఁగున నట్టి శైలి యెచ్చటనైన నున్నదేమో పరిశీలింపవలయును.

ఆంధ్ర శబ్దచింతామణి యందలి "నపదాన్య వ్యయసు ప్తిఙ్త్వాత్వతుమునా" మను సూత్రము తెలుఁగున నవ్యయముల యొక్కయు, సుబంతముల యొక్కయు తిఙంతముల యొక్కయు, క్త్వార్థక ముల యొక్కయు, తుమర్థకముల యొక్కయు పదములు లేవని తెల్పుచున్నది. కేతన యాంధ్ర భాషాభూషణమున "వృక్షేణ దక్షాయ పక్షిభిః

పుత్త్రస్య యను విభక్తులు తెనుంగునకుఁ జొర"వను పద్యమున సుబాద్యంతములైన శుద్ధ సంస్కృత పదముల ప్రయోగమును నిషేధించి యున్నాఁడు. తిక్కన నిర్వచనోత్తర రామాయణము మొదటఁ దాను గావించుకొన్న కవితా నియమములు కొన్ని పేర్కొనుచు, "జాత్యము గా మి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప"నని సిద్ధ సంస్కృత పదములను దెలుఁగున వాడుట జాత్యము కాదని చెప్పియుండినట్లు తెలియుచున్నది. ఈ ముప్వురు నీ విధముగా సంస్కృతాంధ్ర పదముల మిశ్రణమును నిషేధించుట వారి కట్టిశైలి సమ్మతము కాదను విషయమునే కాక, దాని నవలంబించు వారప్పుడో యంతకు ముందో కొందఱుండిరని రూఢిపరచుచున్నది. అట్టి పరిస్థితి యసలే లేనిచో వారట్లు చెప్పవలసిన యక్కరయే యుండదు గదా! భవిష్యద్రచయితల యుపయోగమునకై వారట్లు చెప్పియుండఁ గూడదాయని యెవ్వరైన ననవచ్చును. కాని యట్టి తప్పుత్రోవ యొకటుండినఁ గాని వారికట్లు నిషేధము చెప్పవలయు నను నూహయుఁ దట్టియుండదు. అందుచేఁ బై గ్రంథములు మూఁడును రచింపఁబడిన కాలము ననో యంతకు బూర్వమో తెలుఁగు సంస్కృతముల కలయికతోఁ గూడిన మణిప్రవాళశైలి దేశమున నల్పముగనైన వ్యాప్తిలో నుండెనని యూహింపవచ్చును.

నన్నయకుఁ బూర్వమందలి కొన్ని శాసనములలో నిట్టి మణిప్రవాళశైలి కొంత కానఁబడుచుండుట యీ యూహను బలపరుచుచున్నది.

1. పశ్చిమతోఽవధిః ఓంగోడు నుడ్డిశి గదేబు పళకుపోవు పన్థాః. (రెండవ జయసింహుని పెణుకపఱ్ఱుశాసనము)

2. వాచ్చొ బూళ కొడుకు పల్లవాచార్యస్య లిఖితం (నలజానంపాడు శాసనము)

4. ఉత్తర బుకట్ట కౌణ్డిల్య గోత్రస్య పెన్బాబు దేవశర్మాణ పుత్రస్య అగ్నిశర్మారి కిచ్చినదతి. (చామలూరు శాసనము)

4. శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్ పదియేడగు నేణ్ట విక్రమాదిత్యతనయ శ్రీవిష్ణువర్ధన ప్రసాదా చట్టపాఖ్యేన యిన్ద్రకీల ప్రతిష్ఠితః పాత్రీశ్వరః. (ఇంద్రకీలపర్వత చాళుక్య శాసనము క్రీ. శ. 909)

కొన్ని శాసనములం దెల్లలు తెలుఁగుననే చెప్పఁబడినను, దిక్కులపేర్లు సంస్కృతమున వ్రాయఁబడినవి. పూర్వస్యాందిశి త్రికోణ మడుపుసీమా. పాశ్చేరి వెఱువున కోటలువు. దక్షిణతః మగ్గాణ్డు. ఉత్తరతః మున్నట్టున గట్టగట. దూర్పున కట్టు. (శ)పీన్ది పుట్టరాట వెలుంగ గుంజ చింత్తలు (నం. సి. పి. 13-709 క్రీ. శ.)

ఈ పద్ధతి చూచినప్పుడు సంస్కృత సుబాద్యంతములను దెలుఁగు పదములను గలిపి మణిప్రవాళశైలి వాడు పద్ధతి కొంత యుండినట్లు తెలియుచున్నది.

నన్నయకు సుమారు రెండువందల యేండ్లకుఁ బూర్వమే కన్నడమున మొదటి లాక్షణికుఁడైన నృపతుంగుఁడు తన కవిరాజమార్గములో నిట్టి మణిప్రవాళశైలిని ఖండించి, కన్నడ భాషతో సంస్కృతశబ్దములను గలిపి రచింపఁదగిన విధమునుగూర్చి తేటతెల్లము కావించియున్నాఁడు. ఆ విధము ననుసరించియే పంపఁడు మున్నగువారు గ్రంథరచన గావించియుండిరి. అది తాను స్వయముగాఁ జూచియుఁ, దన సహాధ్యాయుఁడైన నారాయణభట్టు చేసిన సూచన ననుసరించియు నన్నయ భారతమున సంస్కృత పదములఁ బ్రయోగించు పద్ధతిని నిర్ణయించుకొనియున్నాఁడు. అతఁడు మణిప్రవాళమువంక బోక సంస్కృత పదములను దత్సమీకరించి, తెలుఁగు పదములతోఁ గలిపి ప్రయోగించియుండెను. అతని తరువాతి కవులెల్లరును ఆవిధానమునే యవలంబించియుండిరి అట్లుగాక మణిప్రవాళశైలి నుపయోగించెడివా రొకరిద్ద రెవ్వరైన నున్న వారిని నిరసించుటకును, వారి నాదర్శముగాఁగొని యితరులట్టిశైలి నుప

యోగింపరాదని నిషేధించుటకును నన్నయ కేతనలు తమ వ్యాకరణములలో నింతకుముందు పేర్కొనఁబడిన సూచనలు కావించియుందురు.

నన్నయకును దిక్కనకును నడిమి కాలమువాఁడైన నన్నెచోడుఁడు స్వతంత్రించి కొన్ని వింత ప్రయోగములను జేసినమాట నిజమేయయ్యుఁ, దన కుమారసంభవమున మణిప్రవాళము నెచ్చటను వాడియుండలేదు. ఆ శైలియెడ నాతనికి వైముఖ్యముకలదని చెప్పుటకుఁ గుమారసంభవమునందలి యీ క్రింది పద్యము తోడ్పడుచున్నది:

'మార్గకు మార్గము దేశికు
మార్గము వగవంగఁ దమకు మదివదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులమున్'

ఈ పద్యము కు॰ ద్వితీయాశ్వాసములోనిది. మార్గకు మార్గమని యిందలి మొదటిపాదమునఁ జెప్పఁబడి యున్నది. ఇంతకుఁబూర్వము కవిస్తుతిలో నన్నెచోడుఁడు మార్గకవులను బొగడియున్నాఁడు. మార్గకవులను బొగడి మార్గపద్ధతిని గుమార్గమని నిందించుట స్వవచనవ్యాఘాత మనిపించుకొనును. అందుచే నన్నెచోడుఁడే మార్గకుమార్గమని నిందించె ననుకొనుటకంటె నట్లు నిందించువారి నెవ్వరినో యాతఁడీ పద్యమున నిరసించుచున్నాఁడని యనుకొనుట యుచితముగా నుండును. ఇందతఁడు "దుర్మార్గపదవర్తులనఁదగు మార్గవులను" సుకవులు తలంప నక్కఱలేదని చెప్పుచున్నాఁడు. ఈ మార్గవు లెవ్వరు? వారనుసరించిన దుర్మార్గపద మెయ్యది?

మణిప్రవాళశైలి 'దుర్మార్గ' మనియు, దాని నవలంబించిన కవులు మార్గవులనియు, నతఁడు తలంచినట్లూహించుట కవకాశమున్నది. నన్నయకుఁబూర్వము సంస్కృతపదములను దెలుఁగున నెట్లు వాడవలయునను విషయమున రెండు భిన్నమతములుండెనని భావింపవచ్చును. అందొక మతమువారు సంస్కృతపదములను దత్సమీకరించి అనఁగా వానికిఁ దెలుఁగు విభక్తులను జేర్చి తెలుఁగు స్వరూప మొసంగి తెలుఁగున వాడవలయునను వారు. వీరు మార్గకవులు. వీరి పద్ధతి మార్గపద్ధతి. కన్నడమున నృపతుంగుఁడు నిర్ణయించినట్టియుఁ, బంపాది కన్నడకవులే కాక నన్నయాద్యాంధ్రకవులును అవలంబించినట్టియుఁ బద్ధతి యిదే. ఇంక రెండవ మతము వారు సంస్కృతాభిమానులు. సంస్కృతపదములను దెలుఁగున వాడఁదలంచినచో వానికేవిధముగను మార్పక శుద్ధ సంస్కృతములు (సుబాద్యంతములు) గానే వాడవలయునని వీరి యభిప్రాయము. అసలు సంస్కృతపద ప్రసక్తియే లేకుండ దేశిమార్గమునఁ గవిత వ్రాయుట యమార్గమనియు, సంస్కృతపదములను దత్సమములుగాఁ జేసి వాడు మార్గపద్ధతి కుమార్గమనియు వారు తలంచుచుండిరి. అందుచే నసలే మార్గమునుబట్టక మాటాడ కూరకుండరాదా యనిన నది వారికిష్టము లేదు లేక సాధ్యము కాదో? వారు కవిత వ్రాసియే తీరవలెను. అది కుమార్గమైన 'మార్గ' మునఁగాని యమార్గమైన దేశిమార్గమునఁగాని యుండరాదు. వారిది 'తృతీయఃపంథాః'. వారు సంస్కృత సుబాద్యంత పదములనే తెలుఁగుపదములతోఁ గలగలుపు చేసి మణిప్రవాళశైలిని వ్రాయుచుండిరి. అట్టిశైలి నన్నయకేతనతిక్కనాదులకు వలెనే నన్నెచోడునకు సమ్మతము కాకపోవుటచే నతఁడు దానిని దుర్మార్గపదమనియుఁ దత్పథావలంబులు మార్గవులనియు వారిని సుకవులు తలంప నక్కఱలేదనియు నతఁడు చెప్పినట్లు తోఁచుచున్నది. మాఱు+కవులు = మార్గవులు. ఉన్న దేశిమార్గమార్గములలో దేనిని నవలంబింపక మాఱుమార్గమున వలంబించిన వారగుటచే నన్నెచోడుఁడు వారిని మార్గవులనియు నిరసించి యుండును. కొన్ని ముద్రణములలో "మార్గకవులఁ దలఁప నలతి" యను పాఠమున్నది. దానికన్న మార్గవుల నను పాఠమే యుచితతరము.

ఆంధ్రకావ్యములలో నచ్చటచ్చట సంస్కృత వాక్యములను, జాతీయములను జొప్పించు నాచారము కలదు. 'ఆనందో బ్రహ్మ'యటన్న ప్రాఁజదువు.

'దుర్బలస్య బలం రాజా' యన విన వే, 'ద్వేష్టిగతా యుశ్చ చికిత్సక' మ్మను మొదలగున విట్టివే. ఇవి సాధారణముగా అనుధాతురూపానుప్రయుక్తములై యుండును.-రామదాస తవ దాసోహమ్మను న్నందనా, 'నమో విశ్వసృజే' మున్నగు ననుధాతు రూపములు లేని వాక్యములు కూడఁ గొన్ని యున్నవి. ఇవికూడ నొకరీతి మణిప్రవాళ పద్ధతికే చెందును. కాని యిట్టివాని సంఖ్య చాల తక్కువ.

ఆధునిక కాలమునఁ గొందఱు తెలుఁగుభాష మాటలాడుచు నడుమ నడుమ ఆంగ్ల హిందీ పదములను జొప్పించుట కలదు. కాని యప్పుడు వాని నాయా భాషలకు సంబంధించిన విభక్తి ప్రత్యయములతోనో 'ప్రిపొజిషను'ల తోనో కలపి వాడక, తెలుఁగు పదములుగాఁ జేసి వాడుచుందురు "నేను వానిని రోడ్డు మీఁద చూచితిని" అనునట్టి వందుకుదాహరణములు. "నేను వానిని ఆన్ ది రోడ్ చూచితిని" అని ప్రయోగించినచో నిది యొక విధమైన మణిప్రవాళమగును. ఇట్టి వాక్యములు శ్రవణపేయములుగా నుండవు. పరభాషలనుండి పదములను గ్రహించుటలో దోషము లేదు. ఆంగ్ల భాషలోఁ గ్రొత్తగా నిఘంటువును ముద్రించు నప్పుడెల్ల నందు సుమారైదాఱువందల పరభాషా పదములను జేర్చుచుందురఁట; అనఁగా నా పదములా భాషలోఁ బ్రవేశించి యవిరళముగా నుపయోగింపఁబడుచుండు నన్నమాట. అట్లే యత్యవసరములైన పదములను మనమును గ్రహించి మనభాషకు బుష్టికలిగించుకొనవచ్చును. కాని యనవసరముగా వానిని గ్రహించుటయు, గ్రహించినను వాని "నాంధ్రీకరింపక" యన్యభాషా సంప్రదాయముల తోనే వాడుటయు భాషకు వికృతి చేకూర్చును. అందుచేతనే తమ కాలమునందలి పండితులు కొందఱు మణిప్రవాళశైలి వాడినను, నన్నయ తిక్కనాదులు దానిని నిషేధించి నిరసించి యుండిరి.

కొర్లపాటి శ్రీరామమూర్తి

# ఆంధ్ర వచనరచన
## విమర్శ-పరామర్శ

[నేను 'సశేషము'తో పంపిన వ్యాసమును 'సశేషములేకుండ ప్రచురించుచున్నాము' అని 31-10-58 తేదీని ఉత్తరము వ్రాసి, నవంబరు భారతిలో భారతి సంపాదకులు అట్లు 'సశేషము లేకుండ' ప్రచురించిరి. అది 'సశేషము' అని లేకపోయినను 'సశేష వ్యాసము' అని అర్థమగు విషయము. అయినను ఆ పరిజ్ఞానము లేకుండ, ఆ నా సశేషవ్యాసముపై, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు వ్రాసిన 'విమర్శ'ను జనవరి భారతిలో భారతి సంపాదకులే ప్రచురించిరి. నా వ్యాసముపై ప్రచురించిన 'విమర్శకు' నేను సమాధాన వ్యాసమును 2-2-59 తేదీని పంపితిని. అందుకు భారతి సంపాదకులు 17-2-59 తేదీని ఆ వ్యాసము 'సంగ్రహించి పంపగలరని ఆశిస్తున్నాము' అని ఉత్తరముతో సహా నాకు అందజేసిరి. భారతి సంపాదకుల మాటప్రకారము అట్లు సంగ్రహించి ఆ రోజునే మరల వ్యాసమును పంపితిని. అట్లు పంపిన వ్యాసమును ప్రచురింపకుండ 9-3-59 తేదీని భారతి సంపాదకులు నాకు మరల పంపివేసిరి. ఈసారి నిరుత్తరముగా. ఆ వ్యాసమును అక్కడక్కడ పెంచి ఇప్పుడీ పత్రికా ముఖమున అందజేయుచున్నాను.]

ప్రథమతః నావ్యాసముయొక్క స్వరూపముకాని, కపీసమా వ్యాసమునకు గల శీర్షికగాని, అధమపక్షమా వ్యాసమున కల "ఆయా ప్రకరణములు....ప్రాయికవచనము ప్రబంధ వచనము అను ప్రత్యేక శీర్షికలు....వక్ష్యమాణములు" అను మాటలుగాని నిడదవోలు వెంకటరావుగారు అర్థము చేసుకొనలేదనుటకు వారి విమర్శయే నిదర్శనము. నేను ప్రచురించిన వ్యాసము ఒక ప్రకరణము. అది ఒక ప్రకరణము అని మరి ఆ వ్యాసములోని 'ఆయా ప్రకరణములు' అను మాటవలన అర్థమగు విషయము. అంతేకాదు. ప్రచురితమైన ప్రకరణమది ప్రచురణీయ గ్రంథమునకు ఉపోద్ఘాత ప్రాయమని కూడ ఊహకలవానికి తోచు విషయము. అట్టి వ్యాసమున ఇతఃపూర్వ వచనవాఙ్మయ గ్రంథములకు ప్రమేయము కల ప్రత్యక్ష సూచనలు, పరోక్ష సూచనలు కలవు. "అయినను అభిన్నములని ఒకరి వ్రాత. అది మరి అవిచారితరమణీయము" అను నా వ్యాసములోని వాక్యము (పుట 19) నిడదవోలు వెంకటరావుగారి గ్రంథమునకే పరోక్ష సూచన. వారు వ్రాసినది తప్పు. అయినను 'పెద్దవారు కదా! పేరెత్తి యేల దోషోద్ఘాటన చేయవలె'నని పరోక్ష సూచన చేసినందుకు కోపమువచ్చినది కాబోలు వారికి! "వ్యాసకర్తకు ఇతఃపూర్వ మాంధ్ర వచనరచన గురించి గ్రంథము లున్నట్లు తెలియలేదని స్పష్టమగుచున్నది" అని విమర్శకు ఆరంభము. వ్యాసకర్తకు ఇతఃపూర్వ మాంధ్ర వచనరచన గురించి గ్రంథము లున్నట్లే గాక ఆ గ్రంథములలో ఒకరి గ్రంథమున తప్పులు కలవని కూడ తెలిసినట్లు స్పష్టమగుచున్నది కదా! మరి నిడదవోలు వెంకటరావుగారు అట్లెందు కూహించిరో!

ఇక "వ్యాసకర్తకు వచనరచనా భేదములు వాని లాక్షణిక సంప్రదాయార్థములు, కవి ప్రయోగసరళి, అవగాహన కాలేదని" కూడ వారికి "అందలి విషయములే విశదము చేయుచున్న" వట! సంస్కృతమున చూర్ణలక్షణము అనావిద్ధ లలితపదము. అనగా సమాసములు లేని సరళవచనము. తెలుగున చూర్ణిక లక్షణము సమాసాదికము. అనగా సమాసములు కల కఠినవచనము. అట్టి సంస్కృతచూర్ణము తెలుగుచూర్ణిక 'ఒకటే' అని నిడదవోలు వెంకటరావుగారికి తెలిసివ్రాసిన "లాక్షణిక సంప్రదాయార్థము." మరి "సమాసములు కల వచనముకంటె సమాసములు లేని వచనము వేరు" అని వ్యాసకర్తకు తెలిసివ్రాసిన లాక్షణికార్థము. కనుక "లాక్షణిక సాంప్రదాయార్థము" మా యిరువురిలో ఎవరి కర్థము కాలేదో పాఠకులు నిర్ణయింపవలయును.

"గ్రంథసూచనలు లేనిచో నది పరిశోధనయే కాదు" అని నిడదవోలు వెంకటరావుగారి 'విమర్శ' లోని ఒక సుభాషితము! మరి ప్రథమతః ప్రచురించిన నా వ్యాసమున

ప్రమేయము కల గ్రంథములకు-అముద్రిత గ్రంథములకు కూడ-సూచనలు కలవు. తదుపరి ప్రసిద్ధమైన పండితారాధ్య చరిత్రలోను, హరివంశములోను కలవన్న విషయములకు గ్రంథసూచన లెందులకు ? ఆ గ్రంథముల పరిచయము పరిశోధన వ్యాసపాఠకులకు ప్రాథమిక లక్షణము కదా ! కాక గ్రంథసూచనలగంపెడొక పరిశోధనమా ? అదే పరిశోధనమను నిడదవోలు వెంకటరావుగారు తమ విమర్శలో అవసరమైన వానికి గ్రంథసూచన లొసగలేదు. ఏయే స్థలముల ఎట్టి గ్రంథసూచనలు నిడదవోలు వెంకటరావుగారు ఒసగలేదో ముందున్నది.

మల్లికార్జున పండితుడు బాణగద్య, పంచగద్య వ్రాయలేదను నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయ మిది గమనార్హము.

"బాణగద్య పేరే అది బాణుని కృతియని తెలివిడి చేయుచున్నది. మహిమప్రకరణములో ఏ విషయము ప్రత్యక్షముగా నున్నది...."హరుఁబూన్చి బాణగద్యావసానమున".... కాబట్టి బాణగద్య పండితారాధ్యకృతము కాదు. సోమనాథుడు మహిమ ప్రకరణములో బాణగద్యగూర్చి చెప్పిన వెనుక కాళిదాసు కూడ నొక గద్య చెప్పినట్లు వ్రాసియున్నాడు. కావున పంచగద్యలలో కాళిదాసు గద్యము కూడ చేరెనేమో తెలియదు."

కాళిదాసుగద్యమే యేమి కర్మము ? వాల్మీకి గద్య వ్యాసుని గద్య కూడ చేరెనేమో తెలియదుకదా ! బాణగద్య పేరే అది బాణుని కృతియని "తెలివిడి" చేయుచున్న మరి అక్షరగద్య పేరే అది అక్షరుని కృతి, పంచగద్య పేరే అది పంచుని కృతి అని కూడ "తెలివిడి" చేయలేదా ? ఇంతకు నిడదవోలు వెంకటరావుగారికి *ప్రత్యక్షముగానున్న* మహిమ ప్రకరణములోని విషయము కట్టుకథ. ఆ కట్టుకథ ఇది : 'మయూరుడు సూర్యశతకము చెప్పగా సూర్యుడు ప్రత్యక్షమై శివుని ప్రార్థింపుమనగా, మయూరుడు మయూరస్తవము చెప్పగా మయూరునికి కుష్ఠురోగము పోయినదట ! అది చూచి బాణుడు తన రెండు చేతులు తెగగొట్టుకొని 'పద్య గద్యావసానముల హరుఁబూన్చి'. (బాణగద్యావసానమున అను పాఠమునకు స్పష్టార్థప్రతిపత్తిలేదు) శివుని ప్రార్థింపగా ఆ రెండు చేతులు యథాప్రకారము వచ్చినవట ! అది చూచి అమాంతము కాళిదాసు ఉన్న రెండు కన్నులు పెరికికొని పరమేశ్వరార్పణముచేసి, గద్య చెప్పగా కాళిదాసునకు కన్నుల దానులు వచ్చినవట ! ఈ కట్టుకథను బట్టి బాణగద్య పంచగద్య పండితారాధ్యములు కావట ! ఈ నిర్ణయము ఎంత అందముగ నున్నదో స్పష్టమగుచున్నది కదా ! ఈ నిర్ణయమును నిడదవోలు వెంకటరావుగారు ఇప్పుడు చేయుటకాదు. ఎప్పుడో ఒక ఇంగ్లీషు వ్యాసమునే వ్రాసిరి.

"లింగోద్భవగద్య కాదు లింగోద్భవ దేవగద్య. శ్రీముఖ గద్య కాదు, శ్రీముఖ దర్శనగద్య" అని నిడదవోలు వెంకటరావుగారి నవరణ !

ఆంజనేయ దండకము కాదు శ్రీ ఆంజనేయస్వామివారి దండకము ; ఆముక్తము కాదు ఆముక్తమాల్యద అని కూడ నిడదవోలు వెంకటరావుగారు సవరణ చేయుదురుకదా ! నామైక దేశగ్రహణ మొక సంప్రదాయము. అంతేకాదు; పైగద్యలకు పై విధముగ ఆంధ్ర సాహిత్యమున వ్యవహారము కూడ కలదు. ఆంధ్ర కవి తరంగిణిలో లింగోద్భవ గద్య అని యుండుట నిడుదవోలు వెంకటరావుగారు చూచి యుండరు.

ఇక "బసవ పురాణ ప్రథమ ముద్రణపీఠికలో అద్యంతములు ప్రత్యక్షముగా కనబడుచుండగా వ్యాసకర్త 'అనుపలబ్ధమగు శ్రీముఖగద్య' అని వ్రాయుట యెట్టిదో పాఠకు లూహింపగలరు. అనుపలబ్ధమని వ్రాయుటచే వ్యాసకర్త శ్రీముఖగద్య చూడలేదని స్పష్టము" అని కూడ వ్రాసిరి. వ్యాసకర్త శ్రీముఖగద్యను చూడలేదు. శ్రీముఖగద్య అద్యంతములు బసవ పురాణ ప్రథమ ముద్రణ పీఠికను చూడక పోలేదు. వ్యాసకర్తకు గద్య అనగా పట్టికలలోని, పీఠికలలోని అద్యంతములు కావు. ఆ గద్యయొక్క అద్యంత గ్రంథమే వ్యాసకర్తకు గద్య. మరి వ్యాసకర్త ఆ గద్యను చూడలేదు. నిడదవోలు వెంకటరావుగారు చూచిన పీఠికలోని అద్యంతములే ఏల ఉదాహరింపవలెను ?

"వ్యాసకర్తకు వచనము, చూర్ణిక, విన్నపము అన్నియును ఒకటే. గద్యము వచనము సమానార్థకములు" అని నిడదవోలు వెంకటరావుగారి మరొక విమర్శ.

మరి వచనము చూర్ణిక విన్నపము ఒకటే అన్న సందర్భమున వివరణమిది. "*తెనుగులోని చూర్ణిక, వచనము, విన్నపము వస్తుపరముగా నొకటి.* అంతేకాదు. కొన్ని వచనములందు విన్నపములందు సమాసరచన కలదు. *తెనుగులోని చూర్ణిక వచనము విన్నపములందు రీతి వివక్ష దుర్ఘటము.* ఆ మూడును ఒకటి." అని నా ప్రతిపాదన. ఇది పుస్తకభాండార పట్టికలలోని, పీఠికలలోని అద్యంతములు చూచిన అర్థమగునది కాదు. ఆయా చూర్ణికలు వచనములు విన్నపములయొక్క పూర్తి గ్రంథములను చూచిన అర్థమగునట్టి విషయము. ఇక గద్యము వచనము వ్యాసకర్తకే సమానార్థకములు కావు. తిక్కన సోమయాజికి సమానార్థకములు. సంస్కృతాంధ్ర సాహిత్యములకు సమానా

కములు. సంస్కృతమునందు వచన శబ్ద వ్యవహారము మృగ్యము. బాహాటమైన గద్య శబ్ద వ్యవహారము వచనార్థకమే. ఆంధ్రమున వచన, గద్య శబ్ద వ్యవహారము సమానార్థకము. పర్వాంధ్ర లాక్షణికుల గద్య శబ్ద వ్యవహారము వచనార్థకమే. తిక్కనసోమయాజి ప్రయోగములివి గమనార్హములు.

"వాక్య సాంగత్యము సేయుచోనయిన గద్యముతోడుగఁ జెప్పిపెట్ట." 14

"వచనము లేకయు వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయము పద్యములన పొం
దుచితంబుగఁ జెప్పు టార్యు లొప్పిదమనరే." 15

—*నిర్వచనోత్తర రామాయణము*

"మహాకవిత్వ దీక్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్."

—*విరాట పర్వము*

"తెనుంగుబాస గద్యమ్ముకు బద్యముం బెరయ వంచిత భావ రసోదయాభిరామ" మనియే కేతన అభిప్రాయము. అంతేకాదు.

"*గద్యా* మది దాఁదెనుఁగుకృతుల *వచన* మనఁగ దీపించుగడున్."

—*అనంతుడు*

"ధర సాహిత్యము గద్య పద్యములనం దా రెండు భేదంబులై పరగున్ *గద్యమునందుఁ బాదనియతుల్ భావింపగాలేవు*—"

—*అప్పకవి*

అయినను తిక్కన "వచన" శబ్ద ప్రయోగమునకు నిడదవోలు వెంకటరావుగారి విపరీతార్థ వ్యాఖ్యాన మొకటి కలదు. ప్రత్యేక వ్యాసమున అది ప్రపంచనీయము. త్వరలోనే ప్రకటించుచున్నాను. అదటుంచి, ప్రకృతము చూపిన పై ప్రయోగములను బట్టి వచన గద్యములు సమానార్థకములు అను వ్యాసకర్తఅభిప్రాయము ప్రామాణికమో అట్లు కాదను నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయము ప్రామాణికమో మరి పాఠకులు నిర్ణయింతురుగాక!

"నేటి ముద్రణముల - అశ్వాస మధ్యమున వచనమునకు 'వ' అని, అశ్వాసాంతమున 'గద్య' అని యేల ముద్రితములైనవో వ్యాసకర్త విచారణ చేయలేదు." అని కూడ నిడదవోలు వెంకటరావుగారి విమర్శ. వారు చేసిన విచారణ మిది వ్యాసకర్త చూడలేదని కాబోలు. ఆ విచారణమే కాదు అందుకు ప్రాతిపదికమైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విచారణమును వ్యాసకర్త చూచినాడు. అంతేకాదు. అశ్వాస మధ్యమున 'గ' అని ముద్రితములైన గ్రంథములను వ్యాసకర్త చూచినాడు. తెనుగుదేశమునందే ముద్రితమైన వెంకటాధ్వరి విశ్వగుణాదర్శ చంపూకావ్యమును వారు చూడలేదేమో!

"సింహగిరి వచనాదులను గద్యలని యనవచ్చునా? ప్రమాదవశమున లేఖకులట్లు వ్రాసిరా? ఒక్క యుదాహరణమైన చూపగలరా?" అని నిడదవోలు వెంకటరావుగారి ప్రశ్నలు.

ప్రథమతః వ్యాసకర్తకు లేఖకుల ప్రమాదములు ప్రమాణములు కావు. తదుపరి పేరులు పెట్టుట వ్యాసకర్తపని కాదు. లక్షణమును చూపుట లక్ష్యవ్యత్యాసమును చూపుటమాత్రము వ్యాసకర్త కర్తవ్యము. అముద్రితములైన అనేక వచనములటుంచి, సుముద్రితములైన "పురాతన శంకర వచనములు" అను పుస్తకమును "ఆద్యంతములు" గాక ఆద్యంతమును చూచిన వచనములందు గద్యలక్షణము కనిపించగలదు. సింహగిరి వచనములను పట్టికలోని ఆద్యంతములు గాక తాళపత్రగ్రంథములోని ఆద్యంతమును చూచిన అట్టి వచనములు కనిపించగలవు.

## సింహగిరి నరహరి వచనము

"దేవా! శ్రీమన్నారాయణ! పరబ్రహ్మస్వరూప! అఖిలాండకోటిబ్రహ్మాండనాయక!....*కుంభ నికుంభ కుంభకర్ణ కరవారణ శిరఖండన! మకరాక్ష ధూమ్రాక్ష విరూపాక్ష!* అతికాయ మహాకాయ మదగర్వ సంహార!...."

"*శ్రీ విశ్వంభర విశ్వపతి విశ్వమయ విశ్వరూప విశ్వాత్మక విశ్వజనక ఐశ్వర్య శాశ్వత కళావతంస!* త్రిమూర్తి మత్స్య కచ్ఛప వరాహ నరమృగ విప్ర భూపతి రామరామకృష్ణ బౌద్ధ తురగ సమారంభ సహస్రలీలావిలాస!"

## పురాతన శంకర వచనము
## (భవానీమనోహర మకుటము కలది)

"పరమేశ్వరా! భవదీయ *జటాజూటాంతర్గత* మందాకినీ కల్లోల నిర్ఘోషంబుననో... దృప్తనప్తవ్యాననతిమితిమింగల *తద్గిలాది* మహామీనకృత సమ్మర్దంబుల వలనను, తాపత్రయ మహాకచ్ఛపాచ్ఛాదనంబుల వలనను, ప్రచండ దుఃఖౌఘ ఫేన బుద్బుదోద్రేకంబుల వలనను, *భీషణతరేషణత్రయ* పాషాణ సంకీర్ణంబుల వలనను....యఖిల పాపౌఘలతా లవిత్రంబైన మీ స్మరణ నా కొసంగి రక్షింపవే భవానీ మనోహరా!"

అనుకరణశబ్దయుక్తంబైనది గద్య మని అర్వాచీన లాక్షణికుని నిర్వచనము. పై ఉదాహరణములందు అనుకరణ శబ్దయుక్తత కనిపించుటలేదా ? కనుక వ్యాసకర్త ప్రతిపాదన సరియైనదో, నిడదవోలు వెంకటరావుగారి విమర్శ సరియైనదో పాఠకులు నిర్ణయింతురుగాక !

"వెంకటేశ్వర వచనములు ఇట్టివి యున్నట్టుగా వ్యాసకర్తకు తెలియదేమో" అనికూడ వారి అనుమానము. మరి వ్యాసకర్త ప్రచురించిన వ్యాసమునందు "వెంకటేశ్వర వచనములు" స్పష్టముగా సరిగా పేర్కొన్నసంగతి. (పుట 23). అయినను నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయమిది. దీనినిబట్టి నిడదవోలు వెంకటరావుగారి "విమర్శన" విధానము స్పష్టతరమగుచున్నదికదా !

"హిమగిరి వచనముల మాటయే ఈ వ్యాసమున లేదు."

అసలెందుకుండవలెను ? "మొదలగునవి" అని వ్రాయలేదా ? కాక వ్యాసకర్త "తద్వచనములే ప్రథమములు. తత్కర్తలే ప్రథమాచార్యులు." అని వ్రాసినది సింహగిరి వచనములను చెప్పదలచియే. కారణము సింహగిరి నరహరి వచనముల కర్త కృష్ణమాచార్యులు వచన వాఙ్మయ ప్రథమాచార్యులు అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయమే. కనుక గ్రహింపవచ్చునుకదా. "సింహగిరి నరహరి వచనములకు" బదులు "ఏగంటి వచనములు" అని వ్యాసకర్త ప్రచురించిన వ్యాసమున ఉండుట ప్రామాదికము. ఇంకను కృష్ణమాచార్యులు వచన వాఙ్మయ ప్రథమాచార్యులు అను నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము తప్పు. ఈ విషయమై ఒక ప్రత్యేక వ్యాసమును త్వరలో ప్రకటించుచున్నాను.

"వచనములకు పదములని కీర్తనలని గీతములని వ్యవహారమున్నదనుమాట వ్యాసకర్త కెఱుకలేదు."

అసలు వ్యాసకర్త ప్రచురించిన వ్యాసమునకు విషయమేదియో నిడదవోలు వెంకటరావుగారికి "ఎఱుక" యున్న ఇట్టి ప్రసంగము చేయరు. చేసినతరువాత ఈ వారి "ఎఱుక" వారి "విమర్శ" లోనే లేదని ఇంకను వివరింపబడుచున్న విషయము.

"వ్యాసకర్త సంకీర్తనలక్షణమును చూడలేదు. చూచియుండిన యిట్లు వ్రాసియుండరు. సంకీర్తనలక్షణములో వచనమునకు చూర్ణపదాఖ్యమని లేదు. అక్కడనున్న లక్షణమిది:

కం. ధరఁ గృష్ణాచార్యాదిక
 పరికల్పితపదము........

కం. ఛందో గణముల నియతిం
 బొందక..................

ఇచట పదము అని తప్ప వచనము అనుమాటయే లేదు."

ఇంతకుముందేకదా వచనమునకు పదములని వ్యవహారము కలదనుమాట వ్యాసకర్త కెఱుకలేదని నిడదవోలు వెంకటరావుగారి విమర్శ! ఇంతలోనే మరి ఇక్కడ 'పదము అని తప్ప వచనము అనుమాటయే లేదు'. అను నిడదవోలు వెంకటరావుగారి విమర్శ. కృష్ణమాచార్యుల పదములే కృష్ణమాచార్యుల వచనములు అను "ఎఱుక" లేనిది ఎవరికి ? పైగా వ్యాసకర్త సంకీర్తన లక్షణమును చూడలేదట. మరి సంకీర్తన లక్షణము చూడనిది ఎవరు ? అసలు వ్యాసకర్త వ్రాసిన వాక్యము "*తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తన లక్షణ వ్యవహారము*" అని. ఇందుకు నిడదవోలు వెంకటరావుగారు ఉదాహరించిన పద్యములు *తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమడు చినతిరుమలాచార్యుల సంకీర్తన లక్షణములోనివి ;* తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తన లక్షణము సంస్కృత గ్రంథము. నిడదవోలు వెంకటరావుగారు ఉదాహరించినవి తెనుగు పద్యములు. మరి సంస్కృత గ్రంథములో తెనుగుపద్యము ఉండునా ? కాక అన్నమాచార్యుల సంకీర్తన లక్షణము అనుపలబ్ధ సంస్కృతగ్రంథము అని వేటూరి ప్రభాకర శాస్త్రిగారి స్పష్టప్రతిపాదన. అయినను లక్షణములు అన్నమాచార్యకృతములే. పద్యములు చినతిరుమలాచార్యుల ఆంధ్రీకృతములే.

తిరుపతి దేవస్థానమువారు ప్రచురించిన తెనుగు సంకీర్తన లక్షణముయొక్క ముఖముచూచిన ఇది తెలియనగు విషయము. అంతేకాదు. అవతారికలోని 15, 16, 17 పద్యములు చదివిన ఇది అర్థమగు విషయము. అట్టిది తెనుగు సంకీర్తన లక్షణము తాళ్ళపాక అన్నమాచార్యులు వ్రాసినట్లు నిడదవోలు వెంకటరావుగారు బహుథా వ్రాయు సంగతి. మరి వారు సంకీర్తన లక్షణమును చూచిరట. వ్యాసకర్త చూడలేదట ! ఇంతకు వారు ఉదాహరించిన మొదటి పద్యము తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన గ్రంథములోని పద్యమువలె లేదు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సింహావలోకన గ్రంథవ్యాసములోనిపద్యమువలె కలదు. ఈ విమర్శలోనే కాదు ఇతఃపూర్వము నిడదవోలు వెంకటరావుగారి "ఆంధ్ర పత్రిక ఖర సంవత్సరాది సంచికలో వ్యాసము" నందు, "ఆంధ్ర వచన వాఙ్మయము" అను గ్రంథరాజమునందును అంతే. ప్రభాకరశాస్త్రిగారి వ్యాసమునందు ఆ పద్యమే కాదు. చినతిరుమలాచార్యుడు తన తాత

రచించిన సంకీర్తనలక్షణమును దెలుఁగునకుఁ బరివర్తనము చేసెను. అందీ వచనరచనల నిర్వచన మిట్లున్నది. "ధరఁ గృష్ణాచార్యాదిక పరికల్పిత పదము" "ఛందోగణముల" అని కూడ కలదుగదా! అంతే కాదు. "అన్నమాచార్యులు - సంకీర్తనలక్షణము (సంస్కృతము. ఇది దొరకలేదు)" అనికూడ ప్రభాకరశాస్త్రిగారి వ్యాసమున స్పష్ట ప్రతిపాదన. అయినను సంస్కృత గ్రంథములోనుండి తెనుగు పద్యములను ఉదాహరించుట, వ్యాసకర్త సంకీర్తన లక్షణమును చూడలేదనుట నిడదవోలు వెంకటరావుగారి అభ్యస్తవిద్య.

"పొత్తపి వెంకటరమణ కవి గ్రంథము పేరు లక్షణ దీపిక. లక్షణ శిరోమణి కాదు. లక్షణదీపిక అచ్చుపడలేదు. వ్యాసకర్త తానే గ్రంథమునుండి గ్రహించెనో చెప్పలేదు." అని నిడదవోలు వెంకటరావుగారి అసలు విమర్శ.

ప్రథమతః ఇది తాను ప్రభాకరశాస్త్రిగారి వ్యాసమునుండి గ్రహించినట్లు వ్యాసకర్త చెప్పిన సంగతి. చెప్పలేదని నిడదవోలు వెంకటరావుగారి బుకాయింపు. అంతే కాదు. పొత్తపి వెంకటరమణకవి గ్రంథము పేరు లక్షణదీపిక అని యొక అపూర్వసిద్ధాంతము! నిడదవోలు వెంకటరావుగారి ఇతఃపూర్వ ఖర సంవత్సర వ్యాసమునను, 'ఆంధ్ర వచన వాఙ్మయమునను' లక్షణ శిరోమణి అనియే కలదు. అట్లు కలదు గాన అప్పుడు నిడదవోలు వెంకటరావుగారు పొత్తపి వెంకటరమణ కవి గ్రంథమును చూడలేదని అర్థమగుచున్నది కదా! అయిన మరి ఆ విషయము నెక్కడనుండి గ్రహించిరో నిడదవోలు వెంకటరావుగారే చెప్పలేదు. వారిప్పటికిని పొత్తపి వెంకటరమణకవి గ్రంథము చూడలేదు. చూచియుండిన ఇట్లు వ్రాయరు. పొత్తపి వెంకటరమణకవి గ్రంథము పేరు లక్షణ దీపిక కాదు. లక్షణ శిరోమణియే. పొత్తపి వెంకటరమణకవి గ్రంథము అచ్చుపడకపోయినను ఆంధ్ర సాహిత్య పరిషత్ గ్రంథాలయమున కలదు. అంతే కాదు. ఆ గ్రంథాలయమువారి పట్టికనైన చూచిన ఇది స్వయంవేద్యమగు సంగతి.

"1. లక్షణ శిరోమణి. గ్రంథ సంఖ్య 1287. ఇది పొత్తపి వెంకటరమణకవిచే రచియింపబడినది."

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార పట్టికయందును లక్షణ శిరోమణి అనియే కలదు. R. No. 679 & D. No. 1456. అయినను మరి అది లక్షణశిరోమణి కాదు లక్షణదీపిక అను నిడదవోలు వెంకటరావుగారి విమర్శ ఎట్టిదో పాఠకులకు స్పష్టతరమేకదా! అంతే కాదు. పొత్తపి వెంకటరమణ కవి లక్షణ శిరోమణిలో వార్తాకవి రాఘవయ్య వ్రాసినది లక్షణదీపిక అని స్పష్టముగా కలదు. కనుక ఇప్పుడైన నిడదవోలు వెంకటరావుగారు అచ్చుపడని గ్రంథముయొక్క అసలుపేరు తెలిసికొనుట అవసరము.

సంస్కృత చూర్ణములు, తెలుగు చూర్ణిక లక్షణములను బట్టియే భిన్నములని స్వయంవేద్యమానములు. అయినను అభిన్నములని ఒకరి వ్రాత. అది అవిచారిత రమణీయము అని నేను వ్రాయగా ఆ వాక్యము నాకే అన్వయించుచున్నదని నిడుదవోలు వెంకటరావుగారు వ్రాసిరి. నేను వ్రాసిన 'సంస్కృతములోని చూర్ణము, చూర్ణకము, తెలుగులోని చూర్ణపదము రీతిపరముగా నొకటి' అన్నదాని నుదాహరించి నా వాక్యములు స్వవచన వ్యాఘాతములని వ్యాఖ్యానించిరి. సంస్కృతమున "అనావిద్ధ లలితపదమ్ చూర్ణమ్" అని వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిలోని లక్షణము. ఆ లక్షణమునకు సమాసములులేని సరళవచనము అని అర్థము. అట్లే సంస్కృతములోని చూర్ణకము అల్పసమాసకము అని విశ్వనాథుని సాహిత్య దర్పణములోని లక్షణము. ఈ రెండు లక్షణములకు ఆ లాక్షణికు లొసగిన ఉదాహరణ లివి:

వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి

అనావిద్ధ లలితపదం చూర్ణమ్. 24

అనావిద్ధా న్యదీర్ఘసమాసాని లలితా న్యనుద్ధతాని పదాని యస్మిం స్తదనావిద్ధ లలితపదం చూర్ణమితి.

యథా *అభ్యాసోహి కర్మాణాం కౌశలమావహతి ! నహి సకృన్నిపాత మాత్రేణోదబిందురపి గ్రావణి నిమ్నతా మాదధాతి.*

విశ్వనాథుని సాహిత్యదర్పణమ్

"వృత్తబంధోజ్ఝితం గద్యం ముక్తకం వృత్తగంధి చ
భవేదుత్కలికా ప్రాయం చూర్ణకంచ చతుర్విధమ్
ఆద్యం సమాసరహితం వృత్తభాగయుతం పరమ్
అన్య ద్దీర్ఘసమాసాఢ్యం తుర్యం చాల్పసమాసకమ్. 630

చూర్ణకం తథా మమ: "గుణరత్నసాగర, జగదేకనాగర, కామినీమదన, జనరంజన" ఇత్యాది.

ఇక తెనుగులోని చూర్ణిక సమాసాధికమని పొత్తపి వెంకటరమణకవి లక్షణమే. చూర్ణపద మను కృష్ణమాచార్యుల వచనములు కొన్ని అల్పసమాసకములు. మరి అల్ప సమాసకములైన తెనుగు చూర్ణపదము, సంస్కృత చూర్ణచూర్ణకములకంటె సమాసాఢ్యమైన తెనుగుచూర్ణిక భిన్నము కాదా? "సంస్కృతచూర్ణము తెనుగుచూర్ణిక" అభిన్నములను వ్రాత అవిచారిత రమణీయము కాదా? సంస్కృతములోని చూర్ణము, చూర్ణకము తెనుగులోని

చూర్ణపదము రీతిపదముగా పొరబటి కావా? ఇందు మొదటి ప్రశ్నకు రెండవ ప్రశ్న స్వవచోవ్యాఘాతమా? పైగా వ్యాపకర్తకు లాక్షణిక సంప్రదాయార్థము తెలియదని వారందురు. రాజగోపాలవిలాసమను ప్రబంధమునకు నిడదవోలు వెంకటరావుగారి పరిష్కరణమున శ్రీకృష్ణుని భార్యలైన లక్షణా భద్రలు తారిణులు అని కలదు. అది మరి నిడదవోలు వెంకటరావుగారికి తెలిసిన "లాక్షణిక సంప్రదాయార్థము!" శ్రీకృష్ణుని భార్యలు తారిణులట! పాపము శమించును గాక!

"చంపూపద్ధతిని నన్నయకు ముందే కన్నడమున రత్నత్రయము పంప, పొన్న, రన్నకవులు ప్రచారములోనికి దెచ్చియున్నారు. ఆ కాలమున తెనుగు కవులు ఈ పద్ధతిని వారినుండి గ్రహించిరి" అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము.

కన్నడకవి పంపని కాలము 941 ప్రాంతము అని కర్ణాట కవి చరిత్రకారుల నిర్ణయము (పుట 30 Vol. I). మరి సంస్కృతమున 'పద్యగద్యమయం చంపూరిత్యభిధీయతే' అని చంపూకావ్య లక్షణమును తెలిపిన "కావ్యాదర్శ" మను లక్షణ గ్రంథముయొక్క రచనాకాలము ఎన్మిదవ శతాబ్ది పూర్వభాగముకంటె పరము కాదని సంస్కృత సారస్వత చరిత్రకారులైన ఎస్. కె. దే. గారి నిర్ణయము (209 పుట).

ఇంతకంటె అనంతరము కాదనికూడ ఎస్. కె. దే. ప్రతిపాదనమే అదే పుటలో. మరి ఎన్మిదవ శతాబ్దికంటె పూర్వమే కల సంస్కృత చంపూకావ్యముల గురించి తెనుగుకవులు సంస్కృత కవులనుండి తెలిసికొనలేరా? తెనుగు దేశమున ఆనాడు సంస్కృతము లేదని నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయము కాబోలు! ఎన్మిదవ శతాబ్ది కాదు, మూడవ శతాబ్దిలోనే శాసనములు సంస్కృతభాషలో కలవు. పల్లవుల శాసనము లిందుకు ముదల. పల్లవులనాడు ఆంధ్రదేశమున సంస్కృతము రాజభాష. అంతేకాదు. హాలుని భార్య లీలావతి గీర్వాణభాషాకోవిదురాలు. అనగా ఎప్పటినుండి ఆంధ్రదేశమున సంస్కృతము కలదో గ్రహింపవలసిన విషయము. అంతేకాదు. నన్నయ్యభట్టు కల రాజరాజు కొలువులోని సంస్కృత విద్వాంసులు వేంగీ దేశీయులైన ఆంధ్రులు గాక అన్యులగుదురా? దేశమున మూడవశతాబ్దినుండి రాజభాష అయిన సంస్కృతమున ఎన్మిదవ శతాబ్దికే లక్షణగ్రంథమునందు పేర్కొనబడిన సంస్కృత చంపూకావ్యములు తెనుగు కవులకు తెలియవా? నేటి తెనుగు సాహిత్యవేత్తలు కొందరికివలె నాటి తెనుగు కవులకు సంస్కృతము రాదని నిడదవోలు వెంకటరావు గారి అభిప్రాయము కాబోలు!

"అట్లయిన భోజరాజు ఆంధ్రుడేనా? అనంతభట్టు, లక్ష్మణకవియు ఆంధ్రులని నిశ్చితమైనదా? వారు మహారాష్ట్రులని చాలమంది విద్వాంసుల యభిప్రాయము" అని కూడ నిడదవోలు వెంకటరావుగారి అనుబంధ ప్రశ్నలు.

భోజరాజు ఆంధ్రుడుకాదు. ఢిల్లీపాదుషాకూడా ఆంధ్రుడు కాదు. అసలు భారతీయుడే కాదు. మరి ఢిల్లీపాదుషా కొలువులో ఆంధ్రుడైన జగన్నాథపండితరాయలు ఆస్థానికాదా? షాజహాన్ చక్రవర్తి అస్థానపండితుడు కాదా పండితరాయలు?

"శ్రీ సార్వభౌమ శహజాహన్ ప్రసాదాధిగత పండితరాజ పదవీ విరాజితేన"

—అసఫ్ విలాసము

ఇక అనంతభట్టు, లక్ష్మణకవి ఆంధ్రులు కారనిమాత్రము నిశ్చితమైనదా? వారు మహారాష్ట్రులని చాలమంది విద్వాంసుల అభిప్రాయమా? ఎవరా "చాలమంది విద్వాంసులు"? ఆ విద్వాంసుల ఏ గ్రంథములలో అట్లు కలదు?

కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి ఆంధ్రవాఙ్మయ సంచిక అను గ్రంథమునందు అనంతకవి, లక్ష్మణకవి ఆంధ్రులని కలదు. నిడదవోలు వెంకటరావుగారీ గ్రంథమును చూడలేదేమో! చూచిన ఆ గ్రంథములోని కొందరు ఆంధ్రులు కారని, అందరును ఆంధ్రులు కారని నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయము కాబోలు! అయిన మరి పండితరాయలును ఆంధ్రుడు కాదని నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయ మగును కదా!

ఈ సందర్భమున "వ్యాసకర్త సంస్కృతానభిజ్ఞత వెల్లడించినాడు" అని నిడదవోలు వెంకటరావుగారి విమర్శ. మరి వెల్లడి అయిన సంస్కృతానభిజ్ఞత ఎవరిదో పాఠకులు నిర్ణయింతురు గాక! సంస్కృతానభిజ్ఞులెవ్వరును తెనుగుకవులు సంస్కృత చంపూకావ్యముల పరిచయము లేనివారని అనరు. సంస్కృతానభిజ్ఞులే అందురు.

"వ్యాసకర్త హరివంశమున (పై) చూర్ణిక యెచ్చట నున్నదో సూచింపలేదు .. పరిశీలింపగా నది చూర్ణిక కాదు. ముక్తపదగ్రస్త గద్య."

అని నిడదవోలు వెంకటరావుగారి అపూర్వసిద్ధాంతము. ఇవి నిడదవోలు వెంకటరావుగారి సర్వతోముఖపాండిత్యమునకు శృంగగ్రాహిక. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున - భారత పరాంశమైన హరివంశమున - చూర్ణిక యెచ్చటనున్నదో వ్యాసకర్త చెప్పలేదట! ఎవరికి? విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులయిన నిడదవోలు వెంకటరావుగారికి హరివంశ

మున చూర్ణిక యెచ్చటనున్నదో వ్యాసకర్త చెప్పలేదు. అసలు హరివంశమున చూర్ణిక అనునది కలదని చెప్పినారుకదా. నిడదవోలు వెంకటరావుగారి వచనవాఙ్మయ, బరవ్యాసగ్రంథ రాజములందు హరివంశమున చూర్ణిక యున్నదనుమాట లేదు అనగా మరి వ్యాసకర్త చెప్పువరకు ఈ సంగతి నిడదవోలు వెంకటరావుగారికి తెలియదని స్పష్టతరముకదా! ఏ సంగతి? ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములోని చూర్ణిక సంగతి. అది చూర్ణిక అని ముద్రాపకులు వ్రాసిరి కూడ. సరే. నిడదవోలు వెంకటరావుగారికి ఇదివరకు తెలియదు. ఇప్పుడు వ్యాసకర్త చెప్పగా - ఎచ్చట నున్నదో చెప్పలేదు గనుక ఎంత శ్రమ పడిరో కాని - మొత్తముమీద తెలిసినది. ఏమి తెలిసినది? పరిశీలింపగా నది చూర్ణిక కాదని తెలిసినది. పైగా అది ముక్తపదగ్రస్త గద్య అని తెలిసినది. "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః!" అల్లసాని పెద్దన మనుచరిత్రలోని "తీర్థ సంవాసులేతెంచినా" రన్న పద్యము సీసపద్యమనగా, కాదు. ముక్తపదగ్రస్తపద్యమని నిడదవోలు వెంకటరావు గారికి పరిశీలింపగా తెలియునేమో! ఎఱ్ఱాప్రెగ్గడ చూర్ణిక ముక్తపదగ్రస్త గద్యమట! అసలు ముక్తపదగ్రస్త గద్య అని ఒక గద్య భేదము లేదు. ఇప్పుడు మాత్రము ఇది నిడదవోలు వెంకటరావుగారి సృష్టి! కూటసృష్టి!!

ఇంతకు ముక్తపదగ్రస్త మన్నది అలంకార భేదము. చూర్ణిక అన్నది గద్యభేదము. ఈ రెంటికిని సంబంధ మేమి? ఈపాటి తెలియనివారు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షు లగుట దేశముయొక్క దౌర్భాగ్యము, అంతేకాదు. నిడదవోలు వెంకటరావుగారు కవీసము అప్పకవీయమును చూడలేదు. చూచియుండిన ఇట్లు వ్రాయరు. అనంతుని గద్యవంటి అప్పకవి గద్య కలదు. అందు ముక్తపదగ్రస్తాలంకారము కలదు.

"శ్రీ విలాసినీ వక్షోరుహద్వయగిరి దుర్గ సర్వాధ్యక్ష!.... పారీణ సౌందర్య విజితారవింద బాణ! బాణాభిధాన పూర్వ గీర్వాణేంద్ర....పట్టణ విహార! హారాంగద వలయ... భూమి ధరాతిపుత్ర మిత్ర! మిత్ర కుమారి కాంతక........ముకుంద నమస్తే నమస్తే పునస్తే పునస్తే"—చ. అ. 24 పుట 184.

ఎఱ్ఱాప్రెగ్గడ చూర్ణికలు ముక్తపదగ్రస్తాలంకారమువలె అప్పకవి గద్యలో ముక్తపదగ్రస్తాలంకారమే గాక, "పునస్తే" అని కలదు కనుక ఎఱ్ఱాప్రెగ్గడ చూర్ణిక ముక్తపదగ్రస్తగద్య అను నిడదవోలు వెంకటరావుగారు అప్పకవి గద్య "పరిశీలింపగా" "పునస్తే గద్య" అందురేమో! కాని అప్పకవి పునస్తే గద్య అనలేదు. ముక్తపదగ్రస్తగద్య అనలేదు. అనంతునివలె గద్యము అని మాత్రమే అన్నాడు. అట్లనక అప్పకవి ముక్తపదగ్రస్త గద్యమను మూర్ఖుడు కాదుగా!

ఇంతకు ఎఱ్ఱాప్రెగ్గడ చూర్ణిక, చూర్ణికయే అని ఏమాత్రము చూర్ణికాభేద పరిజ్ఞానము కలవానికైనను తెలియు విషయము. అయినను కాదని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము! అనగా మూలచ్ఛేదము.

"అనంతుని గద్యలో "స్వస్తి....నమః" ఈ విధముగా దీర్ఘసమాసకమై యున్నది గాని ఎఱ్ఱన హరివంశమునందు గల గద్యవలె ముక్తపదగ్రస్తముగా లేదు. (కనుక) గద్యము - చూర్ణిక ఒకటియే అను వ్యాసకర్త మాట పీళ్ళ మూట యైనదికదా!"

అని కూడ వారి నిర్ణయము!

ఇట ప్రథమతః వారికి అనంతుని గద్య దీర్ఘసమాసకమని తెలిసినందుకు సంతోషము. మరి అనంతుని గద్యవలెనే ఎఱ్ఱాప్రెగ్గడ చూర్ణిక కూడ దీర్ఘసమాసకమని దాని ముఖమే చెప్పు సంగతి. కనుక రెండును ఒకటి కాదా? వ్యాసకర్త మాట పీళ్ళమూటా? నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము మాయమాటా? ఇక ఎఱ్ఱాప్రెగ్గడ చూర్ణిక ముక్తపదగ్రస్తముగా నుండిన అనంతుని గద్య అట్లేల యుండవలెను? ముక్తపదగ్రస్తమన్నది అలంకారము. అలంకారము కవి అభిమతము. అనంతుని గద్యలో లేదు. అనంతుని గద్యవంటి అప్పకవి గద్యలో లేదా? కాక ముక్తపదగ్రస్త మన్నది అలంకార విషయము. దీర్ఘసమాసకమన్నది రీతి విషయము. అలంకారము వేరు రీతి వేరు అని నిడదవోలు వెంకటరావుగారికి అర్థమగుగాక!

ఇక మరొక విశేషము.

"వ్యాసకర్త యభిప్రాయము సోమనాథుని గద్యలు, సంస్కృత భాషనేగాని తెనుగునకు సంబంధించియుండలేదని కానోపును! దీనినిబట్టి సోమనాథుని గద్యరచనలు వ్యాసకర్త చూడకుండగనే వ్రాసినాఁడనుట స్పష్టము."

వ్యాసకర్త సోమనాథుని గద్యరచనలే కాదు ఆ గద్యలను గురించి బండారు తమ్మయ్యగారి రచనలును చూచినాడని కూడ నిడదవోలు వెంకటరావుగారికి స్పష్టతరమగును గాక. ఈ విషయమై ప్రత్యేక వ్యాసమే ప్రకటించుచున్నాను. ఇట ఆ వ్యాసమునుండి కొంతమాత్రము పరామర్శ.

ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక సంపుటి 15 సంచిక 5, 6. లోను ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు ప్రజోత్పత్తి అంగిరసాది సంచికలలోను "నా అభిప్రాయము" అని బండారు తమ్మయగారు చెప్పిన విషయమే - అది బండారు తమ్మయగారి అభిప్రాయగా గాక, నిడదవోలు వెంకటరావు

గారి స్వంత నిర్ణయముగా నిడదవోలు వెంకటరావుగారి తెనుగు కవుల చరిత్ర అను గ్రంథరాజము నందు - "అఖండ ధూప దీపారాధన దానశాసన వాఙ్మయము నా ప్రసిద్ధి వహించిన" గ్రంథరాజమునందు, పరిశోధన పత్రిక వ్యాసము నందు ప్రకృత విమర్శలోను కల విషయము. కాని బండారు తమ్మయ్యగారి అభిప్రాయమునకు నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయమునకు ఒకభేదము కలదు. ఇది 'నా అభిప్రాయము' అని తమ్మయగారి అభిప్రాయము. ఇది మరి 'ఇదమిత్థము' అని నిడదదవోలు వెంకటరావుగారి నిర్ణయము. అంతేకాదు. తమ్మయగారి ప్రతిపాదనలకు స్పష్టార్థ ప్రతిపత్తి కలదు. వెంకటరావుగారి ప్రతిపాదనలకు క్లిష్టార్థ ప్రతిపత్తి కలదు. ఇత్యాదయః ఇంకను క్వాచిత్కములు. ఇంతకు పరప్రత్యయ నేయమైన నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము విమర్శ లోనిది ఇది.

"సోమనాథుని గద్యకృతులు సంస్కృతభాషా నిబద్ధమైన తెనుగు కృతులు. ఇవి యన్నియు లయతాళాన్వితముగా పాడఁదగిన రగడ భేదములు. తెనుగునకు విశిష్టమగు యతి ప్రాస లిందు పాటింపఁ బడియున్నవి. పై వానిలో (1) నమస్కారగద్య, మధురగతిరగడ ఏక తాళము."

అవిచ శ్రీ ప్రమథేంద్రాయ నమో
వ్యపగత హృద్గత తాంద్రాయ నమో.

2. పంచప్రకార గద్య— మొదటిది ఉత్కలిక. రెండవది, మూడవది మధురగతి రగడ. నాల్గవది ద్విరదగతి రగడ. అయిదవది మధురగతి రగడ.

3. అక్షరాంక గద్య— ఖండగతి ద్విరదగతి రగడ.

(సోమనాథుని గద్యకృతులను గూర్చి ప్రత్యేకముగ "పరిశోధన పత్రిక ప్రకటించిన పాల్కురికి సోమనాథ సంచిక (అక్టోబరు 1955) లో సంపూర్ణముగ చర్చించితిని. అందుచే వివరముల నీయలేదు.")

ప్రథమతః నిడదవోలు వెంకటరావుగారు పరిశోధన పత్రిక సోమనాథుని సంచికలో సోమనాథుని గద్యకృతులను గూర్చి "సంపూర్ణముగ చర్చించ" లేదు. విమర్శలోని పై విషయమే కలదు. భేదమెల్ల రగడల మాత్రలు, నమస్కార గద్యేతరములకు ఇట నమస్కార గద్యకువలె ఒకటిరెండు పాదముల ఉదాహరణలు మాత్రమే. (చూడుడు. నిడదవోలు వెంకటరావుగారు చెప్పిన పరిశోధన పత్రికయే. పుట 67) నమస్కార గద్యేతరములను ఇట ఆ ఒకటిరెండు పాదముల ఉదాహరణలు యొందుకీయలేదో కూడా పాఠకు లూహింతురు గాక. ఇక నిడదవోలు వెంకటరావుగారి ఇదమిత్థ నిర్ణయముల సంగతి పరికింపుడు.

సోమనాథుని గద్యకృతులు సంస్కృతభాషానిబద్ధమైన "తెనుగుకృతులు" అని నిడదవోలు వెంకటరావుగారి మొదటి నిర్ణయము. మరి సంస్కృతభాషా నిబద్ధమైన తెనుగుకృతి అనగా అర్థమేమో పాఠకులే తెలుపుదురు గాక. సంస్కృత భాషలో తెనుగుకృతి నిబద్ధ మగునా? మరి తెలుగు కృతి ఇంగ్లీషుభాషలో కూడ నిబద్ధ మగును కాబోలు! ఇక,

"ఇవి యన్నియు లయతాళాన్వితముగా పాడదగిన రగడ భేదములు" అని నిడదవోలు వెంకటరావుగారి రెండవ నిర్ణయము. ఇది సరికాదు. ఇంకను వక్ష్యమాణము.

"తెనుగునకు విశిష్టమగు యతిప్రాస లిందు పాటింపబడినవి" అని నిడదవోలు వెంకటరావుగారి ముచ్చటైన మూడవ నిర్ణయము.

నమస్కారగద్యను 'తెనుగునకు విశిష్టమగు యతి'లేదు.

"అవిచ శ్రీ ప్రమథేంద్రాయ నమో
వ్యగత హృద్గతతాంద్రాయ నమో"

ఇది మధురగతి రగడ అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయమే. మధురగతి రగడకు తొమ్మిదవ మాత్రతో యతిమైత్రి. యతిమైత్రియే కదా మరి "తెనుగునకు విశిష్టమగు యతి." పై రెండు పాదములలోను "తెనుగునకు విశిష్టమగు యతి" ఏదీ? 'అ' కు 'ద్రా' కు యతిమైత్రా? 'వ్య' కు 'తాం' కు యతిమైత్రా? "తెనుగునకు విశిష్టమగు యతి"— ఇక అక్షరాంక గద్య. ఇందు 'అ' మొదలు 'క్ష'వరకు పాదములఆద్యక్షరములు. 'అ'మొదలు 'క్ష'వరకు గల వరుసను అచ్చుల జంటలు పోను (అఆ, ఇఈ) హల్లులలో 'కఖ, గఘ' లు పోను తదుపరి 'జ' కు 'ఛ' కు తెనుగునకు విశిష్టమగు యతి కలదా? అట్లు 'ఞ' కు 'ట' కు 'ణ' కు 'ప' కు....ఇక పంచప్రకారగద్య. ఇందు మొదటి విధము.

'జయజయ బసవ! శ్రీమన్మహావృషభేంద్రావతార! సముంచిత వీరమాహేశ్వరాచారసార! ప్రమథగణాలంకార! జగత్రయాధార! దేవబసవా!'

ఇందు 'తెనుగునకు విశిష్టమగు యతి' ఎట్లు?

రెండవ విధము—

"అవిచ మహా మహిమోన్నత విభవా!
భవపాశోత్కార కాతలవిత్రా!"

ఇందు "తెనుగునకు విశిష్టమగు యతి" ఏదీ?

మూడవ విధము—

"జయజయ నిరవధి నిర్మల గాత్రా!
జయజయ దురితలతాచయ దాత్రా!"

ఇందు 'తెనుగునకు విశిష్టమగు యతి' ఎట్లు? రెండు పాదములకు కలిపి ఎక్కడైన 'తెనుగునకు విశిష్టమగుయతి' కలదా?

నాల్గవ విధము—

"జయదురిత పరిహరణ
జయసుకృత పరిచరణ"

ఇందు "తెనుగునకు విశిష్టమగు యతి" ఏదీ? కలదా?

అయిదవ విధము—

"జయ శివ *రంజన!*
జయ భవ *భంజన!*"

ఇందు "తెనుగునకు విశిష్టమగు యతి" ఏదీ?

కనుక సోమనాథుని గద్య కృతులందు 'తెనుగునకు విశిష్టమగు యతి" కలదను నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయమెట్టిదో పాఠకు లూహింతురుగాక. ఇక ప్రాస:

"*నర మృగపతి వర్ష్మాలోక నమ్రాంత వాటీ*
*నర దనుజ పర్వవ్రాత పాతాల లోకః*
*కరజ కులిశపాళీ భిన్న దైత్యేంద్ర వక్షః*
*సురరిపు బలహంతా శ్రీధరోఽస్తు శ్రియే వః.*"

ఇది సంస్కృత శ్లోకమని తెలియుచున్నదికదా. ఇందు "ప్రాస" కనబడుచున్నదికదా. మరి ఇది "సంస్కృతభాషా నిబద్ధమగు తెనుగుకృతి" అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయ మగునుకదా! మరి ఉదాహృత శ్లోకమిది భాసుని కర్ణభారములోనిది. పాల్కురికి సోమనాథుని గద్యకృతులతో పాటు భాసుని కర్ణభారముకూడ "సంస్కృత భాషానిబద్ధమగు తెనుగుకృతి" అగునా? ప్రాసనుబట్టి చేయు నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయ మెట్టిదోకూడ పాఠకులూహింతురు గాక! ఏమాత్రము వివేకము కలవాడును భాసుని. కర్ణభారము "సంస్కృత భాషానిబద్ధమగు తెనుగుకృతి" అనదుకదా!

ఇక రగడ. నమస్కారగద్య మధురగతి రగడ అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము. మధురగతి రగడకు యతిమైత్రి కలదు. మరి నమస్కార గద్యలో యతిమైత్రి ఏదీ? యతిమైత్రి లేనిదే మధురగతి రగడ అగునా? నమస్కార గద్యకు పదునారుమాత్రలు కలవుగనుక అది మధురగతి రగడ అని కాబోలు! మరి పదునారుమాత్రలు గల మాత్రాఛ్ఛందోభేదములు తెనుగు కన్నడములందేకాదు సంస్కృత ప్రాకృతములందును కలవు. అట్లు కలవని నిడదవోలు వెంకటరావుగారికి తెలియదు. తెలిసిన ఇట్లు నిర్ణయము చేయరుకదా! సంస్కృతమున "మాత్రా సమకము" అను వైతాళీయ భేదమునకు, ప్రాకృతమున "అడిల్లా" అను మాత్రాఛ్ఛందమునకు మాత్రలు పదునారే. కనుక సంస్కృతభాషలోని నమస్కారగద్య మాత్రాఛ్ఛందము సంస్కృత మాత్రాసమకమే అని గమనార్హము. ఇక అక్షరాంకగద్య. ఇది ద్విరదగతి రగడ అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము. ఎట్లు?

అపిచ శివ శృంగార ఓం
అది పద విస్తార ఓం.

అక్షరాంక గద్యకు అకారాద్యనుక్రమణిక పాదనియతి. అంతేకాదు.

నమస్కారగద్యను నమశ్శబ్దమువలె అక్షరాంకగద్యకు ప్రతిపాదమున ప్రణవాక్షరము కలదు. ప్రణవాక్షరము ప్లుతాధికము. ప్రణవాక్షరమునకు పరిహారమా? ఎంత సాహసము!

"ప్రణుతింపఁ బంచాక్షరములకు మొదలఁ
బ్రణవమొండ షడక్షరంబు నాఁ బరగు"

—*దీక్ష ప్రకరణము*

అని ప్రణవాక్షర సహితమైన పంచాక్షరి షడక్షరి అని పాల్కురికి సోమనాథుని ప్రతిపాదనమే. కనుక అక్షరాంక గద్య పాదమునకు మాత్రలు పదికంటె ఎక్కువ. పదకొండు లేక పండ్రెండు. కారణము ప్లుతమే త్రిమాత్రాకము. ఇక పంచలఘులగణచతుష్టయము ద్విరదగతి రగడ మాత్రా లక్షణము. అక్షరాంక గద్యకు ద్వయమేలేదు. చతుష్టయ మేదీ? లేనిది ద్విరదగతి రగడ ఎట్లు?

ఇక పంచప్రకారగద్య మొదటివిధము. ఇది 'ఉత్కలిక' అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము. ఉత్కళిక అనగా కళికలో సగము. కళిక రగడ లక్షణకము. ఈ లక్షణము పంచప్రకార గద్య మొదటివిధమునకు పట్టదు. పంచప్రకారగద్య మొదటివిధము "ఉత్కళిక" కాదు. "ఉత్కలికాప్రాయము." తెనుగు ఉత్కళిక వేరు. సంస్కృతపు ఉత్కలికాప్రాయము వేరు. అయినను ఒకటే అనికూడ అన్యథా నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము. అది మరి అవిచారితరమణీయము. ప్రత్యేక వ్యాసమున ఇది ప్రస్తరించుచున్నాను. స్థల విస్తర భీతినిట పము పేక్షితము. ఇక పంచప్రకారగద్య రెండవది. మూడవది మధురగతి రగడ అని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము. ఈ రెండుమూడు విధములందును యతిమైత్రి లేదు. కాక రెండవ మూడవ విధములందు పదునారు మాత్రలు లేవు. పదునేడుమాత్రలు కలవు.

రెండవ విధము: "అపిచ మహో మహా మోన్నత విభవా!"
మూడవ విధము: "జయజయ దురితలతాచయ గాత్రా!"

ఈ రెండును సంస్కృత పాదములు. సంబోధన ప్రథమావిభక్తిలోని బహువ్రీహిసమాసములు. అకారాంత పుంలింగ విశేష్యములకంటె విశేషణములు. మరి అకారాంత పుంలింగ విశేష్య విశేషణములకు సంబోధనప్రథమావిభక్తి దీర్ఘాంతమా? హ్రస్వాంతము లేక ప్లుతాంతము. రామశబ్దము వచ్చిన ఇది తెలియుసంగతి. కనుక పై రెండుమూడు పాదములకు హ్రస్వాంతములైన పదునైదు మాత్రలు. దీర్ఘాంతములవలె కనిపించు ప్లుతాంతములైన పదునేడు మాత్రలు. కనుక మధురగతి రగడ మాత్రాలక్షణమే సరికాదు. ఇక నాల్గవవిధము, అయిదవ విధము అంతకంటె, రగడలుకావు. సంస్కృత చూర్ణకములు. సాహిత్య దర్పణములోని చూర్ణక లక్ష్యము ఉదాహృతము. ఇంకను సంస్కృత లక్షణ పరిజ్ఞానము లేకుండ సోమనాథుని గద్యకృతులలో లేని "తెనుగునకు విశిష్టమగు యతి" కలదని సోమనాథుని కృతులు వ్యాసకర్త చూడలేదని నిడదవోలు వెంకటరావుగారి నిర్ణయము. సాహిత్యవేత్తలిది సమాలోచింతురుగాక.

"సోమనాథునికి పూర్వము బహుభాషలలో గద్యలున్నవని వ్యాసకర్త వ్రాసినాడే; ఆ బహుభాష లేవి? ద్రవిడ కన్నడ మలయాళములా? మహారాష్ట్ర, శౌరసేనీ మాగధీ మొదలగు ప్రాకృతములా?"

అనికూడ నిడదవోలు వెంకటరావుగారి ధర్మసందేహము. సోమనాథుని పూర్వము సంస్కృతమున (మల్లికార్జున పండితుని మల్లికేశ్వర గద్య) కన్నడమున (కన్నడ వచన కర్తలు పెక్కురు) కలవు. మరి సంస్కృతకర్ణాటములు బహుభాషలుగాక ఏకభాష అగునా? ఇంతకు నిడదవోలు వెంకటరావుగారికి "తెనుగునకు విశిష్టమగు"ఏకవచన బహువచనముల సంగతి తెలిసియుండదు. తెలిసియున్న ఇట్లు ప్రశ్నింపరుకదా. ఇకనన్నయభట్టు భారతావతారికలోని "బహుభాషల పద్యము" నకు (ఎన్నవ పద్యమో, ఎన్నవపుటయో చెప్పవలెనా? అట్లు చెప్పిన మరి ఆ చెప్పినవారికిని అప్రతిష్ఠ కదా.) రాజరాజ నరేంద్రుడు "మహారాష్ట్రి, శౌరసేనీ, మాగధీ మొదలగు ప్రాకృత" భాషలలో భారతమును వినువాడని నిడదవోలు వెంకటరావుగారు అర్థము చెప్పుచున్నారు కాబోలు!" నన్నయ భారతమును నన్నయనాటి లిపిరీతిని, నన్నయనాటి ఉచ్చారణరీతిని ముద్రింపవలెను" అని తెనుగు కవుల చరిత్రలో చేసిన నిర్ణయమువలెనే! ప్రత్యేకవ్యాసమున ఇది పరామృష్టము.

ఇంతకు నిడదవోలు వెంకటరావుగారి విమర్శకు ఇది పరామర్శ. ఈ వ్యాసమును భారతి సంపాదకులు ప్రచురింపలేదు. ఒకనాడు భారతిలోనే (సం. 32. సంచికలు 4, 6) ఇట్లు ప్రచురించినారు.

"సాధారణముగ పరిశోధనలలో నెంతెంత పండితులకు నొకప్పుడు పదింట నొక పొరబాటు రావచ్చును, కాని వెంకటరావుగారి విషయమున ఆ మాట తారుమారయినది.... అయినను వారత్యంత సాహసికులైన పరిశోధకులు.... వారిట్లు కేటలాగు పాండిత్య స్వయంపాకముతో నెంతకాలము లోకమును బూకరింతురో తెలియకున్నది. వారి వ్రాతలయందలి విషయములను వెంటనే విశ్వసింపరాదు."

ఉన్నవ విజయలక్ష్మి

# సాధన

ఉదయం తొమ్మిదయిందేమొ. పక్కమీద పడుకొనే ఆరోజు పేపరు చూస్తోంది మధుర. రాత్రి మైమరచి నిద్రపోయినా, యింకా బడలికగానే వున్నదామెకు. చదివేది మనస్సుకు పట్టకుండా వుంది. పేపరు మడిచి పక్కకు తిరిగి కిటికీ తెర తొలగించి క్రిందకు చూసింది. అది మేడ మీది గది. క్రింద తోటకు నీళ్లు పెడుతున్నాడు మాలి. విచ్చిన పూలతో ఏదో మిన్ను విరిగి వేల ఇంద్ర ధనస్సులు క్రిందపడి శకలాలై నలువంకలా చెదరిపోయినట్లుగా వుంది తోట.

నడక చప్పుడుకు వెనక్కి తిరిగింది. "అక్కా, యిదిగో నీకోవుత్తరం" అంటూ ఒక కవరు చేతికిచ్చింది చెల్లెలు. చిరునవ్వుతో మధుర కవరు విప్పి చూసుకుంది. "సాయంత్రం ఆరు గంటలకు బీచ్‌కి వస్తానన్నావు కదూ ! తప్పకరా నీకో మాంచి కబురు చెప్తాను." ఇదీ ఆ కాయితం తెచ్చిన కబురు. మధుర సాలోచనగా పక్కమీది కొరిగింది. "వూరెళ్లి వచ్చివుంటాడు. వాళ్ల అమ్మతో చెప్పి వుంటాడు. ఆమె కిష్టమై వుంటుంది. అంతకన్నా మంచి కబురు ఇంకేముంటుంది." అనుకుంది ? ఆలోచనలు తెగలేదు. మధ్యాహ్నం భోజనానికి పిలుపు వచ్చాక స్నానం సంగతి గుర్తు వచ్చిందామెకు. గబ గబ ఐదు నిమిషాల్లో స్నానం ముగించుకుని భోజనాని కెళ్లింది. ఏవో పత్రికలు తిరగేస్తూ మధ్యాహ్నం వేగించింది. సాయంత్రం ఐదున్నరకే బీచ్‌కి చేరుకుంది. అంతులేని అసహనంతో అరగంట గడిపింది. అప్పటికి దయచేసిన వాసును చూస్తూ "యింతాలస్యమా ?" అంది నిష్ఠురంగా.

"ఏదీ, ఆరూ ఐదేగా" అన్నాడు వాసు మధుర పక్కన కూర్చొని. "చెప్పు, త్వరగా చెప్పు, నన్నాశ్ట పూరించకు" అంది మధుర. ఆమె తొందరకు చిన్నగా నవ్వుతూ మెల్లగా అన్నాడతడు "మొన్న నీకు చెప్పాను. అమెరికన్ స్కాలర్‌షిప్ సంగతి, అది నాకే వచ్చింది."

"నిజం ? నేను చెప్పలా నీకే వస్తుందని, నీకే అనుమానంగా వుండెను." "ఔను నాకు ఎక్కువ ఆశ లేకుండెను మధురా, రెండేళ్లనాడు ఒకరోజున లాబరేటరీలో అనుకున్నాను. 'డాక్టర్ వాల్స్‌మన్‌తో కలసి పనిచేయ గల్గితే యెంత బాగుండునో' అని. అదినిజమౌతుందని అనుకునే సాహసం లేకపోయింది నాకు. కాని నిజమయింది మధురా, నిజమైంది."అన్నాడు వాసు తన్మయంగా.

"ఎన్నేళ్లుండా లక్కడ ?." మధుర అడిగింది.

"మూడేళ్లు"

"ఎప్పుడెళ్లాలి ?"

"ఏదీ, వ్యవధిలేదు. వచ్చేనెలాఖరునే ప్రయాణం కావాలి. ఇంటికెళ్లి అమ్మకు చెప్పాలి. అన్నీ సర్దుకోవాలి. ఏమీ తోచకుండావుంది నాకు." అన్నాడు వాసు.

మధుర ముఖం పాలిపోయింది. దీనంగా చూచిం దతనివంక. కాని అతని కాచూపులు చదువుకోగల చాతుర్యం అప్పుడు లేదు. కానే పాగి "ఎంతలో మూడేళ్లు, నువ్వుంటావు కదూ ! నాకు తెలుసు నువ్వుంటావు" అన్నాడు. మధురకు బాధతో గొంతు పూడుకుపోయింది. అతనడిగిన దానికేమి చెప్పలే దామె. నిముషాలు గంటలై తోచాయి. అతడింకాపదైనా మాట్లాడతాడేమో

నని కాసేపు ఎదురు చూచింది. కాని అతనికి అతని గొడవ తప్ప యింకో గొడవ పట్టేట్టుగా లేదు. ఇంకాసేపు ఆగితే అతనికి అభిమాన విషయమైన "ఆంటీ బై యాటిక్స్" మీద ఒక ఉపన్యాసం కూడ యివ్వగలడు. అసహనంతో ఆవేదనతో లేచింది మధుర. "ఇక వెళ్తాను, చీకటవుతోంది" అన్నదామె. వాసు పరధ్యానంగా "వెళ్తావా? వూఁ సరే!" అన్నాడు.

ఆ రాత్రి మధురకు కునుకు లేదు. ఎన్ని వూహాలు పెంచుకుంది? ఎంత ఆశగా వెళ్లిందా సాయంత్రం? తెల్లని వారణాసి నూలు చీర, దానిపైన సరిగ పూలు. ముత్యాలు కుట్టిన నీలి రంగు పట్టు రవిక. ఈవినింగ్ ఇన్ పారిస్ పరిమళాలు. ఎంత తీరికగా కైచేసుకు వెళ్లింది? ఎందుకూ? "అతడెక్కడికో వెడ్తున్నాడు, మూడేళ్లవరకూ మళ్లీరాడు" అనే కబురు తెలిసికోడానికా? అమెరికావెళ్లి ఓ డాక్టరేటు తెచ్చుకోడం కన్నా జీవితంలో ఇంకోటి అక్కరలేదనే ముఖంపెట్టాడతడు. అదంతా తనఎడల నిర్లక్ష్యమనుకున్నదామె. అభిమానం, కోపం ముంచెత్తుకవచ్చాయి ఆమెకు. ఓ హృదయం, మనసిచ్చుకున్న ఒక హృదయం తనకోసమే, తన కోసం మాత్రమే స్పందించాలనే కన్నెతనపు తహతహాకు దెబ్బ తగిలింది. నిస్సహాయంగా విపులమైన పక్క మీద పడుకొని వెక్కి వెక్కి పడ్చింది మధుర.

వాసు యీ దేశం వదలి ఆరునెల్లయింది. మధురకు ఒకటి రెండు ఉత్తరాలు వచ్చాయి. ఎంతో ఆశగా విప్పిచదువుకుంది. కాని వాటిలో అమెరికన్ విశ్వవిద్యాలయాల్లోని లాబరేటరీ సౌకర్యాలను గురించిన విశేషాలకన్న వేరేమీలేవు. మధుర పెంచుకున్న అపోహాల కవి దోహాదాలయ్యాయి. ఆమె జవాబు వ్రాయలేదు. "ఔను నేనే తెలివితక్కువదాన్ని. ఆశలు పెంచుకున్నాను. అతనికి నేనేమీ కాను. నిజంగా అతనికి నేనేమీ కాను" అనుకుంది. అదేనమ్మింది గాఢంగా.

వాసు చిత్రమైన మనిషి. చిన్నతనంనుంచి చదువుతప్ప ఇంకో ధ్యాస లేకుండా పెరిగాడు. "తెలిసికోవాలి" అనే జిజ్ఞాసకన్నా గాఢమైన ఉద్వేగా లతనికి లేవు. "ఒక శాస్త్రజ్ఞునిజీవితం" జీవించడమే అతని జీవలక్షణం. కాని మనస్సుతో ప్రమేయం లేకుండానే ఒక బలహీనమైన క్షణాన వయస్సు తెచ్చిపెట్టినఒత్తిడికి ఒకమ్మాయి పైన వలపు కలిగింది. కాని యీ భావమే అతని మనసెల్ల ఆక్రమించుకొన్నది కాకపోవడం, దీని వల్ల అతని జీవలక్షణమైన కోరిక ఏమాత్రం చెదరక పోవడం మధుర దురదృష్టమనే చెప్పాలి.

ఆనాటి సాయంత్రం మధుర తలస్నానం చేసింది. అలసటకు ఒళ్ళంతా చెమ్మగిలింది. తోటలోకి వెళ్ళింది కాసేపు చల్లగాలికి. దూరంగా పచ్చికలో దోగాడుతున్న కుందేలు పిల్లను చూస్తు నిలబడిపోయిందొకచోట. "మధురా, యిక్కడేం చేస్తున్నావమ్మా" అన్న తండ్రిమాట విని వెనక్కి తిరిగింది. తండ్రి ప్రక్కనే ఇంకో క్రొత్త వ్యక్తి! అతనిచూపుకు సిగ్గుపడింది మధుర. కన్నార్పకుండా చూస్తేచంద్రుడుకూడ ఏమబ్బుచాటుకో పోతాడు. ఇహ ఆడపిల్ల సిగ్గుపడిందంటే విచిత్ర మేమిటి?

"ఏంలేదు, వూరికేనే వచ్చాను నాన్నా" అని లోపలికి వెళ్ళిపోయింది. మాట్లాడుతూ వస్తున్న తండ్రి కూతురును చాల ఆలస్యంగా చూశాడు కాని, అంతకుముం దెప్పటినుంచో అబ్బాయి కళ్ళన్ని అమ్మాయిమీదే వున్నాయి. అతడు నిర్విణ్ణుడై చూస్తున్నాడామెవంక. ఎవరినిగురించిన వూహాలలోనో నడక మరచిపోయిన పాదాలు, ఎవరి పిడికిట్లోనో యిమడటానికి వడే తాపత్రయంతో సన్నగిలిపోయిన నడుము, ఏకాకినని ఆక్రోశించిన దేనినైనా తమవిగా అల్లుకుపోగల చేతులు, ఎవరి దీనవాక్కు వినో చెమ్మగిలటానికి సిద్ధంగా వున్నట్లు మిలమిల మెరిసే నేత్రాలు, ఎవరి చేతుల పరామర్శకో ఎదురు చూస్తున్న ముంగురులు, ఎవరికోరకో వుప్పొంగిపోయిన

సౌందర్యం, ఎదురుచూచి, విసిగిపోయి కేశరాశిగా క్రిందకు ప్రవహిస్తోంది. అవ్యక్తమైన విషాదభావ మొకటి మధుర ముఖాన్ని మరింత సుందరంగా చేసింది. మధుర రూపం మరుపురాలే దతనికి. "నా అదృష్టాన్ని కొలిచి చూస్తాను!" అనుకున్నాడా యువకుడు.

నెలలు గడుస్తున్నాయి. ఒకనాటి సాయంత్రం మధుర టీ తీసుకుంటోంది. తల్లి వచ్చి ఎదురుగా నున్న కుర్చీలో కూర్చుంది. కూతురువంక నిశితంగా చూస్తూ "ఇహ నీ ఆలోచన తెమలదా ఏమిటి? ఎన్నాళ్లు చూసినా, ఏ మాటా చెప్పవేం! నీ కేదో ఆటగా వున్నట్లుందే చూస్తుంటే!" అన్నది. మధుర కాస్త విరక్తిగా "చెప్పానుగదా నేను, చెప్పిందే మళ్ళీ ఎన్నిసార్లు చెప్పను?" అంది. ఆతల్లి పూర్తిగా సహనాన్ని కోల్పోయింది. కోపం, చిరాకు పట్టలేక "ఏమిటి చెప్పావు నువ్వు? చెప్పేదానికి ఏదైనా అర్థముండాలి. అసలు పెళ్లే వద్దనడానికి నువ్వొక పెద్ద రాజకుమార్తెననుకోకు. నీకోసం పోటీలుపడి యుద్ధాలు చెయ్యడానికి రాజకుమారు లెవరూ లేరిక్కడ. ఇహ నీతో వాదించడానికి నా కోపిక లేదు. నా పని నేను చేసుకుపోతాను." ఆమె వెళ్ళిపోయిం దక్కడనుంచి. సగం టీ కప్పులోనే వదిలేసి తన గది కెళ్ళిపోయింది మధుర.

రెండు గదు లవతలనుంచి సంగీతం మాస్టారి గొంతు "అడిగిసుఖము లెవ్వరనుభవించిరి రామ!" చెల్లెలికి పాఠం చెప్తున్నారు. మధురకు మనసంతా వికలమైపోయింది. "ఏంచెయ్యను? ఏంచెయ్యాలి? ఏంచెయ్యగలను? ఒక్క వుత్తరంలోనైనా ఆ సంగతే ఎత్తడే, ఎవరికి ఏమని చెప్పుకుంటాను? ఏ ఆశలూ లేని నిరీక్షణలోకూడ అందమున్నదని ఆత్మవంచన చేసుకోనా?" అనుకుంది. అతడు—'మాధవరా'వట పేరు. ఆనాడు తండ్రితో తోటలో చూసిన్నాడే పసిగట్టిం దతని చూపులను. యూనివర్శిటీలో పనిచేస్తున్నాడట. ఎటామిక్ ఫిజిక్సులో డాక్టరేటట. మధుర నవ్వుకుంది "హోమ్‌సైన్స్‌లో డిగ్రీ తీసుకున్న నాకు ఏంటీ బైయాటిక్స్ అయితేనేం, ఎటామిక్ ఫిజిక్సయితేనేం" అనుకుంది.

పెద్దలు నిశ్చయించిన సుముహూర్తాన మధుర మాధవరావు యిల్లాలయింది. పెండ్లయిన దగ్గర నుంచి ఆమె మనస్సు మరీ చెడింది. గతం ఎప్పుడూ నిజంగా 'గతం' కాదు, తలపుకు వస్తే అది వర్తమానంకన్నా బాధపెడుతుంది. భవిష్యత్తుకన్నా భయపెడుతుంది. ఏదో పాపం చేశానన్న శంకతో వేగిపోతోంది మధుర. విరక్తిగా రోజులు మళ్ళించడమే తప్ప దేనిపైనా మనసు పోవడంలేదామెకు. మాధవరావు భార్య ప్రవర్తనకు రిచ్చపోయాడు. హోంసైన్స్ గ్రాడ్యుయేటు యింటిని తెలివిగా సవరించబోయి మరింత కంగారుగా చేస్తే అత డాశ్చర్యపడకనేపోవును. కాని యింటి యావే లేని యిల్లాలిని చూసి తెల్లబోయాడతడు. "ఈమె ఏదో యితరులతో పంచుకోలేని బాధపడుతోంది, సరదా కోస మెవరూ సన్యాసం పుచ్చుకోరుగదా! ఏమని అడగను, అడిగినా చెప్తుందా? ఏమిటి చెయ్యటం?" అనుకున్నాడతడు.

ఆ రాత్రి మాధవరావు ఏదో చదువుకుంటున్నాడు. మధుర వెళ్ళి పడుకుంది. వెన్నెల పోత పోసిన ప్రతిమలా పడుకుంది. నీలికలువల కళ్ళు, నిద్రకారిపోతున్న కళ్ళు, మెడలో ముత్యాలు ఒరుసుకుపోతున్నాయి. ఆస్వాదన మానించని పరిమళం. మధుర మైమరచి నిద్రకొరిగింది. విచలితుడైనాడు మాధవరావు. సౌందర్యం సంపద. దాన్ని గుర్తించటం సంస్కారం. మాధవరావు కా సంస్కారం వుంది. "మనసిచ్చి పలుకనైనా పలుకదే, ఏమిటీ ప్రారబ్ధం, ఎన్నాళ్ళీ పాడి బ్రతుకు?" అనుకుని నిట్టూర్చా డతడు. మధుర నిద్రపోయింది. మాధవునకు కునుకు రాలేదు. ఏమాలోచన తట్టిందో తటాలున లేచాడు కుర్చీలోంచి. మధుర సూట్‌కేస్ తెరిచి చూచాడు. వెదకబోయిన తీగ కాలికే తగిలింది. మధుర డైరీ కనబడింది. అంతరాత్మను అణచిపెట్టి, పేజీలు త్రిప్పాడు. వరుసగా చదివాడు.

అతని ముఖం మెఱ్ఱబారింది. డైరీ తీసికెళ్ళి మళ్ళీ మధుర పెట్టెలో పెట్టేసాడు. కళ్లు పెద్దవిచేసుకుని మధురవంక చూసాడు. నిట్టూర్చాడు. "ఓ అమ్మాయీ, నువ్వు నన్నిలా కాల్చుకుతింటానికి నీకేమీ హక్కులేదు. నీ అందానికి నేను ఓడిపొయ్యాను, నిజమేకాని, నా భార్య అందమైనది అనే గర్వం నాకేమీ సుఖాన్నివ్వదు. నాకు జీవితంలో కావలసినది సుఖం. అందుకు నిన్ను నే గెలుచుకోవాలి. సాహసం చేస్తాను, దుస్సాహసమైనా సరే సంకోచంలేదు నాకు" అనుకున్నాడు.

మరునాడు ఆదివారం. నిద్ర లేచేసరికి చాల ప్రొద్దెక్కిపోయింది. తీరిగ్గా కూర్చుని కాఫీ తీసుకుంటున్నాడు.

"నేనెక్కడికైనా రెండేళ్ళపాటు వెళ్తే నువ్వుండగలవా" అన్నాడు మాధవరావు మెల్లగ కాఫీ తాగుతూ. మధుర తెల్లబోయి చూచిన దతనివంక. మాధవరావు చిరునవ్వుతో "పోనీ, రెండేళ్ళు కాదు, ఒక్క ఆరునెల్లు వుండగలవా ? అది చెప్పు" అన్నాడు. మధుర కళ్ళు దించుకుని "నే నెందుకుండాలి, మీ రెక్కడికెళ్తారు, సరిగా చెప్పండి" అంది. "కంగారుపడిపోకు, నే నెక్కడికీ వెళ్ళడం లేదు. నేను వెళ్ళలేను. అందుకే వదులుకున్నాను." అన్నాడు మాధవరావు. "ఏమి వదులుకున్నానంటున్నారు ? నాకేమీ అర్థంకావడంలేదు."

"మా ప్రొఫెసరు నన్ను ఏదో శిక్షణపొందటానికి స్కాలర్‌షిప్ యిప్పించి రష్యాకు పంపుతామన్నారు. కాని నేను నా ఆరోగ్యం బాగులేదు. నే నిప్పట్లో ఎక్కడికీ వెళ్ళలేను అని చెప్పాను" అన్నాడు మాధవరావు.

"ఆరోగ్యం బాగులేదా ?" ఆదుర్దాగా అడిగింది మధుర. "ఛా, నిజమనుకున్నావేమిటి ? అట్లా చెప్పక మరేమి చెప్పేది ?" మధుర ఆశ్చర్యానికి మేరలేదు. "అదేమిటి ఎందుకట్లా చేసారు ?" అన్నది.

"వాళ్ళు నా ఒక్కడి ఖర్చులే భరిస్తారు. నిన్ను తీసికెళ్ళేందుకు నా దగ్గిఱ డబ్బులేదు. పదేళ్ళక్రితం నిన్ను చూసివుంటే, నా డబ్బంతా అలా తగలేసేవాణ్ణికాదు. ఇప్పుడెలా వెళ్లను? ఇంతటి అవకాశం మరిరాకపోదు. మంచిరోజులు వస్తే మనిద్దరం కలిసే వెళ్ళవచ్చును. మధురా ! నేను బలహీనుణ్ణి; నన్ను విడచి నువ్వుండగలవేమోగాని, నిన్ను విడచి అన్నాళ్ళు నే నుండలేను" అన్నాడు.

మధుర మ్రాన్పడిపోయింది. "అంతటి అవకాశం అవలీలగ నానిమిత్తం వదులుకున్నారా యీయన? ఇద్దరికీ ఎంత భేదం ?" అనుకున్న దామె. "నువ్వుండగలవేమోగాని" అన్న భర్త మాట ములుకులాగ తగిలిం దామెకు. "మమతలు పెంచుకున్నవాళ్ళు, వాని మాధుర్య మెరిగినవాళ్ళూ యింతకన్నా భిన్నంగా ప్రవర్తించలేరు. అప్పుడు నేను కేవలం మోసపోయాను. నా భ్రమ తొలగిపోయింది. ఇహ నా కర్తవ్య మర్థమయ్యింది నాకు" అనుకుంది మధుర.

'మంచిపనేచేశారు. ఇహనుంచి నన్నడుగకుండ మీరేవో నిర్ణయాలు చేసేస్తే నేనూరుకోనేది లేదు.' అంది మధుర.

మాధవరావు మధురలోని మార్పుని కనిపెట్టాడు. ఎంతో సంబరంగా "మధురా, సినిమాకు పోదామా ?" అన్నాడు.

"మరి ముందే చెప్పారుకాదు. వుండండి, క్షణంలో తయారయి వస్తాను"అని లోపలి వెళ్ళిందికి మధుర.

"సమయానికి తగుమాట లాడెనె
సాధించెనే ఓ మనసా—"

కూనిరాగం తీసుకుంటూ స్నానాని వెళ్తున్న భార్యను చూచి మాధవరావు "ఓ అపరిచితుడా, క్షమించు నన్ను ! నేను మనిషిని. స్వార్థాన్ని జయించలేకపోయాను" అనుకున్నాడు.

# నాగరికము

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

నాశిరస్సుపై గోష్పదకేశమాత్ర
మును గని సనాతనాచారమూర్తియనుచు
పొగడినదినన్ను ఛాందసపు జనసమితి
నాగరికతాస్వరూపులు నవ్వినారు.

మదవలంబిత నిత్యకర్మాష్టకంబు
మెచ్చి ఛాందసుల్ నన్ను కర్మిష్ఠియనిరి.
మూఢవిశ్వాసభావ ప్రమోదియనుచు
నాగరికతాస్వరూపులు నవ్వినారు.

స్వల్పమాతృభాషా పరిచయమువలన
ఛాందసుల్ నన్ను శాస్త్రనిష్ణాతు డనిరి.
అతిపురాతను డభ్యుదయావరోధి
పొమ్మనిరి నాగరికతా ప్రబుద్ధమతులు.

జన్మదేశ భాషావేషసంస్కృతులను
ఆదరించుట మూఢత్వమైనయెడల
ఏదినాగరికతయొ ? దేశేతరముల
తత్తదాచార భాషాప్రవృత్తికాద ?

కనులుమూసి లోకకళ్యాణహేతువుగ
భరతవర్ష ధర్మపథముజూతు
కనులుతెరచి లోకకాలుష్యమార్గ దౌ
ష్ట్యంబు జూచెదను దిశాంతములకు.

కనులుమూసి పూర్వగాథాపునీత మా
ధుర్యసౌరకామదోగ్ధనగుదు
కనులుతెరచి ప్రకృతకాలతమశ్శర్వ
రీవిలాసవిలయభావ మగుదు.

'భరతవాక్యం'

"ధ్రువంతే రాజావరుణో
ధ్రువందేవో బృహస్పతిః
ధ్రువంత ఇంద్రశ్చాగ్నిశ్చ
ఆంధ్రం ధారయతాం ధ్రువం"

# అభిజ్ఞాన శాకుంతలము 7

విశ్వనాథ సత్యనారాయణ

ఈ నాటకమునందు సర్వప్రధానమైనది శాపమని చెప్పబడినది. ఈ శాపవిషయము కొంత విచారణ చేయవలసియున్నది. శాపమువలన రాజు మనస్సు మారినది. దానిచేత కథ ఏర్పడినది. పాశ్చాత్య నాటకములకు ప్రాచ్యనాటకములకు నిచట నొక భేదము దృశ్యమానమగుచున్నది. ప్రసిద్ధ పాశ్చాత్య నాటకములలో కథానాయకుని స్వభావము. దీనినే ఆధునికులు శీలము. అనుచున్నారు. శీలము వేఱు. స్వభావము వేఱు. స్వభావమాంతరమైనది. దానిని బట్టి యతడు ప్రవర్తించు ప్రవర్తనను బట్టి శీల మేర్పడును. ఈ స్వభావమునందు నొక లోప ముండును. ఆ లోపమునకు కథాగమనమునకు సంబంధ మేర్పడి కథ పరిణమించును. హామ్లెట్ నాటకములో కథానాయకుని ప్రకృతిలో జాగుసేయుట ప్రధాన లక్షణము. దానిచేత కథ విస్తరించినది. విచిత్రపరిణామము పొందినది. ప్రాచ్యనాటకము లలో నిట్లుకాదు. కథానాయకుడు ధీరోదాత్తుడై యుండవలయును. అన్ని యుత్తమగుణముల కత డునికిపట్టు. వాని స్వభావమునం దొక దోషమేలేదు. ఆ దోషమునుబట్టి కథ పెంపొందుటలేదు. అందుచేత ప్రాచ్యదేశనాటకములు రసమార్గము నవలంబించి నవి. పాఠకుని యొక్క రమణము అనుభావ వ్యభిచారిభావసాత్త్వికభావాశ్రయమై జరుగుచున్నది. కథాగమనసుఖకంటె రససంబంధబుద్ధి యెక్కు వైనది. పాశ్చాత్య నాటకకర్తలు కథాగమనమున కెక్కువ ప్రాధాన్యమిచ్చిరి. ప్రాచ్య నాటకకర్తలు రసభావాదుల కధికప్రాధాన్యము నిచ్చిరి. ఇవి రెండును రెండు మార్గములు. ఈ మార్గములు రెండు నింత భిన్నముగా నుండుటకు హేతువులు కలవు. ఆ జాతియొక్క మతము, భగవంతుని గూర్చిన భావము, పరలోకమును గూర్చిన నిశ్చయము మొదలైన విషయముల ముద్ర సంఘవ్యవస్థాదుల యందువలె కావ్యపరమార్థ నిరూపణమునందు గూడ పనిచేయును. వారి మతములలో బ్రహ్మపదార్థాభి జ్ఞానములేదు. శివోఽహమ్, అహమ్ బ్రహ్మాస్మి; ఇది వారి చరమస్థితికాదు. ఇది చరమస్థితియైనచోట కావ్యమునకు రసము పరమార్థమగును. ఇది పెద్ద విషయము. వేరే ప్రపంచింపబడినగాని సువ్యక్తము కాకపోవచ్చును.

కాళిదాసుని గొప్పతన మెక్కడ నున్నదనగా నిట్టి భారతదేశ కావ్యపరమార్థభూతమైన రసమును పరి త్యజించలేదు. దోషరహితమైన ధీరోదాత్తనాయకుని పరిహరించలేదు కథను నిర్మించినాడు. ఈ కథా నిర్మాణమెట్లు జరిగినది? ఆ కవికులగురువునకు పాశ్చాత్య లోకజాతి యున్నారని, పదునేనువందల యేండ్లు గడచిన తరువాత, లేదా వేయియేండ్లు గడ చిన తరువాత, మంచుగడ్డలు తొలగిపోయి, యూరపు ఖండము మనుష్యనివాసయోగ్యమై, యచట మానవ జాతి యొకటి యేర్పడి, యన్యసిద్ధాంతావలంబకమైన యొక కావ్యప్రపంచకము పుట్టునని తెలియదు. ఆయన తన మహామేధాశక్తిచేత రసముతో సమ వ్యవస్థితముగా కథా నిర్మాణమునుగూడఁ జేసెను, ఆ నిర్మాణస్వరూప మిట్లున్నది. కథానాయకుని స్వభావగతమైన యొక దోషముచేత కథయందు మార్పువచ్చినచో నా దోషము కథానాయకుని స్వభావ గతమైనదై యే యేల యుండవలయును? ఆదోషము బయటి పంక్తి సమాసన్నమైనది కావచ్చును. అట్లు వెలినుండి వచ్చినకారణము తత్స్వభావగతము కావి

కారణము విచిత్రముగా నీ కథాగమన మునకు హేతువు చేయబడినది.

ఈ శాపము దుష్యంతుని స్వభావమును మార్చ లేదు. కథను మార్చినది. శాపము కానిచో నది స్వభావమే యనవచ్చును. ఇచ్చట శాపమును తీసివేసి రస ప్రాధాన్యమును, సూచ్యార్థసూచనాది ప్రాచ్య నాటకాంగ పరికరములను తొలగించినచో నభిజ్ఞాన శాకుంతలము నొక మహాపాశ్చాత్య నాటకముగా పరిగణించవచ్చును. శకుంతలా దుష్యంత పునస్సమాగమమునుగూడ తొలగించినచో మహా విషాదాంత నాటకమగును. ఏలయనగా హామ్లెట్‌లోని 'జాగుసేయుట' యను లక్షణమెట్టిదో, దుష్యంతునిలోని 'మఱచిపోయెడు లక్షణము' తత్స్వభావము నందు సన్నిహితమైన యొక దోషముగా పరిగణింపను బడవచ్చును. మఱచిపోవుట స్మరణమను నంతఃకరణ లక్షణమునకు సంబంధించినది. ఈ స్మరణమును గూర్చిన విచారణలో బహువిప్రతిపత్తులు గలవు. స్మరణమనకు పూర్వానుభవముకారణము. ఇచట కొంత శాస్త్రీయమైన విచారణ సూచింతును. ఈ విచారణ శాపవిచారణ చేయునపుడు కొంత పనికి వచ్చును కనుక చేయుచున్నాను.

"విభు ర్బుద్ధ్యాదిగుణవాన్, బుద్ధి స్తు ద్వివిధా మతా
అనుభూతి స్మృతి శ్చ స్యాత్ అనుభూతి శ్చతుర్విధా."

కొందరు స్మృతికి అనుభవము కారణము కాదు జ్ఞానము కారణమందురు. అనుభవము కారణమైనచో స్మరణము పుట్టదని. సమాన ప్రకారమైన లక్షణము గల రెండు స్మరణములు ఉత్తరమైనది పూర్వమును నాశనము చేయునుగనుక. అందుచేత ఇంకొక సంస్కారమువలనగాని వేఱొక స్మరణము గలుగదని చెప్పుదురు. ఇది కాదని సూక్ష్మతార్కికుల సిద్ధాంతము. ఏలయనగా, సమూహాలంబనోత్తరమైన ఘటపటాదులయొక్క క్రమస్మరణమువలన సకల విషయక స్మరణము జరుగుట లేదనుటకు వీలులేదు. క్రమస్మరణము దృశ్యమానమగుచునే యున్నది. అయినను ఫలితమైనది దృఢముగా నున్నది. ఇచట క్రమికస్మరణానుపపత్తిలేదు. తిరిగి తిరిగి కలుగుచున్న స్మరణముచేత దృఢమైన సంస్కారము యొక్క ఉపపత్తి లేదనుటకు లేదు. అనగా దృఢతర సంస్కార మున్నదని యర్థము. ఈ విచారణలో శకుంతలాకథాగత దుష్యంతవిస్మృతి యన్న పదార్థములో క్రమికస్మరణమునుగూర్చి కొంత సంబంధము గలదు. అందుకని ఈ సుంతవిచారణ చేయబడినది.

ఈ స్మరణము లేకపోవుట అన్న దోషము దుష్యంతుని బుద్ధియందుఁ ప్రవేశపెట్టి ఈ నాటకకథ నిర్మింపబడినది. ఆ విస్మృతికి హేతువు శాపముగా చెప్పబడినది. విస్మృతిలక్షణము దుష్యంతుని బుద్ధికి లేదు. మానవబుద్ధిలో నదియొక లక్షణమే. దానియంతట నది సంఘటిల్లును. జనులు పలు విషయములు మఱచిపోవుట గలదు. ఈ మఱచిపోవుట యన్న లక్షణము మఱచిపోవువాని బుద్ధి లక్షణముమీద, మఱచిపోబడు విషయముల ప్రయోజన తారతమ్యముమీద, నాధారపడియుండును. తాను వివాహమాడిన స్త్రీని మఱచిపోవుట యసంభవమైన విషయము. దుష్యంతునివంటి సత్పురుషుడు (సతాం హి సందేహపదేషువస్తుషు)(—)ఈ 'సత్' యొక్క లక్షణము మరియొక వ్యాసమందు వివరింపబడును.(—) మరచిపోవుట మరియు నసంభవము. ఇట్టికథ పాశ్చాత్యదేశములయందు వెలసినచో, నీ దుష్యంతునకొక పరిస్థితియందు శరీరమున కొక వ్యాఘాతము గలిగి స్మృతినశించి వైద్యశాలలయందు చికిత్సితుడై పునస్స్మృతి గలిగినట్లు చేయవలయును. అపుడు నాటకముయొక్క నాటకత్వము లేదు.

దుష్యంతుడు పరమవివేకి. పరమసత్పురుషుడు. ఆయన మెదడునకు మోపైన దెబ్బ తగులలేదు. ఈ పరిస్థితిలో ఆయనకు శకుంతలావిస్మృతి జరుగవలయును. విస్మృతియనగా నెట్టిది? ఎట్లు జరుగవచ్చును? ఒక యనుభవము జరిగి జరుగనట్లు భావించుట విస్మృతి. జరిగినవెంటనే మరువిమఱపము

నందట్లు తోవదుగదా. కొంతకాలము జరుగవలయును. ఆకాలమునందు తదనుభవముయొక్క పునః పునస్సంస్మరణ జరిగినచో సంస్కారము దృఢమగును. జరుగనిచో దానికి దార్ఢ్యము గలుగదు. అప్పుడు విస్మృతి కలుగవచ్చును. ప్రత్యభిజ్ఞానము హఠాత్తుగా కలుగును. అనగా పూర్వానుభూతి యంతయు నొక్కసారి ఝటితిగా స్ఫురించును ఈ ఝటితిస్ఫురణమున కవలంబము మిక్కిలి గట్టిదై యుండవలయును. ఆయవలంబ మీనాటకమునందు రాజాంగుళీయకమై యున్నది. ఈ యంగుళీయకము యొక్క యవలంబత్వములోని గాఢత్వము శకుంతలాదర్శనముకంటె గూడ గొప్పదియా ? రాజు విషయములో గొప్పదియే. అందుకనియే శాకుంతల వ్యాఖ్యాతయైన శ్రీనివాసాదార్యులు 'అభినవ మధులోలుప స్త్వం' అన్న చూళికాశ్లోక వ్యాఖ్యానమునందు 'అభినవపదేన రత్నహారీతు పార్థివ ఇతిన్యాయేన ఉపర్యుపరి తతోఽధ్యిననుభూతదృష్టాశ్రుతపూర్వలోకోత్తరయువతిసంభోగలంపటత్వం ప్రకాశ్యతే' అని వ్రాసినాడు. కనుక శకుంతలకంటె గూడ ఉంగరమే గొప్పది.

ఈ యుంగరము రాజముద్రికయా ? వట్టి హస్తాంగుళీయకమా ? ఇది రాజముద్రికకాదు. అయినచో బహువ్యవహార సమాపన్నాపసరత్వముచేత విస్మృతికి వీలులేదు. ఈయంగుళీయకము పోయినదనిగూడ గుర్తులేదు. కనిపించినప్పుడే అది పోయినదని తెలియుట. అందుచేత విస్మృతికి నవకాశముఁ గలదు.

ఈ విస్మృతి యెప్పుడు జరిగినది? రాజు శకుంతలకంగుళీయకమిచ్చి, 'ఏకైక మత్ర దివసే దివసే మదీయం నామాక్షరం గణయ గచ్ఛతి యావదంతం, తావత్ప్రియే మదవరోధ గృహప్రవేశం నేతాజనస్తవ సమీప ముపైష్యతి' ఇది గడువు. ఆ యుంగరము మీద దుష్యంతునిపేరు వ్రాయబడియున్నది. అవి యెన్ని యక్షరములో అన్ని దినములలో దుష్యంతుడు శకుంతలకొఱకు మనుష్యులను పంపించును. ఎన్ని యక్షరము లున్నవో మనకుఁ దెలియదు. 'దుష్యంతః' అన్న మూడక్షరములే మాత్రముగావు. అయినచో గుదురవు. 'దుష్యంతమహారాజః' అన్న యేడక్షరములు గావచ్చును. సంఖ్యకూడ ఫలితమునకు యోగ్యముగా నున్నది గనుక. ఈశాప మీ యేడు దినములలో జరిగినదై యుండవలయును.

శకుంతలాసంగమవృత్తాంతము కొంత కణ్వాశ్రమమునందే ప్రాతబడినది. ఏలయనగా కణ్వాశ్రమమందు ఋషులు "మహర్షే రసాన్నిధ్యాత్ రక్షాంసి నః ఇష్టివిఘ్న ముత్పాదయంతి తత్కతిపయరాత్రం సారథిద్వితీయేన ఆయుధసధ్రీచా భవతా సనాథీక్రియతా మాశ్రమః' అని యడిగినారు. ఆయన ఒప్పుకొన్నాడు. ఆయన కొన్నాళ్ళాశ్రమములో నున్నాడు. శకుంతలా ప్రథమసమాగమ సర్వోత్సుకత్వము వానియందు తగ్గినది. ఆమెను వదలి నిముసముండలేనన్న యుత్కంఠా మహోద్రేకము తగ్గినది. ఆమె గర్భవతి యని తెలిసికొనిగూడ వెళ్ళినాడేమో. ఆ వెళ్ళెడు చివరరోజులలో శకుంతలను వదలిపెట్టి వెళ్లుట మిక్కిలి కష్టముగా నతడు భావించినట్లుకూడ ప్రియంవదానసూయలకు భాసించలేదు. ఆమె తనకు భార్య. ఇంటికి పిలిపించుకొందునన్న నిలుకడపొందిన మనోలక్షణమే అప్పుడు దుష్యంతునియందు దృశ్యమానమై యుండెను. అందుకనియే చతుర్థాంకమునందలి మొదటి విష్కంభములో ననసూయ యిట్లన్నది.

"సఖి ! ప్రియంవదే ! గాంధర్వేణ వివాహవిధినా నిర్వృత్తకల్యాణా శకుంతలా అనురూపభర్తృగామినీ సంవృత్తా ఇతి నిర్వృతం మే హృదయమ్. తవాప్యేత చ్చింతనీయమ్. అద్య స రాజర్షి రిష్టిం పరిసమాప్య ఋషిభి ర్విసర్జితః; ఆత్మనో నగరం ప్రవిశ్య అంతఃపురసమాగతః ఇతోగతం వృత్తాన్తం స్మరతి వా నవేతి."

రాజువెళ్ళి రెండు మూడు దినములై యుండవచ్చును. కాదా నాలుగైదు దినములు. వెళ్లెడు నప్పుడు రాజునకు శకుంతలమీద తొలుతటి యుత్కంఠా

సముద్వేగము కన్పించలేదు. కన్పించినచో ననసూయ యిప్పు డిట్లు భయపడదు.

రాజింటికి పోయినాడు. ఇన్నాళ్లు రాజధానియందు లేడు. అనేకములైన రాజకార్యము లాతనికొరకు వేచి యుండియుండును. మనస్సు వానియందు ప్రవేశించి యుండియుండును—ఈ విస్మృతి ఆ సమయములో ఆయన మనస్సు నావరించి యుండవలెను. ఆయన సహజముగా మఱచిపోవువాడుఁ గాడు. శాప మాకాలమున కపకినది. తరువాత నాలుగైదు నెలలు గడచినవి. ఈ విస్మృతి బలపడినది.

ఈ శాపము అంగుళీయకగత నామాక్షర సంఖ్యా దినములు గడవకముందే జరిగినది. ఏలయనగా ఈ శాపము ఏతద్విష్కంభములోనిదే. అనసూయ ఈ అనుమానము పడుటయు, వెంటనే శాపము సంభవించుటయు జరిగినది. అన్నాళ్ళు రాజధానియందులేక దుష్యంతుడు రాజధానికి తిరిగివెళ్ళిన దినములు పేరుకొనియున్న రాచరికపు పనుల యొత్తిడి. అప్పు డీ శాపము దెబ్బదీసినది. షేక్స్పియర్ విరచిత నాటకములయందు జంటకాలము డబుల్ టైం అను నొక విశేషము విమర్శకులు చూపుచుందురు. ఇది అట్టిది. అంత కంటెను సూక్ష్మమై రమణీయమైనది.

ఈ విస్మృతి యొక్క స్వరూపమెట్టిది? ఆద్యంతము దీనిస్వరూపమిట్టిది-

యథా గజో నేతి సమక్షరూపే
తస్మి న్నతిక్రామతి సంశయస్స్యాత్
పదాని దృష్ట్వాతు భవేత్ప్రతీతిః
తథా విధో మే మనసో వికారః'

ఇది అటువంటి విస్మృతి. శకుంతలయు అంగుళీయకమును. వీనిలో శకుంతల గజము. అంగుళీయకము పదాంకములు. ఇంతకుమున్ను చెప్పితివిగదా. శంకుతలను చూచినవెంటనే వివాహస్మరణము కలుగవలయునని. అస్మరణ మంగుళీయకముతో జరిగినది. శకుంతలాదర్శనవేళ తత్స్మరణము జరుగకపోవుటకు 'అభినవమధలోలుపః' అన్న శ్లోక వ్యాఖ్యానము చూపింపబడినది. ఆ వ్యాఖ్యానము హంసపదికా తాత్పర్యము. యథార్థకారణముగాదు. యథార్థకారణము శాపము.

'బుద్ధిస్తు ద్వివిధామతా
అనుభూతిః స్మృతిశ్చ స్యాత్'

అనుభూతియు స్మృతియు రెండును కలిసి బుద్ధి. అందుకవియే పంచమాంకములో శకుంతల రాజాను తృణచ్ఛన్న కూపోపమునిగా వర్ణించినపుడు రాజిట్లనెను. 'సందిగ్ధబుద్ధిం మాంకుర్వ౯ అకైతవ ఇవాస్యాః కోపః ఉపలక్ష్యతే' అన్నాడు. ఈ బుద్ధి యొక్క సంవిగ్ధత్వ మెట్టిది? అనుభవమున్నది. స్మృతిలేదు. అనుభవముండుట యెట్లు? స్మృతి లేకుండుట యెట్లు? ఈ సంగతి మరియొకవ్యాసమున పరిశీలితమగును.

ఇక్కడ బుద్ధి దెబ్బదినలేదు. అనుభూతి దెబ్బదినలేదు. ఒక్క స్మృతి దెబ్బదిన్నది. మరల నొకసారి యంతఃకరణ లక్షణము చెప్పకతప్పదు. ఆ యంతఃకరణము మనోబుద్ధ్యహంకార చిత్తలక్షణము కలది. అంతఃకరణమున్నది. అది యీ నాల్గు విధములుగా ప్రసరించుచున్నది. గరిష్ఠమైనదిచిత్తము. కనిష్ఠమైనది మనస్సు. ఈ ప్రసరణమునకు వృత్తి యనిపేరు. బుద్ధ్యహంకారచిత్తములు అంతఃకరణమునకు మిక్కిలి దగ్గఱవి. మనస్సు నిత్యేంద్రియ సన్నికర్షముగలది. మనస్సులో తొంబదిపాళ్ళు లౌకికము. మనస్సు లోకమునకు సంబంధించినది.

ఋషులయొక్క శాపము లెట్టివి? పురాణము లెన్నియైనను పరిశీలించవచ్చును. నీవు రాతివికమ్ము- వేయిజన్మలు కుక్కజన్మలెత్తుము- నీ సంతానము కిరాతు లగుదురుగాక! - నీ వంధుడ వగుదువుగాక! నీకుసంతానము లేకపోవుగాక! ఎన్ని శాపములైనను జీవుని కర్మానుభవమునకు సంబంధించినవి. వాని బహుజన్మల శరీరములు తద్గత సుఖదుఃఖానుభవములకు సంబంధించినవి.

నీ కెప్పుడును పుణ్యపుటూహ రాకుండుగాక. నీ యంతఃకరణము నశించుగాక, నీలో చైతన్యము

నశించుగాక! ఇట్టి శాపము లెచ్చటను లేవు. ఉండవు. ఉండుటకు వీలులేదు.

ఏలయనగా బుద్ధ్యహంకార చిత్తములు అంతఃకరణ ప్రధానలక్షణములు గలవి. అంతఃకరణ మనగా జీవచైతన్యము. మాయాపిహితమైన బ్రహ్మ చైతన్యము. దానికి శాపము లేదు. నాశము లేదు. కనుక లౌకికమంతయు, కర్మానుభూతియంతయు కష్టసుఖములన్నియు మనోనిష్ఠములు. మనస్సునకు కర్మలకు లంకె. అనుభవమునకు మనస్సునకు లంకె. కనుక మనస్సునకు సంబంధించిన స్మరణము లోక సంబంధమైనది. శాపమందులో గలిగినది. శాపము దానియందు ప్రవర్తించును. బుద్ధ్యహంకార చిత్తముల యందు ప్రవర్తించదు.

నీవు దీనిని మఱచిపోదువుగాక అన్నశాపము మరి యింకెచ్చటను కన్పించుటలేదు. శాప మిచ్చునది దుర్వాసుడు. ఈ దుర్వాసుడు యతి. ఋషులలో యతి యైనవా డీయన యొక్కడే. ఇతర ఋషుల శాపము లిట్లుండవు. ఈయన యతిగనుక యీయన శాపము మనస్సును స్పృశించినది యతియొక్క ప్రథానకర్మ మనోనిగ్రహము గనుక.

'విచిన్తయన్తీయ మనన్యమానసా
తపోనిధిం వేత్సి న మా ముపస్థితమ్
స్మరిష్యతి త్వాం న స బోధితోపిసన్
కథాప్రమత్తః ప్రథమం కృతామివ'

ఈ శ్లోకములో 'మాం' అన్న శబ్దమునకు 'స్వస్య ఇతరఋషి వైలక్షణ్యేన శీఘ్రకోపోదయ త్వం, అవమానాసహిష్ణుత్వం చ వ్యజ్యతే అని పూర్వవ్యాఖ్యానము. కాని యిట్లు వ్రాయవచ్చును :

"అహంతావత్ తపోరూపమనో నియమసాకల్య పరిజ్ఞాతా, మమమన స్యధికారోఽస్తి. యత్ర మమాధికారో వర్తతే తత్రాహం మవమానితః, యం దుష్యంతం త్వం భావయసి తస్యాపిమనః మమాధి కారేఽస్తి యదహం సర్వస్య మనసపి స్వరూపావ గతిమాన్"

ఇట్లుగూడ వ్యాఖ్యానము చేయవచ్చును. అనగా దూర్వాసుడు మనోనియమసర్వలక్షణపరిజ్ఞాతయేకాక దానిపై నధికారముగలవాడు గూడ నైయుండెను. ఎవనిమనస్సైనను సర్వజీవసమాహారభూతుడు పర మేశ్వరుడైనట్లు, సర్వమనస్సమాహారభూతద్రవ్యము మీద దుర్వాసుని విలక్షణమైన మనోనియమలక్షణము చేత నధికారము గలదు. అని యర్థము.

ఇది కాళిదాసునియొక్క వ్యాఖ్యానము. అంతఃకరణముయొక్క నాల్గవభాగమైన మనస్సులోని స్మృతి ఋషిశాపమున కధీనమైయుండవచ్చును. అది ఋషులయొక్క శాపపరిథిలోనిదే. ఎందుచేత? లోకమునకు సంబంధించినదిగనుక. లోకము కర్మ యొక్క సమాహారభూతము సుఖదుఃఖములు మన స్సున కధీనములు. లోకమునందలి సర్వసుఖము యొక్క సారము స్మృతిజన్యము. అనుభవము సుఖము. స్మృతిసుఖసారము. అందుకనియే సంభోగ శృంగారముకంటె విప్రలంభశృంగారముత్తరము.

కాళిదాసుశాపము నిట్లు కల్పించెను. శాపము వెనుకనున్న తత్త్వమిది ఈశాపము ఒక్క మనస్సునే బాధించుచున్నది. స్మరణమును మాత్రమునే బాధించు చున్నది. తక్కిన వేనిని బాధించలేదు. ఇట్టి యేక దేశమునందలి బాధచేతనే ఈ నాటకమునందలి తక్కినకథ జరిగినది. దుష్యంతుడు సత్పురుషు డగుటచేత నాతని స్వభావము చెడలేదు. అంతఃకర ణమునందలి తదితరభాగము లబాధితములగుటచేత నాటకమున రసము భంగము కాలేదు. అవి యెట్లెట్లో వేఱ, వేఱ వ్యాసములు వ్రాయబడును.

కాళిదాసు ఋషికల్పుడు. ధర్మవ్యవస్థానిరూప కుడు. అంతఃకరణ స్వరూప నిర్ణేత.

జువ్వాడి గౌతమరావు

# వ్యవహారభాష : వ్యాకరణము

వ్యవహార భాషావాదం పుట్టి నలభై యేళ్ల పైచిలుకైనా ఆ వ్యవహారభాషంటేపమిటో, దాని సమగ్ర స్వరూపమేమిటో నిర్ణయించినవారెవరూ ఇంతవరకూ లేరు. ఈ వాదానికి మూలస్తంభమని చెప్పదగిన గిడుగు రామమూర్తి పంతులుగారు మరణించి ఇప్పటికి దాదాపు ఇరవై సంవత్సరాలు కావస్తున్నది. మరణాత్పూర్వం ఆయన తెలుగుభాషయొక్క స్వరూప స్వభావాలను సమగ్రంగా నిరూపించుదామనే తలంపుతో ఒక పదకోశాన్ని కొంత తయారుచేసినట్టూ, ఆయన మరణానంతరం ఆ పదకోశం అతి విచిత్ర పరిస్థితుల్లో అంతర్ధానమైనట్లూ, నిజమో కాదో కాని లోకంలో ఒక కింవదంతి ఉన్నది. కీర్తిశేషులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు చెప్పినట్లుగా ఆంధ్రకావ్య భాషకే సరియైన వ్యాకరణం మనకు ఇంతవరకూ లేదు. వ్యవహార రూపాలను ఒప్పుకొన్నా, ఒప్పుకోకపోయినా తెలుగు కావ్యాలలో ఉన్న ప్రయోగ వైచిత్రినంతా విశదీకరిస్తూ ఒక గ్రంథము వ్రాయటానికి తగిన పాండిత్యం ఉన్నవాళ్లు తెలుగుదేశంలో వేళ్లమీద లెక్కపెట్టదగినంత మందికూడ లేరు, ఏ యిద్దరు ముగ్గురన్నా ఉంటే వాళ్లకి అహమస్మి అని ముందుకు వచ్చే సాహసంలేదు. 'వ్యాకరణమ్మొక త్రోవ, మహాకవులొక త్రోవ, కోశమఖిలమ్మొక త్రోవై కన్పించెడి నీ భాషాకావ్యములను తఱచు చదివిన కొలదిన్' అందుచేత భాషయొక్క సమగ్రస్వరూపం నిర్ణయించడమనేది సుఖసుఖాలమీద తేలేపని కాదు. పోనీ ఆ యిద్దరి ముగ్గురిలో ఎవరైనా ఒకళ్లు సాహసించి ముందుకు రాకపోవడానికి కారణం ఈ పై విషయాన్ని బాగా ఎరిగుండబట్టి హాస్యాస్పదులం అవుతామేమో అనే భయంచేతనే అనే అనుకోవలసివస్తుంది. కావ్యభాష సంగతే ఇల్లా ఉంటే దారీ తెన్నూ లేని వ్యవహారభాషను వ్యాకరించబూనుకోవటం సంగతి వేరే చెప్పక్కఱలేదు.

అసలు వ్యవహారభాషకి ఒక వ్యాకరణం కావాలి అనుకోవడంలోనే ఉన్నది చమత్కారమంతా. వ్యవహార భాషకి వ్యాకరణం లేదు అనే ఒక గోల దేశంలో చాలా కాలంబట్టి వినిపిస్తున్నది. ఒక పక్కనుంచి ఈగోల ఇట్లాఉండగా ఆగిడుగు రామమూర్తిగారు ఆ వ్యవహార భాషాస్వరూపం ఎట్లా ఉంటే బాగా ఉంటుందని అనుకున్నారో దానికి సంవత్సరానికి వందమైళ్ల చొప్పున వ్యవహారభాష దూరంపోతూవచ్చింది. గిడుగు రామమూర్తిపంతులుగారే ఆ వ్యవహారభాష కొక వ్యాకరణం వ్రాసిఉంటే అప్పటి కది సమగ్రమైనా కాకపోయినా మరుసంవత్సరానికల్లా వందమైళ్ళు వెనుకబడిపొయ్యేది. అదిన్నీ కాక ఈ వ్యవహారభాషా వ్యాకరణం వ్రాయడానికి ప్రామాణికంగా తీసుకోవలసిన పదజాలం ఉంటుందికదా! ఈ పదజాలం నిత్య వ్యవహారంలో ప్రజలు ఉపయోగించేదాన్ని తీసుకోవలెనా లేక వ్యవహార భాషలో గ్రంథములు వ్రాస్తున్నామని చెప్పేవారి రచనల్లోనుంచి తీసుకోవలెనా అనే ఒక పెద్దతగాదా ఉంది. నిష్పక్షపాతంగా చెప్పవలెనంటే భగవంతుడిముఖంచూచి నేను అచ్చమైన వ్యవహార భాషలోనే వ్రాయగలనని చెప్పేవాడు ఎవడూ ఇంతవరకూ పుట్టలేదు. వచనంలో కొంత వ్యవహార భాషకు దగ్గరగా వ్రాయవచ్చు. పద్యంలో అసలు వ్యవహారభాషను వ్రాయడమనేది దుర్లభమైన విషయం. అది యెవడో 'మహా ప్రతిభావంతుడు

కాని నూటికి పాతికపాళ్లైనా నిర్వహించలేని విషయం. గిడుగు రామమూర్తి పంతులుగారి వాదాన్ని నవ్యసాహిత్య పరిషత్తువారు నూటికి నూరుపాళ్లూ అంగీకరించారు. నవ్యసాహిత్యపరిషత్తు సృష్టించిన కవులలో అతిరథమహారథులమని అనుకొనేవాళ్లు కూడా వ్యవహార భాషలో పద్యములు వ్రాయలేదు. వ్రాస్తే ఆ వ్యవహారభాష వారు వ్రాసిన గ్రాంథిక భాషకన్నా అధ్వాన్నంగా ఉండేది. వ్యవహార భాషలో పద్యాలు వ్రాయాలంటే వేణుగోపాలశతకకర్త, చంద్రశేఖరశతక కర్త, కూచిమంచి జగ్గకవి లాంటి ప్రతిభాశాలులు ఉండాలి. ఇంత నవ్యసాహిత్యపరిషత్తు చరిత్రలోనూ వ్యవహారభాషలో వ్రాసిన పద్యాలు వేళ్ళమీద లెక్కపెట్టదగినంతకంటె ఎక్కువలేవు. వాటిలోని భాష కూడ అకృత్రిమము కాదని చెప్పటానికి వీలులేదు.

ఇది ఇట్లా ఉండగా వాక్యనిర్మాణం దగ్గర వ్యవహారానికీ వ్రాయడానికీ మధ్య ఒక పెద్ద అఖాతం ఉన్నది. మాట్లాడటంలో వాక్యనిర్మాణం వేరు. వ్రాతలో వాక్యనిర్మాణం వేరు. వ్రాతలో ఉన్న కుదింపు మాట్లాడటంలో ఉండదు. మాట్లాడటంలో ఉన్న స్వాభావికత, వ్యంజకత్వం వ్రాతలోఉండదు. పూర్వమహాకవుల గొప్పతనమంతా ఇక్కడేఉన్నది. తెనుగువాడు ఒక భావాన్ని వ్యక్తంచేసేటప్పుడు వాక్యనిర్మాణం ఎట్లా చేస్తాడో వారు బాగా పరిశీలన చేసి మరీ వ్రాశారు. వాక్యంలో ఉన్న పదముల యొక్క స్థానాన్ని బట్టి, ఆ వాక్యం మొదలుపెట్టుట, అంతముచేయుటలను బట్టి, ఆ వాక్యం ఉచ్చరించేటప్పుడు కంఠస్వరంలో తెచ్చే హెచ్చుతగ్గులను బట్టి వక్తయొక్క భావంలోని వైవిధ్యం స్ఫురిస్తూఉంటుంది. భావానికి సహస్రముఖములుంటవి. ఏ ముఖమునుండి భావాన్ని ప్రకటించినపుడు తెలుగువాడేవిధమైన వైఖరిని అవలంబిస్తాడో దానిని పట్టుకొని వ్రాయడంలో మహాకవి యొక్క ప్రతిభ అంతా ఉంటుంది. అందుచేత వ్రాయడమనేది మాట్లాడే అంత తేలిక గాదు. ఎంత వీరవ్యవహారభాషావాది యైనా తాను మాట్లాడినట్లే తాను వ్రాయలేడన్నది నూటికి నూరుపాళ్లూ యథార్థము. ఈ దృష్ట్యా చూస్తే నేటి వ్యవహారభాషావాదులు వ్రాసేభాష అంతా బహు కృత్రిమమైనదని చెప్పవచ్చును. కావ్యభాషలో వ్యవహారంలో ఉన్న ఈ భావప్రకటనావైఖరి అనేది సహస్రాంశాల్లో ఒక అంశం కాబట్టి ఆ భాషకి కృత్రిమత్వం ఈ దృష్ట్యా ఆరోపించడానికి వీల్లేదు. కావ్యభాష అల్లాగేఉండాలి అనే విషయాన్ని ఇక్కడ నిరూపింపవలసిన అవసరంలేదు. ఆ సహస్రవిషయాల్లో ఏ పది విషయాలో తెలిసికొని అవ్వి ఈ వ్యవహారభాషలో వ్రాస్తే జారిపోతాయని తెలియబట్టే నవ్య సాహిత్య పరిషత్తు తాలూకు కవులు కూడా వారికి చేతనైనంత కావ్యభాషలో కావ్యాలు వ్రాశారు.

ఈ వ్యవహార భాషావాదముయొక్క పట్టంతా అందరికీ అర్థమయ్యేట్టు వ్రాయాలనడంలో ఉంది. ఇంతకంటే బలవత్తరమైన కారణం మరొకటిలేదు. సాధ్యమైనంత ఎక్కువమంది కర్థమయ్యేటట్టు తేలికభాషలో వ్రాయాలనడం అందరూ ఒప్పుకోదగ్గదే. కాని అందరికీ అర్థము కావడమనేది గ్రాంథిక వ్యవహార భేదంలోలేదు. గ్రాంథికభాష ఎక్కువమందికర్థమై వ్యవహారభాష అనేది అర్థం కాకపోవచ్చు. అర్థంకావడం కాకపోవటం వాడిన పదజాలాన్ని బట్టీ, చెప్పే విషయము యొక్క కాఠిన్యాన్నిబట్టీ ఉంటుంది. 'నీ రాక నాకు సంతోష కారణము' అంటే అర్థంకాకపోయి 'నీ ఆగమనం నాకు ముదావహం' అంటే అర్థమవుతుందా ? వ్యాకరణాన్ని మీరినంతమాత్రంచేత కఠినమైన పదాలు వాడినా అది వ్యవహారభాష ఔతుందనుకోవటంకంటే భ్రాంతి ఇంకొకటిఉండదు. నేడు వ్యవహారభాషగా చలామణిఔతున్న భాషలో చాలాభాగం ఇల్లాంటిదే.

అభ్యుదయ కవుల్లో అగ్రేసరులుగా చెప్పబడుతున్న శ్రీశ్రీ, ఆరుద్ర మొదలైనవాళ్ళ భాష అంతా ఇట్లాంటిదే. అందరికీ తెలిసే అట్లు వ్రాయాలనడం అభ్యుదయ కవులయొక్క అభిప్రాయమే ఐనప్పటికీ వాళ్ళకంటే దుర్బోధంగా వ్రాసేవాళ్లు ఎవ్వరులేరు. అందుచేత మాట్లాడుకున్నట్టు వ్రాయడమనేది అసాధ్యమనేది ఋజువు ఔతున్నది కదా!

ఈ సంగతి ఇట్లా ఉండగా పత్రికలభాష ఉన్నది. ఇదికూడా వ్యవహారభాషక్రింద చలామణిఔతున్న భాష. కాని న్యాయం ఆలోచిస్తే ఈ భాషయందున్నటువంటి కృత్రిమత్వం సంగతి అట్లా ఉంచి ఏ కొంచెమైనా వ్యవహారానికి దగ్గరగా ఉన్నదంటే ఆ ఉన్న కొంచెం దగ్గరతనమూ కృష్ణాజిల్లా వ్యవహారభాషతోనే ఉంది. అందులోను కృష్ణాజిల్లా బ్రాహ్మణులు మాట్లాడే భాషతోనే సంబంధంకలిగి ఉంది. దీనికి కారణం అందరికీ తెలిసిందే. తెలుగు దేశంలో ప్రముఖమైన రెండు దినపత్రికలూ కృష్ణాజిల్లా వారిచేత నడపబడేవి కావటం. అందులోనూ ప్రధానంగా ఆంధ్రపత్రిక భాషకు మిక్కిలి ప్రాముఖ్యం రావడం, తరువాత వచ్చిన ఆంధ్రప్రభ ఆ మార్గాన్నే అనుసరించక తప్పకపోవడము. అందుచేత కృష్ణాజిల్లా బ్రాహ్మణభాషకి తెలుగుదేశమంతా బాగా ప్రచారం వచ్చి అది ఒక రకమైన రచనా భాషగా రూపొందింది. అదైనా పైన పేర్కొన్న కారణాలవల్ల సహజంగానూ, వ్యంజకంగానూ రూపొందలేదు. వ్యవహారభాషలో వ్రాస్తున్నామనుకొనేవాళ్లంతా కొంతకృత్రిమత్వం పొందిన ఈ కృష్ణాజిల్లా బ్రాహ్మణభాషకే దాస్యం చేస్తున్నారు. ఇది అక్షరాలా నిజం. మాధవపెద్ది గోఖలే మొదలైనవారు కొందరు ఈ భాషా నియంతృత్వాన్ని కూలదోయాలని ప్రయత్నమైతే చేస్తున్నారుకాని ఆ ప్రయత్నానికి నాలుగుమూలల నుంచీ బలం చేకూరలేదనే చెప్పాలి. ఈ వ్యవహార భాషలో వ్రాస్తున్నామనుకొనేవారి కృష్ణాజిల్లా బ్రాహ్మణభాషా దాస్యం ఎంత బలమైందంటే అట్లాంటి భాషా దాస్యం వాళ్ళు చేస్తున్నారనేది కూడా వాళ్లకు తెలియదు. ఆ పత్రికలు చదవటం వల్ల ఆ భాషలో వ్రాసిన ఇతర రచనలు చదవడం వల్ల ఆ వాతావరణం బాగా వాళ్ల మనస్సులపైన ముద్రితమైపోయింది. వారిలో అబ్రాహ్మణులు కూడా ఇతరత్రా వారికి సహజమైన భాషలోనే మాట్లాడినా వ్రాయడంవద్దకువచ్చేసరికి ఈ భాషలో వ్రాస్తారు. ఇది వ్యవహారభాష అనుకొంటారు. నూటికి ముగ్గురు అందులో కృష్ణాజిల్లాలోవాళ్ళు మాత్రమే మాట్లాడే భాష వ్యవహారభాషయై కూర్చోటంకంటె విచిత్రం ఇంకొకటేముంటుంది? ఆంధ్రదేశానికి ఎల్లల్లో ఉన్న పర్లాకిమిడి, నిజామాబాద్, చిత్తూరు జిల్లాలవారుకూడా తమ మాండలిక భాషల్లో వ్రాయటానికి జంకుతారు. తమకి సహజమైన భాషలో వ్రాయడానికి జంకుతారు. కృష్ణాజిల్లాలోనే పైకులాలకు చెందిన అబ్రాహ్మణులు మాట్లాడేఅప్పుడు ఉండాడు, యెళ్తాను, ఎంటికలు అని అంటారు. వ్రాసేఅప్పుడు ఉన్నాడు, వెడతాడు, వెంట్రుకలు అని వ్రాస్తారు ఉండెను, వెళ్లును, వెండ్రుకలుఅని వ్రాస్తే గ్రాంథికమగునని భావిస్తారు. తెలంగాణములో వచ్చిండు, పొద్దుగాల, వాన్ని తోలుకరా మొదలైనవి మాట్లాడుతారు. వ్రాసేటపుడు 'వచ్చాడు, పొద్దున్నే, వాణ్ణి తీసుకరా' అని వ్రాస్తారు. వచ్చినాడు, ప్రొద్దున, తీసికొనిరమ్ము అని వ్రాస్తే గ్రాంథికమని అనుకొంటారు. న్యాయానికి ఆ కృష్ణాజిల్లాలో అబ్రాహ్మణ రచయితలకీ, ఈ తెలంగాణా రచయితలకీ అందరికీ కూడా ఆ గ్రాంథికభాష ఎంత గ్రాంథికమో ఈ వ్యవహార భాషా అంత గ్రాంథికమే. వారు మాట్లాడే భాష దృష్ట్యా రెండూ సమానమే. ఒకదాన్ని గ్రాంథికమనీ, రెండవదాన్ని వ్యవహారమనీ వారిని వారు వంచించుకొంటున్నారు. అందుచేత ఈ వ్యవహార భాష అనబడేభాష అటు గ్రాంథికం కాకుండా ఇటు నిజమైన ప్రజాభాష కాకుండా త్రిశంకు స్వర్గంగా వ్రేలాడుతుంది.

మరొక విచిత్ర మేమిటంటే ఈ వ్యవహార భాషలోని శబ్దస్వరూపంకంటె గ్రాంథికభాషలోని శబ్దస్వరూపమే తెలుగుదేశంలోని అన్ని జిల్లాల వారు వాడే శబ్దస్వరూపానికి దగ్గరగా ఉంటుంది. అందుచేత తక్కినజిల్లాలవారికి ఈవ్యవహారభాషను నేర్చుకోవటంకంటె ఆ గ్రాంథిక భాష నేర్చుకోవటమే చాల సులభం. కృష్ణా జిల్లాకి దూరంలో ఉన్న, రచయితలు కాకుండా పత్రికలు చదవకుండాఉండి అక్షరాస్యులు ఐనవారు ఈ వ్యవహారభాషలో వ్రాసిన గ్రంథాలను పత్రికలను గాని చదవటం తటస్థిస్తే వారు సరిగ్గా అర్థంచేసికోలేరు. కాని భారత భాగవతాదులు చదివి అర్థం చేసికోగలరు. అక్షరాస్యులే అక్కరలేదు. సామాన్య ప్రజలు కూడా భారత భాగవతాదులను చదివితే అర్థంచేసికోగలగటం సర్వత్రా ఉంది. కాని ఇటీవల ప్రచురితాలైన వ్యవహారభాషా భారత రామాయణాలను అర్థంచేసుకోలేరు. ఇందుచేత ప్రజాభాషకి దగ్గరఐన భాష మనకి ఏదో సుగమంగా తెలుస్తుంది. శబ్ద కాఠిన్యం అక్కడా ఇక్కడా సమానమే. తేడా వ్యాకరణంలో ఉంది. గ్రాంథికభాషా స్వభావం తెలుగుదేశములోని సర్వ ప్రజాభాషా స్వభానికి దగ్గర. ఈ దగ్గరతనంవల్ల గ్రాంథికభాష అర్థం కావడం, వ్యావహారిక భాష అర్థంకాకపోవడం జరుగుతున్నది. ఇది యిట్లా ఉండగా వ్యవహార భాషావాదులు ప్రాయికంగా ఆంగ్లభాషాపరిచయం కలవాళ్లు కాబట్టి ఆ భాషాపదాలు ఆ వాక్య నిర్మాణ పద్ధతులు ఈ వ్యవహార భాషలోనికి దిగుమతి ఐనవి. ఆయా దేశాలనుండి సంక్రమించిన నూత్న విషయాలను గురించి వ్రాయవలసివచ్చినపుడు మాత్రమే కాకుండా దేశీయమైన విషయాలను చెప్పవలసి వచ్చినపుడు కూడా ఆంగ్లవాసన లేకుండా చెప్పడం సకృత్తుగా కాని కనిపించదు. అందుచేత ఒకవిధమైన అస్పష్టత, ఒకవిధమైన కృత్రిమత్వము ఈ భాషయందు దలముకొన్నవి. మరొకటి, వీరిలో ఎక్కువ మందికి సంస్కృతాంధ్రాలయందు ప్రవేశ మంతంతమాత్రం కావటంచేత ఆయా శబ్ద స్వరూపాలు పరిభ్రష్టములై వాడబడుతూవచ్చినవి. భాష తెలియని లోపంవల్ల కలిగిన ఈ దోషాలు అనంతంగా ఉన్నవి. భాషలో పాండిత్యం తగ్గిపోతూఉన్నకొద్దీ ఈ దోషాల సంఖ్య పెరుగుతూ వస్తున్నది. ఈ దోషాలు శబ్దస్వరూపానికీ, అర్థానికీ సంధిసమాసాదులకూ సంబంధించినవి.

గిడుగు రామమూర్తి, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి వంటివారు ఇల్లాంటి దోషాలులేని భాష వ్రాసిన మాట నిజమే. వారు వ్రాసినభాషే ప్రమాణంగా స్వీకరించాలి అంటే అది ఇద్దరిభాష మాత్రమే అవుతుంది. మూడుకోట్ల ఆంధ్రుల్లో ఇద్దరిభాషనే ప్రమాణంగా స్వీకరించడమూ అనేమాట వస్తుంది. అట్లాకాదు శిష్టవ్యావహారికాన్ని ప్రమాణంగా తీసికొని తక్కిన భాషమీద ఒక గీటు పెడదామంటే ఇంతకంటే కొంచెం మడికట్టుకొన్నవాడు ఈ శిష్టుల భాషమీద కూడా గీటు పెడదాము అని యెందుకనకూడదు? ఆ గ్రాంథికభాషకంటే ఈ శిష్ట వ్యావహారికాని కెక్కువ సౌలభ్యమంటే దీనిని ఒప్పుకోవచ్చు. పైగా ఈ శిష్టులంటే ఎవరు? గిడుగు రామమూర్తి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వంటివారా? అటువంటివారు శిష్టులంటే ఇప్పుడట్లాంటివాళ్ళెవరున్నారు? ఒకవేళ ఉన్నా ఆ వ్యాకరణ నియమాలనే ఉల్లంఘించాలి అన్నంత పట్టుదల ఎందుకు? వ్యాకరణ నియమాలంటే ఏ చిన్నయ్యసూరియో, బహుజనపల్లి సీతారామాచార్యులో చేసినవి కావు. భాషాస్వభావం తెలిసిన మహాకవులు తమ ప్రయోగాలలో అనుసరించినవి. ఎక్కడైనా ఒకచోట శ్రవణసుఖాన్ని పట్టో, రసావేశాన్ని పట్టో కొన్ని అతిక్రమణలుంటే ఉండవచ్చు. అంతేకాని మొత్తం వ్యాకరణాన్ని అంతా తిరస్కరిద్దామంటే దానివల్ల ప్రయోజన మేమిటి? ఏ కట్టుబాటూ అక్కర లేకుండా వ్రాయాలి అనే ప్రయోజన మొక్కటేకదా? విశృంఖలంగా వ్రాయడం చాలా తేలికైనమాట

నిజమే గాని అట్లా వ్రాయాలనుకొనేవాడు శిష్టుడవుతాడా? అనే ప్రశ్న పుడుతుంది. అందుచేత శిష్టజన వ్యవహారమంటే అవసరమైనచోట, ఔచిత్యాన్ని బట్టి, ఎన్నో కారణాలవల్ల వ్యాకరణాన్ని మీరినా పరవాలేదు అని మీరిందే కాని అపాండిత్యం వల్ల, అశక్తివల్ల వ్యాకరణాన్ని మీరింది కాదు. అందుచేత శిష్టజన వ్యవహార మనేది గిడుగు రామమూర్తి పంతులుగారినాడే పోయింది. తరువాత ఎవరి కిష్టులైనవారు వారికి శిష్టులవుతూ వచ్చారు. మాటలో మాత్రమే శిష్టజనవ్యవహారం మిగిలింది. నరే శిష్టజన వ్యవహారమో, ఇష్టజన వ్యవహారమో ఏదో ఒకటి. దానికి స్వచ్ఛందంగా వ్రాయటమే మూలసూత్రమైనపుడు, నియమరాహిత్యమే పరమ ప్రయోజనమైనప్పుడు, పాండిత్యంతో భాషాస్వభావ పరిశీలనంతో దానికి నిమిత్తం లేనప్పుడు, దానికి వ్యాకరణం కావాలి అనుకోవటంలో అర్థమేమిటి? నేనిప్పుడీ భాష వ్రాస్తున్నాను. నాకు మాట్లాడటం అలవాటైన భాషకు దగ్గరగా వ్రాస్తున్నాను. దీనికోసం నేను ఏ వ్యాకరణాన్నీ చదువ నక్కరలేదు. అట్లాకాదు. నాకు అలవాటులేని కృష్ణాజిల్లా బ్రాహ్మణ భాషకు దగ్గరగానే వ్రాస్తున్నాను. అప్పుడు మాత్రం వ్యాకరణం చదవటం ఎందుకు ? ఈభాషలో వ్రాసేవారంతా ఏ వ్యాకరణసూత్రాలను చదివి వ్రాస్తున్నారు ? ఆ పత్రికలు చదవటం వల్ల, ఆ భాష ప్రభావానికి లోబడి అట్లా వ్రాస్తున్నారు. అంతేకదా ? దీనికి మళ్లా ఒక వ్యాకరణం దేనికి? అనుశాసనం కాకపోతే వ్యాకరణంయొక్క ప్రయోజనం మరొకటి లేనేలేదు. భాష యొక్క స్వభావం నిరూపించడం ఆ స్వభావం యొక్క పరిచయం పాఠకునికి కలగజేయడమే అనుశాసనమంటే. భాషా స్వభావ పరిచయంవల్ల భాష యందు పాఠకునికి స్వాతంత్ర్యం కలుగుతుంది. అప్పుడు ఆ పాఠకుడు ఒక గ్రంథాన్ని చదువుకుంటే దాన్ని చక్కగా ఆస్వాదించగలుగుతాడు. ఏదైనా వ్రాస్తే భాష యొక్క ప్రాణం పట్టుకొని వ్రాయగలుగుతాడు. ఈ రెంకు ప్రయోజనాల దృష్ట్యా భాషా స్వభావాన్ని వ్యాకరించవలసిన అవసరం-దానిని పాటింపవలసిన అవసరం ఉన్నది. ఈ రెండు ప్రయోజనాలూలేని వ్యవహారభాషకు వ్యాకరణం కావాలనుకోవడం ఎందుకో అర్థంకాని విషయం.

ఆలోచించగా ఆలోచించగా దీనికల్లా ఒకటే కారణం కనిపిస్తున్నది. అది మనుష్య స్వభావంలో ఉన్న నియమ కాంక్ష. మనిషికిస్వభావసిద్ధంగానియమమందు వైముఖ్యంలేదు. నియమరహితంగా మనిషి జీవించలేడు. అయితే తత్పూర్వం ఉన్న నియమాలకు అతడు అశక్తుడవటంవల్లనో, ఇంకే ఇతర కారణం చేతనో కట్టుబడిఉండలేకపోవచ్చును. వాటినతడు మీరిపోవచ్చును. కాని తన అతిచారాన్ని కూడగట్టుకొనివచ్చే నియమంచేస్తే అతనికి తృప్తి కలుగుతుంది. అటువంటితృప్తి ఈ వ్యవహారభాషావాదులందరికీ కావలసివచ్చింది. తాము వాడిన అపశబ్దాలు, దుస్సంధులు, కృత్రిమవాక్యనిర్మాణాలు, విజాతీయ పదప్రయోగాలు మొదలైనవన్నీ శాస్త్రసమ్మతిని పొందాలి. అందుకోసం వారికి కొత్తవ్యాకరణం కావాలనే తహతహ. ఈ తృష్ణను తీర్చడం కంటె వ్యవహారభాషావ్యాకరణానికి ఇంకో ప్రయోజనం ఉండదు.

# కొన్ని సామెతలం గన్న చిన్నకథలు | "శండిల"

### "కానిపని జేసి గంప నెత్తి కెత్తుకోకు"

గురువుగారి ఆశ్రమంలో ఒక క్రొత్త శిష్యుడు చేరాడు. ఆశ్రమ నియమాలన్నింటిని అతనికి పరిచయంచేసి, ఒకదిక్కు చూపి అటువైపు పోవడానికెన్నడు ప్రయత్నించవద్దని హెచ్చరించారు గురువులు. విద్యపూర్తి కావస్తున్న సమయంలో అధ్యాపకులు ఒకప్పుడు గ్రామాంతరం వెడుతూ ఆతరిని గూడా శిష్యుని 'ఆ దిక్కుకుమాత్రం పోకుసుమా!' అని మళ్ళీ హెచ్చరించారు. కాని శిష్యునిలో ఎన్నాళ్ళనుండియో రగులుతున్న ఉత్సాహం ఈ చివరిచురకతో ఇనుమడించిందేగాని సన్నిగిల్లలేదు. 'చదువు ముగిస్తుందిగా! ఇప్పుడటు వెడితేమాత్రం ఏం ప్రమాదంలే' అనుకొని ఆ దిక్కునకే నడిచాడు. అక్కడ ఎంతకాలంనుండి కాపురం చేస్తున్నదో ఒక స్త్రీ బహుభర్తృసంపర్కజనితమైన కుచేల సంతానంతో ఉన్నది. ఆ బిడ్డలకు నిత్యమూ తమ తండ్రిని చూపమని ఆమెను వేధించుకు తినడమేపని. దానికామె విసిగిపోయి, ఏ సమాధానము పిల్లలకివ్వలేక, విధివశాత్తు ఎవడైనా పురుషు డవుపిస్తే వాడికి వాళ్లను అంటగడదామని బాధపడుతోంది. ఇంతలో ఈ శిష్యుడు తటస్థపడగానే "బ్రతుకుజీవుడా" అనుకొని "అదుగో మీ బాబు! వాణ్ణి పట్టుకొని పడ్వండి. ఇన్నాళ్ళూ తెగకాల్చుకు తిన్నారు వెధవల్లారా!" అన్నది. అమాంతంగా ఆ సంతతి శిష్యుని చుట్టుముట్టింది. ఇతగాడు వాళ్ళను వదలించుకోలేక నెత్తికెక్కించుకున్నాడు.

ఈ సామెతనే "*కూడనిపనిజేసి బండరాయిని మెడకు చుట్టుకోకు*" అనీ, "*మానుగొట్టి నెత్తికెత్తుకుంటావే*" అనిన్నీ గూడా అంటుంటారు.

### "గంటలవద్ద కొలువు అన్నిటినీ మించిపోయింది"

పూర్వకాలంలో ఒక ప్రభువు వారి కొలువులో ఒక నిరుపేద బ్రాహ్మణు డుండేవాడు. పిల్లలుగలవాడు-సంపాదన చాలక, "ఏదో తోచిన దక్షిణ" అంటూ ఆస్థానానికివచ్చిన ప్రతివాళ్ళను యాచించేవాడు. ఈ బెడద రాజుగారికి తెలిసి మంత్రిని రావించి, "వీడికి ఎవ్వరు కనిపించని తావులో నౌకరీ ఏర్పాటుచేయించు" అని ఆజ్ఞ యిచ్చాడు. మంత్రి బాగా యోచించి సముద్రపుటొడ్డున పడివుండి కెరటాలు లెక్కించమని హుకుం జారీచేశాడు బాపనికి. చాలారోజులదాకా వాడికి చేతికి తడి కాలేదు. ఎలాగా డబ్బు సంపాదించడం అని ఆలోచించడం, ప్రొద్దుపొడిచింది లగాయతు సంజవేళ వరకు అదేపని.

ఒకనాడు తీరం వెంబడి వెళుతున్న చేపల నావలు కొన్ని కనుపించాయి. విప్రునికో చక్కని ఊహ తట్టింది. "ఆపండి పడవలు. నా విధినిర్వహణకు ఆటంకం కలిగించారు మీరు. లెక్కపెట్టే కెరటాలకు అడ్డువస్తున్నారు" అని పల్లెలను గద్దించాడు. వాళ్ళు చేతులు నలుపుతూ ఆతన్ని ఆశ్రయించారు. తృణమో పణమో ముట్టజెప్పుకున్నారు. ఇంకేముందీ? మరునాటినుండి మళ్ళీ ఆర్జన పెరిగింది. ఈ ఘోష పల్లెవాళ్ళు ఏలికవద్ద ఏకరువు పెట్టారు. మంత్రిని మళ్ళీ పిలిచాడు రాజు. రాజూ, ప్రధాని ఇద్దరు బాగా ఆలోచించి, రెండుమూడు చోట్లకు మార్పించారు బ్రాహ్మణ్ణి. కాని మొదట్లో కొంచెం ఇబ్బందిపడ్డా, క్రమేపి ఎక్కడెక్కడ క్రొత్తగా నియమింపబడ్డా క్రితంపనివల్లకంటె దీనిలోనే హెచ్చు గుంజుకుంటున్నట్లు తేలింది రాజుకు. ఎలా

గైనా ఎర్రని ఏగాని వీని చేతికి చిక్కని చోట పడెయ్యాలని మంత్రి, రాజు నిశ్చయించుకొని తుదకు గంటలుకొట్టే పని వప్పగించారు. "వీడి అవసరం ఇంక భూమిలో ఎవడికీ ఉండ"దని స్థిరీకరించుకొని.

అప్పటికే వివిధ హోదాలలో వానికి అనుభవం గడించిపెట్టిన ఉపజ్ఞ ఏవిధంగాను, ఎంతమాత్రం గిట్టుబాటు కాదని ప్రభువుకు, ప్రధానికి తోపించిన ఆ వృత్తిలోనే ఏ మూలనో, ఏనిధో ఎందుకు దాగి వుండగూడదు? అనే జిజ్ఞాసతో అర్జనదెసకై పరిశోధనకు అతని మెదడులో యోచన తీవలు సాగించింది. ఏమీ తట్టలేదు. దైవం పైననే భారం వేసి దారిద్ర్యంతో రోజులు వెళ్లబుచ్చుతున్నాడు పెళ్లాం బిడ్డల్ని పెంచుకోలేక.

ఆ రాజుగారు ఇద్దరు పెళ్లాల మగడు. సవతుల మధ్య జగడం రాజుకుంటోంది. కాగా భూనాథుడు హామేషాగా తన చెంతనే వుండాలని పెద్దభార్య - కాదు నా దగ్గరే వుండాలని చిన్నభార్య పట్టుబట్టారు. తుదకు ప్రభువు తీర్పుచెప్పాడు—రేయిని సగభాగం పట్టమహిషి వద్దా, శేషించిన సమయం చిన్నభార్య దగ్గరా వుంటానని. మర్నాడు గంటలు కొట్టేవాడికి పెద్దభార్య వద్దనుంచి కబురువచ్చింది. సరిగా రాత్రి సగభాగం తెలిపే గంటను ఒకగంట ఆలస్యంగా కొట్టాలని ఆజ్ఞ. బ్రాహ్మడు మొగం తెలవేసి భయం అభినయించాడు. "నీకేం భయం లేదు, నేనున్నానుగా పో" మ్మంది మహారాణి. విప్రుడు వెళ్ళిపోయాడు. మరునాటి నుండి పెద్దభార్యగారి దాసి పళ్ళెంలో వరహాలతో బ్రాహ్మడింటికి ప్రయాణం ప్రారంభమయ్యింది. ఇతనికి మహారాణి లంచం ఇవ్వడంలో ఆంతర్యమేమిటి? అని చిన్నభార్య హావేళిలో చర్చజరిగింది. వెంటనే ఆవిడ కబురుపెట్టింది. గంటలుకొట్టే బాపనయ్య పాచికపారింది. ఎత్తు పిరాయించాడు. "ఆమె ఎక్కువ తిన్నదేమున్నదీ? నేనెందుకు తీసిపోవాలి. ఆమె యిచ్చే మొత్తానికి రెట్టింపుయిస్తాను. నియమిత సమయంకన్న ఒకగంట ముందే కొట్టెయ్యి. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు" ఆజ్ఞాపించింది చిన్నభార్య. "*తంతే బూరెలగంపలో బడ్డా*"డన్నట్లు మర్నాటి నుండి రెండు పళ్లాలు వస్తున్నాయి బ్రాహ్మడికి. గంటలు మటుకు మామూలుగానే మ్రోగుతున్నాయి. రాజపత్నులు మాత్రం తమ వద్ద కంటె తమవద్దనే ప్రభువువారు హెచ్చుకాలం ముచ్చటగా వుంటున్నారని అమితానందం పొందుతున్నారు. ఒకరికి తెలియకూడదని ఇంకొకరు రాణుల దాసీలు కానుకలపళ్లాలతో బ్రాహ్మణగృహానికి వెళ్ళుతూండడం ఒకవాడు రాజూ మంత్రీ గూడా చూడడం సంభవించింది. రాజు అన్నాడు మంత్రితో, "ప్రధానీ! ఈయత్నంలోగూడా మనదే ఓటమి. "*గంటల కాడ కొలువు అన్నిటినీ మించిపోయింది.*""

ఈ కథానికలో ప్రసక్తానుప్రసక్తంగా ప్రముఖమైన మూడు సామెతలు వస్తాయి. ఒకనికి ఇద్దరు మగబిడ్డలు, ఒక ఆడబిడ్డా పుట్టారు. చిన్నది కడసారికానుపు. వారి జాతకాలు వ్రాయించాడు తండ్రి. జ్యోతిష్కుడు మొదటికుమారుడు కేవలం వేటవల్లనే జీవిస్తాడనీ, రెండవవాడు వ్యవసాయదారుడనీ, మూడవ బిడ్డ (కుమార్తె) వ్యభిచారిణియైపోతుందనీ భవితవ్యం చెప్పాడు. ముగ్గురు పిల్లలకు ప్రాయం రాకుండానే తల్లిదండ్రులు గతించారు. వారి ముగ్గురిదీ తలకొక దారీ అయిపోయింది. సుమారు ఇరవయ్యేళ్ళు గడచిపోయాయి. వీరి జాతకం వ్రాసిన దైవజ్ఞునకు వీరు మువ్వురు ఎలా బ్రతుకుతున్నారో చూడ వేడుకబుట్టి, వాళ్లను వెదుక్కుంటూ బయలుదేరాడు. ఒక గ్రామంలో మంచినీటి చెరువుగట్టునవున్న ధర్మశాలలో కాపురం చేస్తున్న జ్యేష్ఠుడు కనుపించాడు - "ఏమిటీ కథ - నన్ను మరచిపోయావా నాయనా?" అని ప్రశ్నించాడు దైవజ్ఞుడు.

"కథకేముందీ—" *పిట్టనుగొట్టి పొయిలోపెట్టి*" ప్రొద్దస్తమానం ఇదేపని - వెథవబ్రతుకు. నీ చాటి

నీచంగా ఉండనుకోండి" అన్నాడు. ఉండేలు బద్దకు పినిమెడుతూ. ఆ పెద్దకొడుకు వేకువనే లేవడం తెల్లవారేదాకా ఉండలు నలుపుకోవడం, ప్రొద్దుపొడిచింది లగాయతు క్రుంకేవరకు బద్ద సారించి విసరగావిసరగావిసుగెత్తగా ఒకేఒక్కపిట్ట పడడం దాన్ని మాడ్చుకు తినడం, ప్రతిరోజూ ఇదే వరస. ఎదుగూ లేదు బొదుగూలేదు. గొల్లవాని కొమ్ముకువలె ఆ సంసారంలో ఆ వృత్తినే చిరరించు కుంటూ దాన్ని తెగించి వదల్లేక క్రొత్తదాన్ని చేపట్టలేక చిక్కుపడుతున్నాడు. జ్యోతిష్కుడు "బాబూ! మన పద్ధతిలో లోపముంది గాని వృత్తిలో యేదోషమూలేదు. కావాలంటే చూడు. రేపటి నుంచి నేచెప్పినట్లు చెయ్యి" అని ఒక సలహాయిచ్చి ఆ దినవృత్తిలోని రహస్యం ఎత్తిచూపించాడు.

మరునాడు దైవజ్ఞుని పోరుతో ఎక్కడనుంచో ఒక మేకపిల్లను సంపాదించి వారిద్దరూ గలసి ఆ మాపటివేళ దాపున ఉన్న అడవిలోకి వెళ్ళి మాటు ఒగ్గారు. మేకపిల్ల అరపువిని చిన్నచిన్న జంతువులు దరికి రావడం మొదలు పెట్టాయి. వేటగాడు కొట్టబోగా జోస్యుడుఅపుతూవచ్చాడు. రాత్రిదాటి పోతుంది, రోజు మారిపోతూన్న ముహూర్తంలో ఒక జాడీమెకం వచ్చింది మాటుదరికి. "వేసెయ్యి వేటు" అని వేటగాణ్ణి అదలించాడు జ్యోతిష్కుడు. అంతే, ఆ వొక్క ప్రేటుతో బెబ్బులి పడిపోయింది. వేటగాని ఆశ్చర్యాని కంతులేదు. తెల్లవారింది. పులిగోళ్ళు, పులితోలు వగైరాలు వాడికి చేతి నిండుగా సొమ్ముతెచ్చి పెట్టాయి. వాడిపేరు ఊరునిండా మారుమ్రోగింది. మళ్ళీ హెచ్చరించాడు జ్యోతిష్కుడు 'రోజూ ఇదే పనిచెయ్యి. నీవు వేటవల్లనే కుబేరుడ వౌతావు. ఒక్కటే గుర్తుంచుకో మాటుకు పులివస్తేనే వెయ్యిదెబ్బ. నీవు ఓపిక పడితే మెకం రాకతప్పదు." వేటగాడు పండితుణ్ణి సన్మానించి సాగనంపి నాటినుండి రోజు రోజుకూ గొప్పవాడయ్యాడు.

కొన్నాళ్ళు పోయాక పండితుడు సేద్యగానిని సమీపించి అన్నగారిని వేసినట్లే ప్రశ్నలు వేశాడు. "ఏముందండీ - పాడుబ్రతుకు, ఎన్ని దూడలను కొన్నా. ఎంత కొంగ్రొదున్నినా నా పని 'ఒంటెద్దు ముడికట్టు' గానే వుంది" అని తన్నుతానే నిందించు కున్నాడు. "తప్పు నాయనా నీ పనిలో దోషంలేదు. బాగా వెదుక్కుంటే దానిలో వుంటుంది లబ్ధి. "పడినచోటనే వెదక్కోవాలి" అని ఊరడించాడు దైవజ్ఞుడు. ఏటేటా ఎన్ని ఎడ్లనుకొని అరకలు గట్టినా, కడకు ఒకటే ఎద్దు మిగులుతుండడం, ఎన్ని కట్టలు పండించినా, ఇంటికొచ్చేసరికి ఒక కట్టగింజలే వుంటుండడం చూశాడు. వ్యవసాయదారుని భార్యను పిలచి "అమ్మాయీ! మేము సంతకు వెళ్లి వస్తాం, మూలనున్న ముడికట్ట గింజలన్నిటిని నలిపి వడ్లు దంచి కూడు వండివుంచు" అని ఆజ్ఞయిచ్చి. అతని వేగిరపెట్టి ఉన్నఒక్క యెద్దును తగిన వెలకు అమ్మించేశాడు పండితుడు. సంత నుంచి యింటి కొచ్చేశారు హాయిగా తిండితిని రాత్రి డబ్బుసంచి రొంటిని పెట్టుకొని పడుకున్నాడు రైతు. తెల్ల వారింది. లేచిచూసేసరికి దొడ్లోకట్రాటను ఒంటెద్దు, నడవలో మూలన ముడికట్ట సిద్ధం. "ఇదేమిటండీ ?" ప్రశ్నించాడు పండితుణ్ణి. "అదే చిదంబరరహస్యం. తువ్వాలు బుజాన వేసుకో- సంతకుబోయి దాన్ని అమ్మేసిరా. నీవు తిరిగి వచ్చేసరికి ఆ కట్ట నలిపి అన్నం వండేస్తుంది ఇల్లాలు. పడినంత మీ రిద్దరు తినండి- మిగిలినది నలుగురకు పెట్టండి. అంతేగాని వృత్తిని తిట్టుకుంటూ వేం పాపం!"అని జవాబిచ్చాడు. "మరి రేపో" అడిగాడు రైతు. "అయ్యో! మళ్లీ రేపంటూ వేం- రోజూ నీ పని సంతకెళ్ళి ఎద్దునమ్ముకు రావడం, ఆవిడ పని వండి తాను తిని, పదిమందికి పెట్టడం. నీ దరిద్రం పోయిందిపో"అన్నాడు త్రికాల జ్ఞుడు. అంతే- మరునాటి నుండి రైతు ప్రజకు తిండిబెడుతూ సంసారరాజుఅనిపించుకుంటున్నాడు.

ఇంక ఆ పడుచు ఎలా గడుపుతోందో జీవితం అని చూడబోతే- తెగమాసి గవులుకంపుకొడుతున్న

గుడ్డలు : తైలసంస్కారంలేక పేలతో చీడబట్టిన తల- అనాకు బేడకూ గూడ కొరగాని పడుపుదనం- తన్ను తాను ఏవగించుకుంటూ, బ్రతుకును తూల నాడుకుంటూ సమాజంలో ఉచ్ఛిష్టంలాగు అగు పించింది. గ్రుచ్చిగ్రుచ్చి అడిగినా ఆమె అన్నగార లిద్దరికంటె గూడా తన జీవితాన్ని నిందిస్తూ జవా బిచ్చింది. "ఇదిగాదు వ్యాపారం జరిపే తీరు నే చెప్తా నుండు" అని జ్యోతిష్కుడు తన ప్రయాసపై ఆమెకు అభ్యంగన స్నానం చేయించి, నూతన వస్త్రా లిచ్చి మకాం మార్పించాడు.

మరునాడు వేశ్యావాటికలో ఒక నూతన సౌధంలో ఏదేశంనుండియో అందాలదీవి ఒకతె వచ్చి విడిది తీర్చిందనీ, రేయికి మాానెడు వరహా లివ్వగలవాడే దాన్ని చూడగలడనీ ప్రచారం సాగింది. అయితే ఆమెనుగురించి ఎరిగిఉన్న వాళ్ల మాటెలాగున్నా మానెడువరహా లనేసరికి ఎవడు ముందుకు రాగలడు? రాత్రి దాటిపోతోంది— కోడికూతజామున వీధి యరుగుమీద నవ్వుకుంటూ కూర్చున్న దైవజ్ఞునకు జోలెనిండుగా వరహాలు పట్టుకువస్తున్న ముసలిబ్రాహ్మణుడు కనుపించాడు. "బ్రహ్మగారూ! తాము చూడబోతే పెద్దలు; బోసినోటివారు. ఈవయసులో ఈ వాటికను చూపు అనక దారితప్పిగాని రావడంలేదుగదా!" హేళన చేశాడు పండితుడు. పండుముసలి ప్రత్యుత్తర మిచ్చాడు. "*నుదుటివ్రాత నూరేళ్లకైనా తప్పదు. పంచేస్తాను— చేసుకున్నందుకు చెరికాస్తా చెల్లెలా* అన్నట్లు ఎవడు ఈ కిమ్మతునిచ్చి యీ గృహానికి రాకపోతే నేనే రావలసివచ్చింది" "అయితే నడు రేయిని అడవిలోకి పులినిపంపి, వేకువన ఒంటెద్దును ముడికట్టను నిలిపి, జోలెడు వరహాలు మోసుకు వచ్చేది మీరేనన్నమాట" మళ్ళీ చెప్పాడు జ్యోతి ష్కుడు. నవ్వాడు బ్రహ్మ.

ఈ చిన్న కథ చెప్పే నీతి—"నాయనా! వృత్తి నెన్నడు తెగనాడకు. ఓరిమిపరుడవై యోచించు కుంటే నీ జీవనవ్యాపారంలోనే నీ సర్వసంపదలు నిహితమైవున్నాయి. ఇందలి మర్మాన్ని ఛేదించలేక ఇబ్బందులు పడుతున్నావంటే ఆ దోషం నీదేగాని వృత్తిధర్మాని దెంతమాత్రంకాదు"అనేది. సృష్టిలో నియోగింపబడ్డ ప్రతి వ్యాపారములోను గూడ సర్వశ్రేయస్సును ఆ సృష్టికర్తయే నిక్షేపించు కున్నాడు. దాన్ని గుర్తెరుంగలేక మనం నిత్యమూ మనమన పనుల్ని తిట్టుకుంటూ దీనికన్న మరే ఇతర వృత్తియైనా మంచిదే అని ప్రతి వృత్తి నవలంబించేవారూ తమ్ముతాము గర్హించుకోవడం ఉచితం గాదు.

"ఉంద వెయ్యి ఉందన్నర వెయ్యి
నేను తలదగ్గరే గాని కాళ్ళదగ్గర పట్టుకోను"

ఒక వైద్యుడు, ఆయనతో ఒక శిష్యుడు బయలు దేరారు. ఒక వూళ్ళో మందిచ్చారు ఛేదుల కొక ఆసామికి. తెంపులేకుండా భేదులై ప్రాణాలు తీసే శాయి. చుట్టుప్రక్కలవాళ్ళు వీళ్లిద్దరినీ సాయం పట్టమన్నారు శ్మశానానికి శవాన్ని. శిష్యుడు కాళ్ల వైపు, గురువు శిరసువైపు పట్టుకు ప్రేతాన్ని వల్ల కాటికితీసుకుపోతున్నారు. ప్రాణాలైనాపోయాయి గాని భేదులు పోలేదు. సరిగా శ్మశానం చేరుకునే సరికి శిష్యుడు పూర్తిగా తడిసిపోయాడు. బ్రతికాం బాబూ అనుకొని మరొక ఊరికి పలాయనం చిత్తగించారు. వీళ్ళ దురదృష్టంవల్ల ఆ వూళ్లో గూడా ఒకరికి భేదిమందునే ఇవ్వవలసివచ్చింది. ఈ తూరి గురువు శిష్యుని సలహా అడిగాడు "ఒరే అక్కడ ఉందవేశాను అలాగైంది. ఇక్కడెంత మోతాదుఇద్దామూ" అని. వెంటనే శిష్యుడన్నాడు "ఉంద వెయ్యి, ఉందన్నర వెయ్యి నేను తలదగ్గిరే గాని కాళ్ళవైపు పట్టుకో" నని. ఒక్కొక వ్యవహా రంలో లాభం మాట అటుంచి నష్టాన్ని మాత్రం తానెంతమాత్రం భరించనని తప్పుకొనజూచే నైజాన్ని ఈ సామెత చిత్రిస్తుంది.

"అప్పటి కంతే తోచింది"

ఒక రాజు, మంత్రి వేటకు వెళ్ళారు. తిరిగి

పురానికి రావడం తడవయ్యింది. రాజుగారి భార్య ప్రాయంలో ఉన్న చిన్నదానికి ఎన్నాళ్ళనుండి మంత్రికుమారుని పై మనస్సున్నదో, కబురంపింది. ఏమీ యెరుగని ఆ యువకుడు రాణిగారి కోరిక తెలుసుకుని గడగడలాడాడు. అయితే ఆమె అతన్ని వదలేలాగ లేదు. తుదకొక ఉపాయం తట్టి "నాకు మగతనంలేదు" అన్నాడు. ఏవగించుకొని అవలికి పొమ్మంది రాణి.

తరువాత రాజు, మంత్రి మగిడివచ్చారు. కొంత కాలానికి మంత్రి కుమారునికి పుత్రుడుదయించడం, తదానందసూచకంగా వేడుకలు జరపబడడం సంభవించింది. "ఏమిటీ సంబరం?" రాణి రాజును ప్రశ్నించింది. "మన మంత్రిగారికి మనుమడు కలిగాడు. పండుగ చేసుకొంటున్నారు. మనమూ ఏదో కానుకనంపాలి" అన్నాడు ప్రభువు. "ఏమి చేమిటీ? మీకుగానా మతిలేదా? నపుంసకునికి కొడుకు పుట్టడం ఎక్కడేనా వుందా?" ఆశ్చర్యాన్ని ప్రకటించింది రాణి. తక్షణమే మంత్రి పుత్రునికి రాజుగారినుండి పిలుపు వచ్చింది. అతడు వినమితాంగుడై ప్రభువుముందు భయంతో నిలచాడు. రాజు అతన్ని పరకాయించి "నిజమేనా?" అని గర్జించాడు. "ప్రభూ! ఏం చెయ్యనూ— అప్పటికంతే తోచింది" అన్నాడు మంత్రికుమారుడు. త్రుటిలో రాజు జరిగినదంతా గ్రహించగలిగాడు. మారుమాట లేకపోయిన పలికవద్దనుండి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు మంత్రిపుత్రుడు. దీన్నే "నీకు నపుంసకుడు గాని వాని భార్యకు నపుంసకుడా?" అనికూడా అనడంకద్దు.

## "చేనైతే బాగానేఅయింది గాని చేతికిరావద్దూ"

రైతు నువ్వుచేను పెట్టాడు. చేను తెగపండింది. జెడకాపు క్రింద గెలవేసింది. గట్టుమీద కూర్చుని ఫలసాయం అంచనా వేసుకుంటున్నాడు. ఆ దారినే వెళుతున్న బ్రాహ్మడొకడు విరగబండి పడిపోయిన చేనును జూచి "చేనైతే బాగానే అయింది గాని చేతికి రావద్దూ" అని సాగిపోతుంటే ఆ రైతు ఆపి "ఏం అలాగంటున్నారు?" అని అడిగాడు. "ఏమో నాయనా! నాకలా తోచింది" అన్నాడు బ్రాహ్మడు. "పిచ్చి బాపడా!" అని నవ్వుకున్నాడు కాపు. చేను "నువ్వు చేనుకు నూరుతెగుళ్ళు" అన్న లోకోక్తిని దాటి చక్కగాఫలితానికివచ్చింది. నేడో రేపో కోసి, వొగ్గి పదిరోజుల్లో గింజలన్నీ శుభ్రంగా ప్రోగుచేసుకోవచ్చు.

చేను సక్రమంగానే ఇంటికి వచ్చింది. "ఇంకేం జరుగుతుంది?" అనుకొన్నాడు రైతు. గింజ బేరం ఇచ్చేశారు. ధర గూడా బాగానే పలికింది. కొన్న షావుకారు దినుసు తమ వూరికి చేరవేసి పైకం పట్టుకుపొమ్మన్నాడు. బండ్లమీదకెత్తి రైతు పంపించాడు నువ్వులు. షావుకారు వూరికి రైతు వూరికి మధ్య యేరుఅడ్డు. బళ్ళు ఏరును దాటుతున్నాయి. సరిగా సగందూరం వెళ్లేసరికి పెద్దఎత్తున ఏరువచ్చి వాలింది. బళ్ళదారి బళ్ళదీ, ఎడ్లదారి ఎడ్లదీ, పాలేళ్ళ దారి పాలేళ్ళదీ, నువ్వుల దారి నీళ్ళదీ అయింది. వ్యవసాయ సామెత అయిన దీన్నే "చేనులో పంట ఏటి అవతలిమనిషి ఇంటికిరావాలి" అని గూడా అంటారు.

మాచిరాజు దేవీప్రసాద్

# తగ్గింపు ధరల అమ్మకం

తగ్గింపు ధరల అమ్మకం అనే మూడు ముక్కల మాట మూడు ముక్కల ఆటలాగా అతిచంచల మైంది. ఈ మూడు ముక్కల్ని భిన్నాకృతుల్లో పేరిస్తే ఉత్పన్న మయ్యే మిశ్రమాలు ఇవి.

1. తగ్గింపు ధరల అమ్మకం
2. తగ్గింపు అమ్మకం ధరలు
3. ధరల తగ్గింపు అమ్మకం
4. ధరల అమ్మకం తగ్గింపు
5. అమ్మకం ధరల తగ్గింపు
6. అమ్మకం తగ్గింపు ధరలు.

తెనుగు భాషలో ఏ మూడు ముక్కల మాటా, ఏ భాగాని కా భాగం ఇలా విడగొట్టి తిరిగి సార్థకంగా పొదగడానికి వీలులేదు. ఏకైక మూలంలోంచి జన్మించిన ఈ షడ్రూపాలను విడి విడిగా విలోకిస్తే తగ్గింపు ధరల అమ్మకం అనే మాట అన్ని కోణాల్నుంచీ చూడబడి, మన చర్చ సమగ్రమవుతుంది... మన న్యాయాలలో 'స్థాలీ పులాక' న్యాయం ఒకటి. ఈ న్యాయం ప్రయో గించి ఒకటోనెంబరు రూపం మాత్రమే ఇప్పుడు చర్చిస్తే, ఇతర రూపాలకి అన్యాయం జరగదు.

ఈ ఒకటో నెంబరు రూపం 'తగ్గింపు ధరల అమ్మకం'. దీనికి ఆయువుపట్టు 'ధర' అనే ముక్క, అనగా తక్కిన రెండుముక్కలకీ 'ధర' కేంద్రం. ఈ 'ధర' చుట్టూ 'తగ్గింపు' 'అమ్మకం' అనేవి రెండూ సూర్య చంద్రుల్లాగా పర్యటిస్తాయి. ఈ మాటయొక్క జననం 'ధర' అనేదాని జననంతో ఆరంభం. ధరకు డబ్బు పర్యాయపదం గనుక, తగ్గింపు ధర అమ్మకాన్ని తగ్గింపు డబ్బు అమ్మకం అనొచ్చు. మనం షాపులో ఉన్న ఏదైనా వస్తువుని (అంటే చిన్నసూది, గొడుగు, రోకలి, రుబ్బురోలు, పట్టెమంచం, పెద్ద ఏనుగు లాంటివి కావొచ్చు.) షాపువారి స్వాధీనంనుంచి తప్పించి, మన స్వంతం చేసుకోవాలి అంటే ఈ డబ్బు అనే పదార్థం, మన నుంచి విడివడి వారి స్వాధీనంకావాలి. అప్పుడు అమ్మకం జరిగింది అన్నమాట. ఈ మనం వదిలించు కొన్న డబ్బు ప్రమాణం దాని ధర అవుతుంది. ఈ డబ్బు ప్రమాణం తగ్గితే తగ్గింపు ధర అవుతుంది. ఎప్పుడు మనవద్దనుంచి డబ్బు విడివడ్డదో, అప్పుడు అమ్మకం అవుతుందిగనుక, ఈ విడివడ్డ డబ్బు ప్రమాణం తగ్గించి విడివడితే, తగ్గింపు ధరల అమ్మకం అవుతుంది. అంటే, తగ్గింపు ధర అమ్మకం పర్యవసానం ఏమిటీ అంటే :—

1. డబ్బు మనవద్దనుంచి విముక్తి పొందటం.
2. ఈ విముక్తి పొందిన డబ్బు ప్రమాణం, మామూలు ప్రమాణంకన్న తక్కువ అవటం.

ఇది ఏలా జరుగుతున్నది. ఏ ఏ పరిస్థితులు దీనికి అనుకూలాలు అన్నది ఇహ తాపత్రయపడవలసిన విషయాలు.

దీన్ని జరిగించడానికి అనేక వాహకాలు ఉన్నవి. అవి పత్రికల్లో వేయటం, బోర్డుమీద వ్రాయటం, కరపత్రాలు గుప్పటం, వ్యాపారభాగే రేడియోల్లో చెప్పటంలాంటివి.

ముందు పత్రికా ప్రకటనలు ఎలాంటివో తెలు సుకుందాం. ఒకరకంవాళ్ళు, 'త్వరపడండి! త్వర పడండి! త్వరపడండి!' అని పెద్దఅక్షరాల్లో మకుటం పెట్టి, మన కళ్ళను వాటివైపు మళ్ళిస్తారు. ఈ మకుటంకింద అంతే సైజు అక్షరాలతోగాని, లేక ఒక దారం వరస చిన్నవాటితోగాని 'అలసించిన

ఆశాభంగం' అని త్రివర్ణంలో ఉండొచ్చు. ఉట్టి పుణ్యానికి ఆశాభంగం ఎందుకు పొందాలని, దాని ప్రక్క వార్తల్లో ఉన్న ప్రపంచ కష్ట సుఖాలు యావత్తూ విసర్జించి, తదేకదృష్టులమౌతాం మనం. ఈ దృష్టి దాన్ని మించి తప్పించుకపోకుండా, చుట్టూ ఉన్న 'బార్డరు' అడ్డుతుంది. అలా మన దృష్టిని పరిగ్రహించి, ఇక ముందుకు తీసుకుపోతారు. తరువాత దానిక్రింద సాహిత్యం మనల్ని చూరగొంటుంది. "గొప్ప అవకాశం. మా వద్ద ఇప్పుడే జర్మనీ నుంచి దిగుమతి అయిన ఒకటోరకం రేడియోలు, అన్ని స్టేషన్‌లూ నిశ్శబ్దంగా (నిశ్శబ్దంగా వినపడటమంటే ఇతర శబ్దాలేవీ లేకుండా అన్నమాట.) మూడు బాండ్లు, నాలుగు 'బుడిపెలు', ఐదు కొయ్యలుగల సూపర్ హేట్ రేడియోలు' అమ్మకమునకు సిద్ధంగా ఉన్నవి. అతిచౌక, నూటికి పదివంతులు తగ్గింపు. పదిరోజులుమాత్రమే, స్టాకు బహుకొద్ది కనుక, ఆలసించిన ఆశాభంగం. నేడే వివరాలకు వ్రాయండి. ఫలానా కంపెని. ఫలానా పోష్టుబాక్సు. ఫలానా నగరం" అని క్రింద ఉంటుంది. ఇలాంటి వాటిల్లో నూటికి పదివంతులు ధర తగ్గినట్టుంటుంది. కాని అసలు ధర ఉండదు. అంటే దేనిమీద తగ్గింపో, మునుపు ఎంత ఉందో, ఇప్పుడు ఎంత అవుతుందో అర్థంకాదు. ఇల్లాంటి వాటిల్లోని తగ్గింపు ధర ఏమిటిఅంటే, బాగా ఎక్కించిన ధరమీద కొంత తగ్గింపు అన్నమాట.

ఈ రకంలోకే వస్తయి, గడియారాలూ, హేర్‌టానిక్కులూ, ప్లాస్టిక్ ఆట వస్తువులు. లూథియానా సిల్కు చీరలు, వగైరా దినుసులకు సంబంధించిన ప్రకటనలు.

ఇక కొన్నిరకాలవాళ్ళు పత్రికల్లో పెద్ద అక్షరాలతో ఒక పెద్ద అంకెవేసి దాని శిల వేస్తారు. అంటే ఒక పెద్ద 'ఇంటూ' (×) మార్కు పెట్టి కొట్టేస్తారు. దానికింద ఆ శిలువేసిన అంకెకంటే బుల్లి అంకె ఒకటి ఉంటుంది. వీళ్ళ తాత్పర్యం ఏమి అంటే వాళ్ళ కంపెనీ కారు, ఏదో ఒకప్పుడు శిలవేసిన పెద్దంకె ధరతో ఉండేదనిన్నీ, దాన్ని ఇప్పుడు క్రింద వేసిన బుల్లి అంకె ధరకు తగ్గించామని మునుపు కారు ధర పదివేలు. ఇప్పుడు ఐదు వేలు. అంటే వాళ్ల ఉద్దేశ్యంలో తగ్గించామని. అది నిజం కాదు. మునువు కారు ఒకటికి పదివేలు అయినప్పుడు ఐదు వేలకి ఒక అరకారు మాత్రమే వచ్చేది. ఇప్పుడు ఆ ఐదువేలకి ఒక పూర్తికారు వస్తుంది. కనుక కారు ధర తగ్గలేదు. రూపాయి ధర పెరిగిందన్నమాట. అందుచేత ఈ పెరిగిన రూపాయిని, మనవద్దనుంచి తగ్గింపు ధరల అమ్మకం అనే లేబిల్‌తో కాజేయటం ఈ ప్రకటన పర్యవసానం.

పత్రికా ప్రకటనల్లో ఈ మధ్యన ప్రాముఖ్యం చూపించేవి విమాన ట్యూరిస్టు సర్వీసులు. మనం భవిష్యత్కాలంలో ఏ ప్రయాణం తలపెట్టుకోకపోయినా, ఈ విమానాలవాళ్ళు ఊరుకోనియ్యరు. కలకత్తానించి నేడే బయలుదేరండి. మా కంపెనీ విమానంలో మీరు సురక్షితంగా గమ్యం చేరుతారు. కాలాన్నీ, పైకాన్నీ, మిగల్చండి, అని మనవెంట బడుతారు. వీళ్ళు మనని టోక్యోకి వెళ్ళి 577/- మిగుల్చుకోమంటున్నారు. మంచిదే కాని ఇప్పుడు ఛార్జికి మనం ఖర్చుపెట్టవలసింది 3266/-, అంటే మనం 577/- దాచుకోవాలి అంటే 3266/- మాత్రమే ఖర్చుచేయాలి అన్నమాట. ఖర్చు అయితే అయింది. ఇందులో కొంతమందికి ఓ సందేహం ఉంటుంది. మనం మిగుల్చుకునే సంఖ్య 577 లాంటి బేసిసంఖ్య అవటం దేనికి? అది 577 కు బదులు 570 లాంటి సరిసంఖ్య అయినా బాగుండేది. లేక 580 అయినా ఫరవాలేదు. సరసంగా ఉంటుంది అంటారు. ఇది ఖచ్చితంగా 577 మటుకే అవటం ఎందుకంటే ఇటువంటి విషమ సంఖ్యలు మనస్సుని ఆశ్చర్యంతో ఆవరించి, హృదయానికి హత్తుకొనే గుణాన్వితాలని ప్రకటనకర్తల అభిప్రాయంగనక ఇందులో మనకు మిగిలేది విషమ సంఖ్య అయితే అయింది. విమాన ప్రయాణమే హాయి. ఒకవేళ

ప్రయాణం జరిగినా హాయిగానే ఉంటుంది. కారణం జరిగేటంతవరకూ బ్రతికేఉంటాముగనుక, దిగులు లేదు. జరిగింతరువాత ఏమయిందో తెలియదు గనుక అంతకంటే దిగుల్లేదు. అందుచేత.

ఇక బోర్డుమీద ప్రకటనలు. ఈ బోర్డుమీద ప్రకటనలు కొన్ని తెల్లని, ఎర్రని, పచ్చని సుద్ద ముక్కలతో నల్లని బోర్డుమీద వ్రాయబడ్డవి. కొన్ని ఎక్కడో అచ్చయిన, చిత్రాంకితమైన పేపర్లు అంటించి షాపు బయట 30 డిగ్రీలలో ఏటవాలుగా పెట్టినవి. ఇది ముఖ్యంగా జోళ్ల షాపుల్ని, బట్టల దుకాణాల్ని అలంకరిస్తాయి. ఈ రెంటిలో జోళ్ల షాపులు వాళ్లని గూర్చి చెప్పవలసింది మెండు. వీళ్లమీద మనం ఎంతైనా దయ చూపించాలి. వాళ్ల జీవనం మన కాళ్లవద్ద కనుక. వాళ్లు మన కాళ్లను జాగ్రత్త చేయాలని ఎంతో బాధపడతారు. అంటే మన కాళ్లు వాళ్లని బాధపెడతాయన్నమాట.

ఈ మధ్య వీళ్లు ధరలు తగ్గించేయజ్ఞం జరిపారు. వాళ్లు ఎర్రని నీళ్లమీద ఒక పెద్ద రాయి పడి అన్ని పైపులకి చిందే బొమ్మ వేస్తారు. దానిమీద తాటికాయల్లాంటి అక్షరాలతో Smashed అని వేయటం కద్దు. ఏమిట్రా యీ Smash అని మనదృక్ Smash అయి బోర్డున మగ్నుల మవుతాము. దానిక్రింద ధరలు తగ్గింపు అని వుంటుంది. ఈ బోర్డులు ఏదో ఒక రోజున హఠాత్తుగా షాపు ముందర అవతరించి, ఆదివారంనాడు వాన వచ్చినప్పుడు మటుకు కనపడకుండా దోబూచులాడుతూ ఏదోఒక రోజున మళ్లీ హఠాత్తుగానే మాయమవుతాయి. అది వేసినప్పుడు అచంచలులైన మీరు, మాయం కాగానే 'ధరలు యథా ప్రకారం పైకి లేచిపోయినయ్, ఏంటి చెప్మా' అని భయ కంపితులై విచారిస్తే అటువంటి ప్రమాదం ఏమీ ఉండదు. అవి తగ్గింపు ధరల బోర్డు ఉన్నప్పుడు ఎంత ఉన్నయ్యో, తీసేసింతర్వాత కూడా అంతే ఉంటయి. కారణం అది ఉన్నప్పుడు ఎంతో పెట్టకముందుకూడా అంతే గనుక. అంటే బోర్డు వేయకముందు, వేసినప్పుడు, తీసేసింతర్వాత, ధరలుమాత్రం సమగీతలాగా, ఒకటే, అంటే తగ్గింపు మాత్రం బోర్డుమీదనే అన్నమాట.

ఇక గుడ్డల షాపులముందు బోర్డుల సంగతి. వీళ్లకి కొంత ఋతు జ్ఞానం ఉన్నట్టు కనిపిస్తుంది. కొంతమంది 'వసంతకాలం తగ్గింపు ధరలు' అని బోర్డు వేస్తారు. దీన్ని చూచి మనం కొనకపోయినా 'ఓహో! వసంత కాలం వచ్చింది గదా!' అని విస్తుబోతాము. ఒకవేళ సర్వత్రా రాకపోయినా, యీ షాపు ముందు వచ్చిందనే నమ్మకం కలిగి హృదయం ఉయ్యాల రెక్కలాగా తేలిపోతుంది.

ఇంక కరపత్రాల విషయం. ఇందాకట్నుంచీ మనం అనుకొంటున్న పత్రికల్లో రాయటం, బోర్డు లేయటం అనే సాధనాలు కళ్ళద్వారానే తలకెక్కుతాయి. కాని ఈ కరపత్రాలు మేళాల సమ్మేళనతో వస్తయి గనుక. కళ్లూ చెవుల ద్వారా కూడ తలబడుతాయి. వాటికి సెంటు ఇంకా పూయటంలేదు కాబట్టి సరిపోయింది. లేకుంటే ముక్కుద్వారాకూడా ఘూటెక్కి ఉండేది. వీటి సదుపాయం ఏమిటంటే, మన ప్రయత్నం సమీ లేకుండా తగ్గింపు ధరలు మన కరతలామలకం అవుతాయి. ఈ సదుపాయం, కొనటమనే ప్రయత్న పూర్వకంగల వార్తా పత్రికల్లో లేదు.

ఇక రేడియో ప్రకటనల్లో ఇంకో సదుపాయం ఉంది. పైవాటన్నిటికీ కళ్ళు ఉంటే గాని పని నడవదు. ఇందులో కళ్ళు వుండితీరాలనే బాధలేదు ఇది కేవలం చెవుల ద్వారానే అవగతమయ్యే శ్రవ్యసాధనం. పై పెచ్చు. చెప్పేది కలస్వనంగల లలనామణి గనుక, వాటిమీద మన హృదయం తీగలు సాగి ధరల్లో మెలిక పడుతుంది.

ఈ తగ్గింపుధరలు ప్రాముఖ్యంగా కనబడేచోటు ఇంకొటి ఉంది. అది మార్నింగ్ షో సినిమాలు. ఒక్కొక్కసారి యీ తగ్గింపు ధరలు పరిమితం "బాలురకు, రక్షణశాఖ సిపాయిలకు అర్ధఛార్జి"

అని ఉంటుంది. అంటే సినిమావాళ్ళ దృక్పథంలో పిల్లలు, సిపాయిలు సమానమన్నమాట. అంటే సిపాయిలను అర్భకుల్లాగా చూపటం జరుగుతుందన్నమాట.

ఈ వాహకాలేవీ కాకుండా తగ్గింపు ధరల్ని మన అందుబాటులోకి తెచ్చే పరికరం ప్రత్యేకమయింది యింకోటి ఉంది. అది వేలంపాట. ఈ వేలం పాట; లాలిపాటకు, గోలపాటకు మధ్య రకం అయిన ఒకానొక గాన విశేషం. గానం నాదం గన్క, నాదబ్రహ్మం నాడులన్నిటినీ స్పందిస్తుంది. దాంతోపాటు వెళ్లి ఈ తగ్గింపుధరల నినాదం నాడుల్లో నాటుకొంటుంది. ఇదే దీని ప్రత్యేకత.

ఇక తగ్గింపుధరల జోలికి పోనివి కొన్నివున్నాయి. అవి ముఖ్యంగా బియ్యం కొట్లు, మంగలిషాపులు, రైలు టిక్కెట్లు, వీళ్ళు నిగూఢలు. పెరిగినా చెప్పరు. తగ్గినా చెప్పరు. కారణం ఏమిటంటే వాళ్ల వ్యాపారం నిత్యావసరం కావడం మూలాన్న ఒడుదొడుకుల్లేనిది, ఇదే కాకుండా ఇందులో మంగలి షాపువాళ్ళు తగ్గింపు ధరల బోర్డు వేయక పోవడానికి ఒక పూర్వ గాథవుంది. ఒకానొకప్పుడొక పండ్ల దుకాణం పక్కన ఒక ప్రఖ్యాత మంగలిషాపు ఉండేదిట. ఒకప్పుడు పళ్ల దుకాణంవాడు 1/ కి డజను పళ్ళు అని బోర్డు వేశాడుట. ప్రక్కన మంగలి షాపువాడు -/2/- కి గడ్డం అని పోటీకి తాను గూడా బోర్డు వేసాడుట. ఒక నెల అయిం తరువాత ధరలు తగ్గి పళ్ల దుకాణంవాడు 1/ కి రెండు డజన్లు అన్నాడుట. పోటీకొద్ది మంగలిషాపువాడు కూడా -/2/- కి రెండు గడ్డాలు అని బోర్డు వేయగా, తండ్రీకొడుకులు, మామలల్లుండ్రు, బావమరుదులూ, అన్నదమ్ములూ జోళ్ళు జోళ్ళుగా వచ్చి, చేయించుకు పోతున్నారట. ఇంకో నెలకి ధరలు తారుమారయి పళ్ళ దుకాణంవాడు 1/- కి డజన్నర పండ్లని బోర్డు మార్చాడుట. వెంటనే మంగలి కూడా పంతం కొద్దీ, -/2/- కి గడ్డంనర అని బోర్డు మార్చగా లెక్కలూ, గడ్డాలూ సరిగ్గా తెగి కుదరక, షాపు పోషకులు అద్దాలు పగిలేటట్లు రాళ్లు రువ్వి, వాడు ఒక ఎకౌంటెంట్ జనరల్‌ని పెడతానన్నా కూడా వదలక వాడిజుట్టు లంకించుకొని, గందరగోళం చేసారుట. అప్పటినించి, ఇప్పటి వరకు వంశపారంపర్యంగా ఈ తగ్గింపుధరలబోర్డులు మంగలిషాపులకు అచ్చిరావటంలేదని తెలుస్తుంది. వీటి తర్వాత తగ్గింపు ధరలు కాని తగ్గింపు ధరలు కొన్ని ఉన్నాయి. అవి సిగరెట్ పెట్టెలు, బీడీకట్టల్లో టిక్కెట్లు, టీ డబ్బాలలో కూపన్లు, సబ్బుబిళ్ళల రేపర్లు వగైరాలు వీటిలో సద్యఃఫలంలేదు. వీట్ని ఒక కొన్ని పోగుచేసి, ఏదో ఒక వస్తువు మనం సంపాదించుకోవచ్చు. ఆ వస్తువు వూరికినే వస్తుంది. కనుక, దాని ఖరీదు మనకు పూర్తి తగ్గింపుధర అవుతుంది. ఇది మన పూర్వీకులు స్థాపించిన కొసరులాంటిది. కానీ ఇది నాగరికంగా పోస్టుద్వారా వచ్చే కొసరు.

ఒకసారి ఒక ఖాళీ జంతువుల వ్యాపారి యిలా ప్రకటించాడు. ఒక తిమింగిలం వెయ్యి రూపాయిలు. రెండు తిమింగిలాలు ఒకేసారి కొన్నవారికి, ప్యాకింగు ఉచితం. మూడు కొన్నవారికి ప్యాకింగు పోస్టేజి కూడా ఉచితం. ఇక ఒకేసారి ఒక గ్రోసు కొనేవారికి, రెండు తిమింగిలాలు, పై పెచ్చు ఒక ఏనుగు బహుమతి అని. ఇందులో కూడ నిగూఢమైన ఒకరకపు తగ్గింపుధర లేక పోలేదు.

ఇన్నిన్నిరకాలుగా మనకి తగ్గింపు ధరలు చూపెడుతున్నా, అమ్మేవాడు లాభంలేకుండా అమ్మడు. అదిలేని రోజున వాడు లేడు. కనుక వాడి లాభం నిత్యం. అమ్మకానికి ఒకవైపున లాభం ఉంటే, రెండోవైపున నష్టం అన్నమాట. అంటే మన నష్టంకూడా నిత్యం అన్నమాట. తగ్గింపుధర అంటే తగ్గింపు కాదు. అతని లాభంలో కొంత తగ్గించుకొన్నధర అన్నమాట. అంటేమనకు పూర్తి నష్టంలో కొంత లాభం అన్నమాట. అందుకే దీన్ని తగ్గింపు ధరల అమ్మకం అనే బదులు, తగ్గింపు లాభాల అమ్మకం అంటే ఇంతసేపూ నే బాధపడవలసిన అగత్యం లేదని విజ్ఞాపిస్తూ, సకల జగత్ కొనుగోలు దార్లను హెచ్చరిస్తున్నాను.

'ధర తగ్గుట హెచ్చుటకొరకె.' జాగ్రత్త!

సోమసుందర్ | చైతన్య భారతి

"గడచింది కలతరాత్రి
పొడిచింది వెలుగుధాత్రి
ఉదయాన అరుణకాంతి
హృదయాన తరుణశాంతి!..."

★

పాడిరి పాటలాధరలు పాడిరి దాస్యవిముక్తిగీతి, జీ
రాడెడి గొంతులెత్తి కలరావమనోజ్ఞ సుధాస్రవంతిగా!
వాడని పూలవాసనల భాతి, పురాకృత పాప మెల్ల రా
పాడిన జీవితాలు భవబంధములన్ విదళించి మేల్కొనన్!

ప్రతి నరుడూ పాడనేర్చె నబ్బురముగ నప్పుడు,
గతకాలపు నిదుర తెఱల కలలు వెలిగినప్పుడు,
మతిమాలిన మనసు మగత మేలుకొన్న చప్పుడు,
చితిలోపలి వెతల కతల మూల్గు తొలగి నప్పుడు.

ఉబ్బెత్తుగ ఉప్పెనలా
తబ్బిబ్బుల లాహిరిగా
కార్చిచ్చుల ఉద్ధృతిలా
చేర్పుక్కల జాబిలిగా.

పాడనేర్చినారు జనం - మ్రోడు మోసులెత్తినటుల...
చీడదుల్చినారు జనం - క్రొత్తచేవ కూర్చినటుల...
ఆటలాడినారు జనం - విద్యుల్లలితాంగు లటుల...
మాటమాట నడుమ ఘనాఘనహాసం వెలిగినటుల...

క్రిక్కిరిసిన చక్కదనం
చెక్కిలి ముద్దాడు రీతి,
ఆమని పూదోట కోటి
యింపులు గుమిగూడుభాతి ;

పాడిరందరూ పాడిరి పాటలు జలపాతమై,
చేడియలందరి చెయిదము చిందులాడె విందులై,
పాడిరి యెలనాగలు పూబోడులు కలనాదమై,
కోడెగాళ్ళ యెడద జవ్వనాల పంటపసందై.

పంజరాల పక్షులన్ని
బంధనాలు తొలగించుక—
సంజ గుడ్డి చీకటిలో
ఇంధనాలు వెలిగించుక—.

ఉప్పొంగుచు లేచినారు ఉరిమినటుల ధీరులై ;
చప్పున దుమికారు ప్రతీవారు వెలుగుచేరులై ;
తొంగలి రెప్పల నెత్తెను ఉదయకాంతి స్మేరమై ;
సంగడీంద్రుగా జనాలు హృదయదీప్తి తోరమై ;

చెంగలించినారు మహో
త్తుంగభావ సారమై,
మంగళకరమై కిసాల
యోత్సవ సంగీతమై ;

హరితకాంతు లలముకొనిన నిగారంపు పంటలై,
హరిణకాంత విభునిచేర వలపులూరు జంటయై,
రవిరోచులు తమిదీరగ గ్రోలుతూన్న చెట్లులై,
అవధిలేని ఆకాశము నెగురుతూన్న పిట్టలై.

కైరవ సంతోషమై...
కైవలిపీ గానమై...
కేదార సుహాసమై...
మోదోజ్జ్వల నాదమై...

అరుణోదయ కాలజనిత సౌందర్యపు ప్రోవులై,
తరుణోత్సవ లసచ్చరణ చారణ నిక్వాణమై,
కిరణ ప్రసరణ హేలా ప్రాలేయనవాంశువై,
స్మరవిలాస రింఛోళీ స్ఫురద్గంధసారమై,

*

నాకనుల క్రమ్మినవి ఆనంద బాష్పాంబు పూరంబులేవో....
నా వీనులన్ సోకె విద్యుత్ప్రభాకోటి ధ్వానంబులేవో....
నా మేను పాతరోతల దుల్చి దాల్చె నవసురభిళాలేవో....
నా ప్రాణమే పొంగె రగిలించి జీవనజ్యోతులేవో !....

★

హఠాత్కలిత నాదచమూ
సమూహమ్ము కదలెన్ !
సదానంద రావ సరిత్
ఝరీవారి కదలెన్ !!

కదలెను చీకటి గములే
ప్రిదిలెనుర విహాయసమ్ము ప్రేంఖణమాలా
సదనమ్మై భువి చెదరెను
కుదిరెను భాస్వత్కిరీట కోమల రేఖల్ !

కోమల రేఖలై, కొదమకోరికలై, తుదిదాకసాగి-సం
క్షేమ మహోత్సవమ్ము విరచించిన మించుల మించు తీవలై,
శ్యామలకాంతిపుంజముల శాద్వల సీమల నాట్యకేళికా
ధామములై రహించె, జనతాహృదయోత్సవ గానమంజరుల్.

# వార్ధక్యం | ఎడ్నా ఫెర్బర్ *

ఆవిడ ఎప్పుడూ అంతే! ఆయన్ని నానా హైరానా చేస్తుంది. మాటవరుసకు తలగడదిండ్ల సంగతే చెప్పుకుందాము. ఆయనకు రెండుదిండ్లు లేందే నిద్రపట్టదు. అందులోనూ వృద్ధాప్యంలో వున్నవాడయ్యె. అలవాటుపడ్డ సుఖాలు మానడం కష్టంకదూ. ఆ పాతమంచమూ, ఆ రెండు దిండ్లూ వుంటేనే ఆయనకు కంటినిండా నిద్ర. రెండు దిండ్లలో తలదూర్చేసి, మనిషంతా మంచంలో కూరుకుపోయి, గాఢనిద్రలో పడిపోతాడు. తెల్లవారేసరికి చూస్తే ఒక దిండు క్రిందపడి వుంటుంది. ఇది ఒకరోజు సంగతి కాదు. రోజూ అంతే! ఆవిడ ఇది రోజూ చూస్తూనే వుంటుంది. అయినా రెండు దిండ్లెందుకని ఎప్పుడూ వాదులాడలేదు. కాని రెండుదిండ్లు ఎందుకు అన్న భావంమాత్రం చూపులతో స్ఫురింపజేస్తూ వుంటుంది. ఉదయం ఆయనకంటె ఆమే ముందు నిద్రలేస్తుంది. లేచి గదికిటికీ మూయడానికి వెడుతూ, దారిలో పడివున్న దిండును తీసి మళ్ళీ యధాప్రకారం మంచంపై సర్దుతుంది.

కిటికీ సంగతీ అంతే. ఆమెకేమో కిటికీ తీసివుంటేగాని నిద్రపట్టదు. ఆయనకు అది గిట్టదు. రాత్రి గాలి ఆరోగ్యానికి మంచిది కాదని ఆయన అనుకుంటాడు. జలుబో, జ్వరమో, మరోజబ్బో వస్తాయని ఆయన భయం.

"రాత్రి గాలంటే అంత భయమెందుకు?" అంటుందావిడ.

ఆయనేదో సమాధానం చెబుతాడు. చివరకాయన పట్టువెగ్గడు. ఇద్దరూ నిద్రపోయేప్పుడు కిటికీ తెరిచి వుండాల్సిందే. నిద్రపోయేముందు కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుకుంటారు. నలభై యేళ్ళకు పైగా కాపురంచేసి, ప్రశాంత జీవితం గడిపి, వృద్ధాప్యంలోకివొచ్చిన వాళ్ళు మరేం మాట్లాడుకుంటారు?

"రేపు పొద్దున గెర్సైన్ సంగతి జ్ఞాపకంచెయ్యి. బేస్మెంటు గదికి తాళం పెట్టించాలి. వూళ్ళో దొంగల బెడద ఎక్కువగా వుందని పేపర్లు తెగరాస్తున్నాయి."

"అలాగేలే. నాకు మాత్రం జ్ఞాపకం రావొద్దూ!"

అలా అంటుందేకాని, ఆవిడకు ఏ సంగతీ జ్ఞాపకముండకపోవడమంటూ ఎప్పుడూ లేదు.

"జార్జీ, నెట్టీ వెళ్ళి వారం రోజులైంది. ఇంకా రాలేదు."

"పోనీలే. వయస్సులో వున్న పిల్లలు. తిరిగి తిరిగి వాళ్ళే చేరుకుంటారు గూటికి....సరే గాని ఇస్త్రీ మనిషి కివ్వాల్సిన డబ్బిచ్చావా?"

"అరె, మరిచేపొయ్యాను. ఇప్పుడు నువ్వంటే జ్ఞాపకం వచ్చింది. రేపు పొద్దున అన్నిటికంటె ముందు ఆ పని చెయ్యాలి."

"నీ కెప్పుడూ వుందేగా ఈ మతిమరుపు!"

"అబ్బ, గాలి తెగకొడుతూవుంది."

"పడమటి గాలిలే. పరవాలేదు పడుకో."

ఇద్దరూ ఇలా మాట్లాడుతూనే నిద్రపోతారు. రాత్రివేళ ఎప్పుడో ఆయనకు మెలకువవస్తుంది. మెల్లగాలేచి చప్పుడు కాకుండా అడుగులువేసుకుంటూపోయి, ఆ కిటికీమూసేస్తాడు. సరిగ్గా ఆ వేళకే ఆవిడా మేలుకుంటుంది. చేసేది గమనిస్తూనే వుంటుంది. అయినా అభ్యంతర పెట్టదు మనిషి మరీ అంత తెలివితక్కువది కాదు. కాకపోతే మరొకరైతే ఆ కిటికీ దగ్గిరే వాళ్ళ దాంపత్య జీవితానికి ఒడుదుడుకులు వొచ్చివుండేవేమో! అంత చిన్న విషయంలో ఆయనతో పేచీపడ్డం ఆమె కిష్టంలేదు. సంగతి తెలుసుకొని సన్నగా నవ్వుకొని వూరుకునేది. తాను అంతా గమనిస్తున్నా నన్న ఆచూకీ ఆయనకు తెలియనిచ్చేదికాదు. ఆయన వెళ్ళి మంచంమీద పడుకొని నిద్రపొయ్యాడన్న నమ్మకం కలుగగానే తానులేచి మెల్లగావెళ్ళి యధాప్రకారం కిటికీ తెరిచేది.

తెల్లవారిన తరువాత ఆయన చూచి "అరె మూసిన కిటికీ తెరిచివుందే! ఎవరు తెరచారబ్బా!!" అనేవాడు.

"కిటికా? మనం పడుకొనేప్పుడు తెరిచేవుందే! మూసి వుందంటావేం?" అంటూ ఆమె తలగడదిండ్లను మరోమారు సర్దేది.

* మిస్ ఎడ్నా ఫెర్బర్—జననం 1887. షుమారు నలభైఏళ్ళనుంచీ రచయిత్రిగా ప్రఖ్యాతి పొందింది. నవలలు, కథానికలు, నాటికలు వ్రాసింది. 'సోబిగ్', 'షోబోట్' మొదలైనవి ఈమె ప్రసిద్ధగ్రంథాలు.

ఆయనకు డెబ్బయి యేళ్ళొచ్చాయి. అయినా మనిషి దృఢంగా, ఆరోగ్యంగా, చురుగ్గా వుంటాడు. ఆవిడకు దాదాపు అరవైయైదు. మనిషి బొద్దుగా పుష్టిగా వుంటుంది. ఇద్దరిలో ఎవ్వరికీ తాము చస్తామన్న భయమే లేదు. ఎప్పుడైనా చావు మాట వొస్తే ముందు తానే దాటిపోతానని ఆయన అనేవాడు. ఆ తరువాతనే ఆమెట. ఇద్దరిలో ఎవ్వరికీ చావాలని లేదు. ఇంకా కొంతకాలం ఈ ప్రపంచంలో బ్రతికి మంచీ చెడ్డా చూడాలనే. వచ్చే చలికాలం కాలిఫోర్నియా వెళ్ళి అనుకూలంగావుంటే అక్కడే వుండిపోవాలని అనుకున్నారు. చికాగోనగరం ఇద్దరికీ బాగనిపించడం లేదు. ఎప్పుడూ ఒకటే రొద, ఒకటే జనం, దుమ్మూ ధూళీ పొగా. ఇంత కంటె ప్రశాంతంగా వుండే ప్రదేశంలో స్థిరపడిపోవాలనుకున్నారు. మరి జార్జీ, నెట్టీ సంగతో? వాళ్ళది కొత్తకాపురం. పెద్దదిక్కు లేకపోతే ఏమైపోతారో అనుకొనేవాళ్ళు.

ఆయన ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా ఇన్సూరెన్సు ప్రీమియం చెల్లిస్తూనే వొచ్చారు. దానితో తాను దాటిపోయిన తరువాత ముసలావిడ సుఖంగా బ్రతకాలని ఆయన కోరిక. పైగా లోకంలో అనేకమంది విధవలను చూస్తున్నాడు. విధవలసంగతి తట్టేసరికి ఎప్పటికైనా ముందు తానే ఈ లోకంనుంచి నిష్క్రమిస్తానన్న విషయం ఆయనకు ధృవపడింది. లేకపోతే లోకంలో భర్తలుపోయిన స్త్రీలు ఇంత ఎక్కువగా వుంటారు. భార్యలుపోయిన పురుషులు చాలా తక్కువ. కాబట్టి విధవల సంఖ్యే మగవాళ్ళు ముందుగా దాటిపోతారనడానికి రుజువు. లోకంలో వేలకొద్దీ విధవలున్నారు. కొందరు ఒంటరిగా జీవితం వెళ్ళబుచ్చుతారు. కొందరు హోటళ్ళలో వుంటారు. కొందరు కూతుళ్ళదగ్గరికెళ్ళి జీవితశేషం గడుపుతారు. ఆ అదృష్టం లేనివాళ్ళు కొడుకుల దగ్గరే వుండి కోడళ్ళ దయాధర్మాలపై ఆధారపడి వుంటారు. మొత్తంపై మొగుళ్ళుపోయిన ఆడవాళ్ళ జీవితం దుర్భరం. లోకం ఇలాగేవుంది. ఇలా ఎందుకుందో అని కాసేపు ప్రశ్నార్థకముఖం పెట్టి వితర్కించుకొన్నాడు.

అనుకున్నారే గాని కాలిఫోర్నియా ప్రయాణం పడలేదు. ఆ సంవత్సరం అలాగే పోయింది. మరుసటియేడు ముసలాయనకు స్థిమితం లేకుండా వొచ్చింది. వ్యాపారం మందగించిందట. ధరలు పడిపొయ్యాయి. సెక్యూరిటీల విలువ పడిపోయింది. ఆ క్రితం సంవత్సరమే ముసలాయన వ్యాపారం మానుకున్నాడు. యాభై యేళ్ళనుంచీ కూడబెట్టుకొంటూ వచ్చిన వాటాల ఆదాయంతో వృద్ధాప్యం సుఖంగా గడుపుదామనుకున్నాడు. కాని ఆయన ఆశలు అడియాసలయ్యాయి. వాటాలపై ఎంత ఆదాయం వొస్తుంది? వ్యాపారమే మందగించి స్టాకులను అడిగే దిక్కు లేకుండావుంటే! లాభంలేదు అనుకున్నాడు.

ఒకరోజు ముసలావిడకు అకస్మాత్తుగా పార్శ్వపు నొప్పి వచ్చింది. డాక్టరుకు చూపించుదామని ఎగువబస్తీకి వెళ్ళింది. ఇంటికి తిరిగొచ్చేసరికి ఆవిడ ముఖమంతా చెమటలు కమ్మివుంది. మనిషి వొణుకుతూవుంది. తనను చూచి ముసలాయన ఎక్కడ గాబరాపడతాడోనని ఆయనకు మొహం చూపకుండా సరాసరి గదిలో కెళ్ళి ముసుగుపెట్టి పడుకుంది. ఆ తరువాత ఎక్సురేలు, ఇంజక్షనులు, మందులు. పరిచర్యలూ.... మార్ఫియా.... మృత్యువూ!

“నేనే ముందు దాటిపోతా ననుకొంటే ఇలా జరిగింది. ఎవరు ముందో, ఎవరు వెనకో మనుషులేం చెప్పగలరు?” అనుకున్నాడు ముసలాయన.

అయినకాడికి ఇల్లు అమ్మేశాడు. జార్జికూడా అమ్మెయ్యమనే అన్నాడు. కంపెనీలో పనిచేస్తున్నవాడు కాబట్టి ధరవరలు ఎలా వుండేదీ జార్జికి తెలుసు. వున్నకొద్దీ ధరలు తగ్గుముఖమే. అసలు కొన్నేళ్ళవరకు డబ్బే మెసలదంటున్నారు. ఇరుగుపొరుగూ అదే మాట.

జార్జి చెప్పేది నిజమనుకున్నాడు ముసలాయన. అంతా ఆమాటే చెబుతున్నారు. ఆయనలో ఇప్పుడు పట్టుదలలే లేకుండా పొయ్యాయి. ఆ పట్టుదలల్ని చూచి, ముసలావిడ ఆయన్ని ఎన్ని ఆటలాడించేది! ఎంత హైరానా చేసేది! ఆవిడవుండగా జార్జి ఏదైనా చెప్పొస్తే “నీకు తెలీదులేరా. నువ్వలావుండు” అని తనమాటే నెగ్గించుకొనేవాడు. అటువంటి మనిషి ఇప్పుడు “జార్జ్, నాకంటె నీకే బాగా తెలుసు ఈ వ్యవహారాలు.” అంటున్నాడు.

డాక్టర్ బిల్లులు, మందుల కివ్వవలసిన డబ్బు, అక్కడక్కడా ఇవ్వవలసిన చేబదుళ్లూ అన్నీ తీర్చేశాడు. అన్నీ పోగా మిగిలింది ఏడాదికి ఐదువందల డాలర్లు.

“నాన్నా, నువ్వు మాదగ్గరే వుండాలి.” అన్నాడు జార్జి ఒకరోజు. అతనిభార్య నెట్టీకూడా అవునన్నట్లుగా చిరునవ్వు ముఖంతో ఆయనవంక చూచింది.

“నీకు ముందరివేపు గది అయితే బాగావుంటుంది. మేము వెనక్కి సర్దుకుంటాములే. ఏమీలేదుకాని, వెనక గదిలో రెండు మంచాలు, టేబిలు, కుర్చీలు పట్టడం కష్టం. ఎలాగో సరిపెట్టుకుంటాము” అన్నారు ఇద్దరూ.

ఉన్నసంగతి ఆయనకు ముందుగానే చెప్పాలని వాళ్ళనుకున్నారు. ఆ మాట ఆయనా గ్రహించకపోలేదు.

“ఏదో చాలులే” అన్నాడాయన.

ఆ గదిలో మంచము, టేబిలు వున్నాయి. నెట్టీ టేబిల్ క్లాత్ అమర్చింది. కిటికీలకు కొత్తతెరలు వేసింది. గదిలో ఎక్కడివాటిని అక్కడ చక్కగా అమర్చింది. టేబుల్‌లాంపు పెట్టించింది. ముసలావిడ ఫొటో గోడకు తగిలించింది. అదెప్పటిదో పాతఫొటో. అందులో ఆవిడ నడివయస్సు మనిషిగా కన్పిస్తూవుంది. నెట్టీ, జార్జి దానికి కొత్తఫ్రేము కట్టించారు. ముసలాయన ఆ ఫొటోచూచి ఆశ్చర్యపడ్డాడు. చనిపోయేముందు ఫొటో తీయించుకుందువుగాని పదా అని కొడుకూ కోడలూ ముసలావిడను ఎంతో బలవంతం చేశారు. కాని ఆమె ఒప్పుకోలేదు. సరే, వున్నదాన్నే ముసలాయన ఎప్పుడైనా చూచుకొంటాడని వాళ్ళాపని చేశారు. కాని ఆయనకు ఆవిడఫొటో కావాలా? ఆయన మనోవీధిలో ఆమెవి ఎన్నిఫొటోలున్నాయి! రెండు దిండ్లమీద తలపెట్టుకు పడుకొని అలా పైకి చూచాడంటే ఎన్నోదృశ్యాలు ఆయన కళ్ళముందుకొస్తాయి. ఆవిడ ఒకప్పుడు సిగ్గుతో చిరునవ్వు నవ్వుతూ, మరొకప్పుడు గంభీరంగా, ఇంకొకప్పుడు కోపంగా.—ఇలా ఎన్నోదృశ్యాలు, ఎన్నో భంగిమలూ; అటువంటివాడికి ఆమెఫొటో కావాలా!

ముసలాయన కోడల్ని గూర్చి ఆలోచించసాగాడు.... నెట్టీ అందమైన పిల్ల. గుణవంతురాలుకూడా. ఆయన కోడల్నింకా చిన్నపిల్లగానే భావిస్తున్నాడు. ఆమెకు దాదాపు ముప్పైయేళ్ళు వొస్తున్నాయన్న సంగతి ఆయనకెప్పుడూ తట్టదు. జార్జీ నెట్టీ ఆలస్యంగా పెళ్ళిచేసుకున్నారు. వాళ్ళ పెళ్ళయి మూడేళ్ళే. తాను తన కూతురు ఆల్మాకు యుక్త వయస్సు రాగానే పెళ్ళిచేశాడు. కాని జార్జి పెళ్ళిచేసుకోనని ముప్పైఏళ్ళు దాటినా అలాగే వుండిపొయ్యాడు. ముసలావిడ స్నేహితురాళ్ళలో కొందరికి వయస్సొచ్చిన ఆడపిల్లలున్నారు. వాళ్ళల్లో ఇద్దరు ముగ్గురు జార్జిని ప్రేమించడానికి ప్రయత్నించి విఫలు లయ్యారు. పెళ్ళి చేసుకోనాయనా అని చెప్పి ముసలివాళ్ళు ఎంతగానో జార్జికి చెప్పారు. కాని అతను ఒక్క గంటయినా ఇంటిపట్టున వుంటేగా! ఎక్కడో తిరుగుతూవుండేవాడు. ఏమోచేస్తూ వుండేవాడు. ఎప్పుడైనా ఇంటికొస్తే ఆ కాస్తసేపూ మహా హడావిడిచేసేవాడు. డ్రెస్సు వేసుకుంటూ ఈలపాట పాడతాడు. స్నానాలగదిలో కూనిరాగాలు తీస్తూ పాటలు పాడతాడు. అతను ఇంట్లో వున్న కాసేపూ టెలిఫోన్ ఎన్నో మార్లు మ్రోగేది. ముసలామె అతనికోసం ప్రత్యేకంగా తినుబండారాలు చేసేది. పనిమనిషి వొచ్చి "జార్జ్, ఏంటిదీ, వంటగది నిండా మానె పారబోసి వొచ్చావ్. చూడు గదంతా ఎలా వుందో" అని కోపగించుకొని, మళ్ళీ ఇష్టంగానే తుడిచేది. జార్జి పెద్దగా నవ్వుతూ, పెనంమీద కాలుతూవున్న పదార్థాలను తానే వడ్డించుకొని గబగబాతినేసి శరవేగంతో వెళ్ళిపొయ్యేవాడు.

నెట్టీ విషయం ముసలాళ్ళిద్దరూ కొంత దీర్ఘంగా ఆలోచించారు. జార్జి బాండు వ్యాపారపు కంపెనీలో పని చేస్తున్నాడు. నెట్టీకికూడా ఆ కంపెనీలోనే వుద్యోగం. మనిషి బొద్దుగా అందంగా వుంటుంది. మెరిసే కళ్ళు, నునుపుదేలిన శరీరం ఎంతో ఆకర్షవంతంగా వుంటుంది. నల్లని శిరోజాలు. సాదా దుస్తులే వేసుకుంటుంది, కాని అవి ఆమెకు బాగా అమరినట్లుంటాయి. బొద్దుపిల్ల కదూ, ఏ గౌను అయినా బాగానే వుంటుంది. బాండుల వ్యాపారం ఆమెకు బాగా తెలుసు. ఎంతబాగా తెలుసునంటే మనిషికి మొగవాళ్ళ తెలివితేటలు, చురుకుదనం అబ్బాయి. అయితే రూపురేఖలలో హావభావ విలాసాలలో స్త్రీ లావణ్యం పోలేదు. ముసలావిడ కంటె ముసలాయనే కోడల్ని ఎక్కువగా మెచ్చుకుంటాడు.

ముసలాయన్ని నెట్టీ 'బాబుగారూ' అని పిలుస్తుంది. ఆయనతో సరసాలాడుతుంది. దాదాపు ఆయన కూతురన్నట్లుగా మురిపాలకు పోతుంది. ఆయనతో ఆటలాడుతుంది. గుండ్రంగా వంపుతిరిగివున్న ఆమె బుజాన్ని మురిపెంగా మెలిపెట్టేవాడాయన. మృదువైన ఆమె చెంపని నొక్కి 'ఇదిగో నీకిదే శిక్ష' అనేవాడు. ఆమె దగ్గరగా నవ్వి ఆయన బుజంమీద కొట్టేది. ఆయన తలవూపుకుంటూ ఏదో అనిర్వచనీయమైన ఆనందంలో పడిపొయ్యేవాడు.

మామా కోడలూ ఇలా సరసాలాడుకుంటూ వుంటే అక్కడ వున్నవాళ్ళు జార్జితో "జార్జ్, చూదావా, మామకు తగ్గ కోడలే దొరికింది. కొంపదీసి మామనుకూడా ప్రేమించదు కదా" అని వేళాకోళంగా అనేవాళ్ళు.

నెట్టీ చిరునవ్వు నవ్వేది. నవ్విందంటే చక్కని పలువరుస దర్శనమిచ్చి నయనానందం చేస్తుంది. ముసలాయన దగ్గరగా నవ్వేవాడు. నెట్టీ అందరికీ సమాధానంగా "బాబుగారి సంగతి నాకు తెలుసు. నా సంగతి ఆయనకు తెలుసు" అనేది.

నెట్టీ కాపరానికి వొచ్చిన తొలిరోజుల్లో ఉద్యోగం మానుకొని ఇంట్లోనే వుంది. సంతోషాతిరేకంతో ఇల్లంతా సర్దుతూ, అలంకారాలు చేస్తూవుండేది. స్నేహితులకు పార్టీ లిచ్చేది. వాళ్ళిచ్చే పార్టీలకు తాను వెళ్ళేది. బ్రిడ్జీ ఆడేది. విరామము, విశ్రాంతి, సుఖం, భోగాలు అంటే ఆమెకూ ఇష్టమే. జార్జి, ఆమె ఎంతో ప్రేమగా వుంటారు. ఇద్దరిదీ చాలా అనుకూల దాంపత్యం. పెళ్ళి కాకమునుపు ఆమె మిచ్చిగాన్ వీధిలో

ఒక హాస్టల్‌లో వుండేది. ఆ సంగతి ఇప్పు డెవరైనా జ్ఞాపకం చేస్తే ఆమె చిన్నబుచ్చుకుంటుంది.

ఇక్కడ ఈ ఇంట్లో ఐదు గదులున్నాయి. మంచి శుభ్రమైన గదులు. ఇల్లు ప్రశాంత పరిసరాలలో వుంది. గాలి, వెలుతురు బాగా వస్తుంది. పడకగదిలో వెల్వెట్ తెరలు-టేబిల్ లాంపులకు సిల్కు ఆచ్ఛాదనలు-చిన్న అల్మారాలలో మంచి పుస్తకాలు, పత్రికలు, సిగరెట్ల టిన్నులు, మిఠాయికాండీల డబ్బాలు. ఇల్లంతా ఆధునికంగా వుంది. భోజనాల గదిలో పెద్ద డైనింగ్ టేబిలు. దాని కాళ్ళు అవో తీరుగా వుంటాయి. పడకగదిలో జిల్రేగుకర్రతో చేసిన వాల్‌నట్ నల్లగా, నున్నగా చూడ్డానికి బాగా వుంటుంది. ఆమె కిదంటే చాలా ఇష్టం. ఆమెకూడా శుభ్రత తెలిసిన మనిషి. చక్కగా సర్ది, అమర్చుతుంది. ఉదయం పదకొండు గంటలకల్లా ఇల్లు కళకళలాడుతూ వుంటుంది. ఎక్కడా ఒక కాగితంముక్క గాని, చీపురుపుల్ల గాని కన్పించవు. సోఫాలు, కుర్చీలు, బల్లలు పొందికగా వుంటాయి. బ్రష్‌తో అన్నిటినీ శుభ్రం చేస్తుంది. కూరగాయలను చన్నీళ్ళలో వేసి వంటకు సిద్ధంగా వుంచుకుంటుంది.

ఇంతలో టెలిఫోన్ పిలుపు.

"హలోహలో బెస్. ఎంతసేపయిందీ. ఎవరూ పలక్కనే పోతే....జార్జి ఒప్పుకొంటే .. పిల్చి అడుగుతాను.... రెండు వారాలైంది ఒక్క సినిమాకూడా చూడక....మళ్ళీ అరగంట తర్వాత ఫోన్ చేస్తా....ఇంకా షాపింగ్ కాలేదు... మధ్యాహ్న భోజనం ఎక్కడో నట....ఏడుగంటలకు కలుస్తావు కదూ."

ఉద్వేగమూ, సంరంభమూ నిండిన ఇటువంటి యాంత్రిక జీవితంలో ముసలాయన వొచ్చిపడ్డాడు. ఆయన కిదంతా ఏమిటో గొడవ. కోడలు ఇప్పు డాయన్ను "బాబుగారూ" అని పిలవదు. ఆయన ఇప్పుడామె బుగ్గలు మెలిపెట్టి చెంపలు నొక్కడు. ఆమె "మామయ్యా" అని పిలుస్తుంది. టెలిఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతూ ముసలాయన్ను సాకుగా చెబుతుంది. ఓ పర్యాయం "మీకు తెలీదేమిటి? జార్జినాన్న ఇప్పుడు మా దగ్గరే వుంటున్నారు. ఎలాగమ్మా! నేను రావడం పడదు" అంటూంది. ఈ మాటలు ముసలాయన వినవేవిన్నాడు.

జార్జి, నెట్టీ ముసలాయన్ను బాగానే చూస్తున్నారు. "ఆ గదిలో కెళ్ళి ఒక్కడవే ఏం కూర్చుంటావ్? ఇక్కడే కూర్చోరాదూ" అనేవారు ఇద్దరూ.

పోయిన ఏడాది నెట్టీ మళ్ళీ ఉద్యోగంలో చేరాలనుకుంది. ఇంట్లో వుంటే ఆమెకు తోచడంలేదు. చేతినిండా పనేదీ? పార్టీల కెళ్ళక ఎన్నోరోజులైంది. ఏదో తినడం, కుట్టుపని చేయడం, కబుర్లు చెప్పుకోడం, బ్రిడ్జి ఆడటం—ఇంతే ఆవిడ దినచర్య. పైగా డబ్బుకూ అంతంతగానే వుంది. అయినా ముసలివాళ్ళిద్దరికీ నెట్టీ ఉద్యోగానికి వెళ్ళడమంటే బొత్తిగా ఇష్టంలేదు. ఆ మాటెత్తితేనే చిర్రుబుర్రు మనేవాళ్ళు.

"ఏంరోజు లొచ్చాయి. కుటుంబం కాపురం అన్న ధ్యాస వుంటేనా ఇప్పటివాళ్ళకి? మా రోజుల్లో పెళ్ళయిందంటే పిల్లలు పుట్టాల్సిందే. ఈకాలపువాళ్ళకు పిల్లా మేకా అన్న మాటేలేదు" అనేవాళ్ళు.

జార్జి నెట్టీలకు పిల్లలు లేరు. మొదట్లో నెట్టీ "ఇలా వుంటేనే హాయిగా వుంది. విశ్రాంతి అనేది ఇప్పుడు చూస్తున్నా. నా పదిహేడో ఏటినుంచి ఉద్యోగమేగా!" అనేది.

ఏడాది....రెండేళ్ళు .. మూడేళ్ళు.

ఎల్లిస్ వీథిలో పాత ఇంట్లో వున్నప్పుడు ముసలావిడ వంటయింట్లో ఓ చిన్నపాటి సామగ్రి కొట్టు తయారు చేసింది. ముసలాళ్ళిద్దరూ భోజనప్రియులు. ఇంకా ముసలాయనే తీసికట్టు. ద్రాక్ష, ఎండుపళ్ళు, కలకండ ఇవన్నీ అడపాదడపా చిరుదిళ్ళు. భోజనానికి కూర్చుంటే గుమగుమలాడే ముక్కల పులుసు, రొట్టె, పళ్ళు. ముసలావిడ ఆయన్ని "ఏంటలా కొరుకుతావేం? బాగా తిను" అనేది. ఆమెను తృప్తిపరచడానికైనా ఆయన మరికొంచెం తినేవాడు.

కాని ఇంటిపెత్తనం నెట్టీకి వొచ్చేసరికి పరిస్థితులు మారాయి. నెట్టీ కొంచెం కరుకుమనిషి. వ్యాపారంలో ఉద్యోగం చేసిందయ్యె. ముందూ వెనకా చూచేది. మనుషులకు సరిపోయేట్టు వంట చేసేది. ఆమెకు పదార్థాలలో కలోరీలు, విటమిన్లు తెలుసు. ఇవన్నీ తినేపదార్థాలలో వుంటాయన్నసంగతి ముసలాయనకు తెలీదు. ఆయనకు రొట్టె అంటే రొట్టె. వెన్నంటే వెన్న. కాని నెట్టీకి అవన్నీ కలోరీలలెక్క. సాధారణంగా మామ కోడలు భోజనానికి కూర్చునేవారు. జార్జి భోజనాలవేళకు వుండేవాడుకాదు. నెట్టీది ఆడవాళ్ళభోజనం. ఆపిల్‌ముక్కల వేపుడు, టోస్టు, ఒకకప్పు టీ అంతే. కాని ముసలాయనకు ఇదెట్లా సరిపోతుంది? చారు కావాలి, గుడ్లు వుండాలి. వాటిని తింటూ ఆయన కోడలికేసి మొహమాటపడుతూ చూస్తాడు. చూచి ఏమనుకుంటుందోనని. ఆమె రాత్రి మిగిలిన మాంసం, పళ్ళుకూడా తెచ్చి ఆయనముందు పెట్టేది. ఆయన సొపళ్ళు, ప్లేట్లమధ్య ఇరుక్కుపోయి, ఏదో అసౌకర్యంగా భోంచేసేవాడు. అయినా బాగానే తినేవాడు తినడం అయినతరువాత చుట్టూ చూచేవాడు ఆలోచిస్తూ.

"ఏం మామయ్యా, ఏం కావాలి?"

"ఏమొద్దమ్మా. ఇహ చాలు."

ఆ మాటే ఎప్పుడొస్తుందా అని ఆమె ఎదురుచూచేది.

అయినా ముసలాయనకు ఆహారం సరిపడింది. చలికాలం గడిచేసరికి మనిషి తేరుకున్నాడు. ఆరోగ్యంగా బలంగా కన్పించాడు. వృద్ధాప్యంలో తిరిగి యౌవనం తొంగిచూచిందా అనిపిస్తుంది ఆయన్ను చూస్తే. ఆయన నవ్వితే బుగ్గ సొట్ట పడేది. ఆ సొట్టనుచూస్తే మనిషి పిల్లాడిలా అగుపడతాడు. ముఖ్యంగా ఆడవాళ్ళు చూచారంటే నవ్వాపుకోలేరు. ఆ సొట్టను చూచి ముసలావిడ తరచు ఆయన్ని వేళాకోళం చేసేది.

చలికాలం గడచింది. వసంతర్తువు వొచ్చింది. వసంతాగమనంతో ఆయన జీవితంలో కొత్త కాంతి ప్రసరించింది. పోయిన ఆరు నెల్లూ బిక్కుబిక్కుమంటూ గడిపాడు. తన్ను సాధించడానికీ, వేళాకోళం చేయడానికి ఎవరున్నారిప్పుడు? కొడుకు కోడలు బాగానే చూస్తున్నారు. వేళకు తిండి పెడుతున్నారు. కావలసినవి తెచ్చి ఇస్తున్నారు. అయినా, ఏదో లోపం. తన్ను ప్రేమించేవా రెవరున్నా రిప్పుడు. అందులోనూ భార్య వీడన బ్రతికాడు. ఆమె వెళ్ళిపోయి తన్ను ఏకాకిని చేసింది. ఎల్లిస్ వీధిలో వుండగా తన వయస్సువారు ఆడా మగా తమ ఇంటికి వొచ్చేవారు. ముసలావిడ స్నేహితురాళ్ళొచ్చేవారు. వాళ్ళందరి మధ్య తాను కూర్చొని ఉపన్యాసాలు దంచేవాడు. వాళ్ళతో వాదించేవాడు. కొందరు తనతో ఏకీభవించేవారు. కొందరికి తన వాదన నచ్చేదికాదు. అయినా అంతా తన్ను గౌరవంగా చూచేవారు. ఆస్తిపాస్తులు, సాంఘికవ్యవస్థ, మద్యపాన నిషేధం, యూరోపువ్యాపారం, ఎన్నెన్ని విషయాలు!

"ఒక్కమాట చెబుతా మనదేశం మళ్ళీ ఆర్థికంగా కోలుకోవాలంటే ఏదో ఒకటి వెంటనే చెయ్యాలి. రష్యాను చూడండి."

"ఈ కాలపు కుర్రకారుకు! మర్యాదా మన్నన బొత్తిగా తెలీదు. పెద్దమార్పు రావాలి వొచ్చి తీరుతుంది. ముసలాళ్ళే మార్పుతేవాలి. కష్టాలు వీళ్ళ కేం తెలుసు. సరిగ్గా పని తెలుసా. డ్యాన్సింగ్, పరుగెత్తడం, తాగడం — ఇవేగా వీళ్ళకు! వీళ్ళడ్రెస్ చూడండి. వీళ్ళ...."

"అవునవును" ఒకాయన వత్తాను.

"కాకపోతే విన్నమటుకు విన్న...."

ఏడాదిక్రితంవరకూ ఆయన వ్యాపారం చేస్తూనే వున్నాడు. ముసలావిడ పోరు పెడితేనే మానుకున్నాడు. ఇక ఆయన విశ్రాంతి తీసుకోవాలన్నారు అంతా.

ఇప్పుడు మళ్లీ వొంట్లో బలమొచ్చిన తర్వాత ఉదయంపూట పైబస్తీకి వెళ్లడం మొదలెట్టాడు. గడ్డం తానే గీసుకొనేవాడు. పగటివేళ గంటలతరబడి స్నానాలగదిలో వుండేవాడు. నెట్టీకి ఇది చిరాకు కలిగించింది. అయినా ఏమీ అనలేదు. ఆ వెంకులగది ఆయన కిష్టం. నీటి తొట్లో అలా కూర్చొని పొయ్యేవాడు. గది పైకప్పుకు, గోడలకు, తలుపుకు సబ్బునురగ పడేది.

"మామయ్యా" బైటినుంచి కోడలి కేక.

"ఎందుకో"

"వంట్లో బాగావుందా"

"నాకేం"

"ఆ, ఏమీలేదు. ఇంతసేపు లోపలుంటే"

మనిషి శ్రద్ధగా దుస్తులు వేసుకొనేవాడు. అయినా కోటు పైనో, నెక్‌టైపైనో దారమో, బొరమో ఉండేది. ముసలావిడ వుండగా వాటిని తీసి పరిచేసేది. 'చూచుకోవేం' అని మందలించేది. ఆవిడ మందలింపులు, చిరుకోపాలు ఆయనకు చాలా ఇష్టం. ఎవరో తన ఆలన కనుక్కొనేవారున్నారన్న సంతృప్తి. తాను మనిషి ఎలావుందీ కనిపెట్టి, తనంటే గర్వకారణంగా భావిస్తూ తన్ను ప్రేమించేవ్యక్తి ఒకరున్నారు. నెట్టీ ఎప్పుడూ తన కోటుపై వున్నవాటిని దులిపేదికాదు ఎప్పుడో "మామయ్యా, ఆ సూటు అవతల పడెయ్యి. మాసిన బట్టలతోపాటు ఇస్త్రీకి పంపుతా." అనేది. ఆయన తత్తరపాటుగా తన దుస్తుల్ని తానే దులుపుకొని వెళ్ళిపోతూ వుంటాడు.

ఉదయం టాయిలెట్ పూర్తిచేసుకొని, డ్రెస్ వేసుకొని రైలెక్కి సరాసరి 5 వీధికి వెళ్ళేవాడు. అలా వెడుతూ తన్ను ఓ ప్రముఖవ్యక్తిలా భావించుకొనేవాడు. కిటికీనుంచి బైటికి సాలోచనగా చూస్తూ వాచీ చూచుకునేవాడు. మనిషిని చూస్తే పెద్ద ధనికుడిలా, బస్తీకి పెద్ద వ్యాపారానికి వెళ్ళేవాడిలా కన్పించేవాడు. చికాగో విపణివీధి ఆయనకు యాభైయేళ్ళనుంచీ తెలుసు. ఇప్పటి స్టేట్‌స్ట్రీటు ఒకప్పుడు తడికలబజారన్న సంగతి ఆయన యెరుగును. అక్కడి వ్యాపారం, కార్లు, ఆ రణగుణధ్వని ఆయనకు సుపరిచితమైనవి. అప్పుడు రోజూ ఆ వీధికి హుషారుగా వెళ్ళేవాడు. ఇప్పుడు వెళ్ళడం కష్టమనిపిస్తున్నది. రైలుబళ్ళమోత, మోటారుహారన్ల చప్పుళ్ళు, స్ట్రీట్‌కార్లరొద, ఆయన్నిప్పుడు గాబరా పెడుతున్నాయి. రోడ్డు దాటడం కష్టం. ఏ క్షణం ఏ కారొచ్చి మీదపడుతుందో! మొన్న వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది. ఒకొకమారు పోలీసొచ్చి తన చెయ్యి పట్టుకొని రోడ్డు దాటడానికి సహాయపడేవాడు. అదే ఆయనకు మంట.

"చూడబ్బాయ్, నువ్వు పుట్టకముందునుంచీ నేనీపీథికి వస్తున్నా. నాకేమీ సహాయపడక్కర్లేదు. నేను పల్లెటూరి బైతునుకాను" అనేసేవాడు ఆ పోలీసు మొహంమీదనే.

తిన్నగా స్టాకు ఎక్స్చేంజికి వెళ్ళేవాడు. ఏమీ ప్రోత్సాహకరంగా వుండదు. స్టాక్సు ఇంకా పడిపోతున్నాయట. ఏడాదికి తనకొచ్చే ఐదువందల డాలర్లకు ఢోకాలేదు. మిగిలిందంతా అయోమయం!

అక్కణ్ణుంచి జార్జి ఆఫీసుకు వెళ్ళేవాడు. ఆఫీసు బాగా వుంటుంది. మంచి కుర్చీలు, బల్లలు, గాలి, వెలుతురు, కిటికీలకు తెరలు. యువతీయువకులు చక్కగా ముస్తాబై బల్లలముందు కూర్చొని వుంటారు. ప్రతి బల్లప్రక్కన ఆ ఉద్యోగి పేరుగల బల్ల వుంటుంది. మిస్టర్ ఓవెన్స్, మిస్ రాబ్, మిస్టర్ మినిక్.

"నాన్నా నువ్వా. ఏంటీ ఇలా వొచ్చావు" అడిగేవాడు జార్జి.

"ఏంలేదులే. ఎక్స్చేంజీ ఎలావుందో చూద్దామని వొచ్చా. ఎలావుందీ వ్యాపారం?"

"అధ్వాన్నంగా వుంది"

"అదే అనుకుంటున్నా"

తరువాత మిగతా యువకుల బల్లలదగ్గరికెళ్ళేవాడు. వాళ్ళంతా తలెత్తి ఆయన్ని ఆదోరకంగా చూచి, మళ్ళీ తలలు దించుకొని పనుల్లో నిమగ్నులయ్యేవారు. ఆయన దీర్ఘంగా ఒక్క నిట్టూర్పు విడిచి తనకూ వాళ్ళకూ గల తారతమ్యాన్ని గూర్చి తలపోసేవాడు. ఇది మరోతరం!

"ఏం మిస్టర్, కులాసా" వాళ్ళల్లో ఒక యువకుణ్ణి పలకరించేవాడు.

"ఇలా వున్నాం సార్!" అంటూ అతడు తలఎత్తకుండానే సమాధానం చెప్పి, "ఏం, ఇలా వచ్చారు?" అని అడిగేవాడు.

"ఏమీ లేదు. మా అబ్బాయిని చూచిపోదామని వొచ్చా."

ముసలాయన ఇలా ఆఫీసుకు రావడాన్ని గూర్చి జార్జి నెట్టీ పడకగదిలో మాట్లాడుకొనేవారు. ఎవరూ ఎక్స్చేంజికి పనిలేకుండా వెళ్ళకూడదు. ఆఫీసు రూల్సుకు అది విరుద్ధం. నెట్టీ ఉద్యోగం చేసేప్పుడు అంతే. అంతా వ్యాపారసరళిగాని అనవసరమైన కబుర్లకు అక్కడ వీలులేదు. పెళ్ళయిన తర్వాత నెట్టీ ఒక్కమారు మాత్రమే, అదీ అత్యవసరమైన పనిమీద అక్కడికెళ్ళింది.

ఇలా వుంది ఈనాటి మర్యాద! మాటామంతీ ఏమీలేదు. ఏదో అంతా తొందర, రద్దీ, గందరగోళం. దేనికీ వ్యవధిలేదు.

చలికాలం వొచ్చింది. ఎప్పుడూ లేదు ఎముకలు కొరికే చలి. మంచు విపరీతంగా కురుస్తూవుంది. ముసలాయన ఎక్కడికీ కదల్లేడు. రోజుల తరబడి గదిలోనే వుండాలి. పనేమీ లేదు. అదే ఆడవాళ్ళయితే ముసలివాళ్ళయినా ఏ అల్లిక పనో, కుట్టు పనో, వంట పనో, పై పనో చూచుకుంటారు. ఏమీ లేకపోతే పొరుగు ఆడవాళ్ళతో కబుర్లు. మరితనో! పనిలేదు. తోచదు. పొద్దుపోదు. ఇలా గడపడం ఏమిటీ అనుకొనేవాడు. ఏదో పని చెయ్యబోయేవాడు. "నెట్టీ వొచ్చి వీటెందుకు మామయ్యా, మీగదిలోకెళ్ళు. మధ్యాహ్నం కాసేపు నిద్రపో" అనేది.

"నిద్రా. జీవితమంతా ఇక నిద్రేగా"

సాయంత్రాలు జార్జి మిత్రులూ, నెట్టీ స్నేహితురాళ్ళూ వొచ్చేవారు. వాళ్ళంతా కబుర్లు చెప్పుకుంటూ బ్రిడ్జీ ఆడతారు. మధ్యలో జార్జి "రా నాన్నా. అంతా మా స్నేహితులే. ఎరగరోయ్ మా నాన్ననూ?" అని పిలిచేవాడు. తాను వాళ్ళ మధ్యకెళ్ళి కూర్చొని తన అనుభవంకొద్దీ ఏదో చెప్పబొయ్యేవాడు. పైలాపచ్చీసు వయస్సులో వున్నవాళ్ళు తన మాట వినిపించుకుంటారా? పూర్తిగా వినకుండానే ఏదో అనేవాళ్ళ. వినడం ఇష్టంలేనట్టు ఏదో చూచేవాళ్ళు. తానొక్కడూ వాళ్ళ మధ్య ఏకాకి. ఎవరో పరాయిమనిషి. వాళ్ళల్లో తన్ను కలుపుకోరు. తన ప్రపంచం వేరు. వాళ్ళ ప్రపంచం వేరు. ఆయన పరిస్థితి కనిపెట్టి అప్పుడప్పుడు జార్జీ, నెట్టీ ఆయనతో ఏదో అనేవారు.

వాళ్ళంతా ఏదో చెప్పుకొని బిగ్గరగా నవ్వేవాళ్ళు. నవ్వంది తానొక్కడే. కాని ఏమి వేడుకని నవ్వాలి? అసలు వాళ్ళు ఎందుకు నవ్వుతున్నారో తనకు అర్థం కాందే! ఎలా అర్థం చేసుకోవడం! వాళ్ళతో ఎలా కలిసిపోవడం. లాభం లేదు.

తరచు వంటగది ప్రక్కన వున్న గదిలో కూర్చొని పైపు కాల్చేవాడు. చదివిన పేపరే మళ్ళీ చదివేవాడు. చలికాలం. ఎవ్వరినీ కలుసుకో వీలులేదు. ఆ నీగ్రో పనిమనిషి ఒక్కతె మాత్రం కొంచెం పరిచయమైంది, కాని రోజూరాదు. అవి దెప్పుడొస్తుందా అని కాచుక్కూర్చునేవాడు. ఆవిడ వొచ్చి రావడంతోనే "ఏం బాబయ్యా, పొద్దుపోవడం లేదా. పెద్దతనంలో అందరిపనీ అంతే" అని బిగ్గరగా అనేది. దయగల మనిషి.

ఆవిడ ఒక్కమనిషైనా తన పరిస్థితిని అర్థం చేసుకున్నందుకు సంతోషంతో ఆయన మనస్సు తేలికయ్యేది. అయినా తానంత ముసలివాడయ్యాడా!

"ఏ అమ్మీ. నన్నప్పుడే ముసలిపీనుగు క్రిందకట్టేస్తున్నావే. ఈ కుర్రాళ్ళకు పదిరెట్లబలం నాకుంది."

"అబ్బో, ముసలాయన చేవగలాడే."

నెట్టీ వొచ్చి, "మామయ్యా, అవిట్ట పనిచేయనివ్వు. భోజనాలగదికిపదా, వంటయింది" అనేది.

కిక్కురుమనకుండా పిల్లాడిలా కోడల్ని అనుసరించేవాడు. నెట్టీకూడా ఆయన్ని పిల్లాడికింద జమకట్టింది. పిల్లాడితో సమానమే. కాని చెబితే వినని పిల్లాడు. ఎదగడమనేది లేని పిల్లాడు. వార్ధక్యమూ, బాల్యమూ ఒకటే కదూ? ఆయనకూ కోరికలుంటాయనీ, మనుషులను పరిశీలించగలడనీ, చూచి ఒక అభిప్రాయానికి రాగలడనీ నెట్టీ ఎప్పుడూ ఆలోచించలేదు.

ఆయనకు ఆడవాళ్ళ సంగతి తెలుసు. ఆయనా పెళ్లిచేసుకున్నవాడే. పిల్లల్ని కన్నవాడే. ఈనాడు ఈ కోడల్ని చూస్తున్నాడు. ఈవిడకు పిల్లలవిషయంలో ఏవో సిద్ధాంతాలున్నాయి. వాటిని తరచు వల్లెవేస్తూ వుంటుంది. ఏవో పరిస్థితులుంటేనే పిల్లల్ని కనాలట. లేకపోతే పిల్లలుకూడదట వాళ్ళ జీవనానికీ, చదువు సంధ్యలకూ ముందుగానే తగుడబ్బు ఏర్పాటు వుండాలట. బాగానే వున్నాయి సిద్ధాంతాలు. కాని తాను? తనూ తనభార్యా ఈ లోకంలోనే కాపరం చేశారు. . ముగ్గురు పిల్లల్ని కన్నారు. రెండో పిల్లవాడు 'పాల్' పదమూడేళ్ల వయస్సులో పొయ్యాడు. అప్పుడు తాము భార్యాభర్త లిద్దరూ ఎంత దుఃఖించారు. ముప్పై ఐదేళ్ళక్రితం జార్జి పుట్టినప్పుడు తాము ఏ పరిస్థితిలో వున్నారు? ఇవన్నీ ఈవిడకేం తెలుసు.

కోడలివంక పరిశీలనగా చూచాడు. మనిషి కొంచెం బొద్దుగా వుంటుంది. అంత పొట్టికాదు. విశాలమైన జఘనం. నిండైన వక్షస్థలం. గుండ్రంగా వంపులు తిరిగిన భుజాలు. భుజానికీ, వక్షస్థలానికీ మధ్య చక్కని వొంపు. మెలిపెట్టినట్టు వంపులు తిరిగిన భుజాలు. శంఖంలాంటి మెడ. చురుకైనకాళ్ళు. ఇటువంటమ్మాయి బాండ్స్ ఆఫీసులో పని చేసిందా? బైబిలులో బాండ్స్ ఆఫీసులో పనిచేయడమనేది వుందా? ఈ మనిషి పిల్లల్ని కనడానికి తగింది కాని, ఉద్యోగానికా!

ఆమె ఆయన్ను పూర్తిగా వెర్రి పిల్లాడిక్రింద కట్టేసింది.

మార్చిలో నెట్టీ వారంరోజులపాటు కుట్టుపనిమనిషిని పెట్టుకుంది. అలా యేడాదిలో రెండుమూడు పర్యాయాలు ఆ మనిషిని పిలిపించి కుట్టుపనంతా చేయిస్తుంది. ఆ మనిషికి నలభైయ్యైదు దాటాయి. మనిషి పోతపోసినట్లుగా వుంటుంది. ఆవిడ చూపులు మరీ ప్రమాదకరంగా వుంటాయి. ఒక్క చూపుతో ఎదుటిమనిషిని కట్టేసుకోగలదు. ఆవిడ భోజనాలగదిలో కూర్చొని కుట్టుపని చేసేది. ఆమె వున్నంతసేపూ మిషన్‌మోత, కత్తెర్ల చప్పుడు. బట్టలు దులిపిన చప్పుళ్ళు.

ఆవిడకూ ముసలాయనకూ దోస్తీ కలిసింది. ఆయన ఆవిడ దగ్గరికెళ్ళి బట్టలపోగులు తీసి మట్టసం చేసేవాడు. అయితే ఇదంతా కోడలు ఇంట్లో లేనప్పుడే.

"నీకు సాయపడుతున్నాకదా, నాకేమైనా ఇస్తావా?"

"ఏమివ్వాలి?"

"నువ్వు తినుకొనేదే"

"సరే, దిక్కూమొక్కూ లేనిదాన్ని నాదగ్గరేనా పీబేరం!"

"ఏం, మొగదిక్కెవరూ లేరా?"

"అదేవుంటే ఇంకాఏం?"

"ఎంతకాలంనుంచి?"

"నా ఇరవయ్యో ఏటినుంచీ నాగతి ఒంటరి జీవితమే"

"అయితే నేను...."

మాట దొర్లింది. తన తొందరపాటు గ్రహించాడు. ఆవిడ పనిఆపి ఆయనవంక తీవ్రంగా చూస్తూ "నీకుగాబట్టి సరిపోయింది. కొడుకుల దగ్గరా కోడళ్ళ దగ్గరా వుండడం, నేనుంటానా? సొంతఇల్లంటూ వుండాలి. ఎక్కడ తిరిగినా ఆ గూట్లో చేరుకొని నిశ్చింతగా నిద్రపోతా. నా ఇష్టమొచ్చినవి వండుకుతింటా. నోటికిష్టమైంది కాకపోతే నేతినలేను" అంది.

ఆవిడ వారంరోజులు వరుసగా పనికొచ్చింది. అప్పుడప్పుడూ తన కోడలిమీద చాడీలు చెప్పేది. ఆయన వారించబొయ్యేవాడు. గుడ్లు, పాలు, మాంసం, పులుసు ఇలాంటివేమైనా తనకు పెడుతుందా లేదా అని అడిగేది. వృద్ధాప్యంలో మంచితిండి వుండాలనేది. అయినా ఎన్నిరోజులు బ్రతుకుతాము గనుక! వున్నన్నాళ్ళు నోటికింపుగా తిని స్వేచ్ఛగా బ్రతకాలనేది.

ఆయన ఈ మాటలు శ్రద్ధగా వింటూ కూర్చునేవాడు. మూడోరోజు ఆవిడ అర్థపూరితమైన చూపులతో ఆయన్ని చూచింది. నాలుగోరోజు ఇద్దరూ బల్లముందు ఎదురుబొదురుగా కూర్చొనివుండగా కాలి బొటనవ్రేలితో తనకాలిని కావాలని తొక్కింది. ఐదోరోజు ఏదో బట్టకోసం వెదుకుతూ ఆయన పక్కగావెళ్ళి, లాలనగా ఆయన భుజంమీద చెయ్యివేసింది. అలాగే కాసేపుంచి సన్నగా నొక్కింది. ఆయన వెనక్కి తిరిగిచూచి ఆశ్చర్యపొయ్యాడు. చూపుల్లో ఏముందిలే అనుకున్నా. ఏదో అనుకోకుండా కాలు తొక్కిందిలే అనుకున్నా. మరి ఇప్పుడు జరుగుతూందేమిటి? కలా వాస్తవమా? మనిషి తబ్బిబ్బయ్యాడు. ఆవిడ ఆయనచెయ్యి పట్టుకుంది. ముఖం ముఖానికి దగ్గరగా తెచ్చింది.

"నీ మనిషి నీకుండాలి. నిన్ను ప్రేమించేమనిషి వుండాలి. నిన్ను కనిపెట్టుకొనివుండే మనిషి నీకు కావాలి."

ఆవిడ ముఖం ఇంకా దగ్గరగా వొచ్చింది. ఆయన ముఖం క్రిందికి వొంచారు. ఇంతలో మరో ముఖం ఇద్దరి మధ్యా అడ్డమొచ్చింది. ఏదీ ఎవరూ లేందీ. ఏదో భ్రమ. ముసలావిడ సరిగ్గా ఆ సమయానికే జ్ఞాపకం రావాలా? జ్ఞాపకం రావడమే కాదు. ఆ గుండ్రటి ముఖం. పెదల్పాటి కళ్ళు. సన్నని ముక్కు. పవిత్రతను సూచించే పెదవులు! వెంటనే మొహంవెనక్కిలాగేసుకొని మనిషి తేరుకున్నాడు. భుజంమీద ఆవిడ వేసిన చేతిని విసురుగా తొలగించాడు. ఆవిడ చెయ్యి వెచ్చగా తట్టింది.

"ఏం ఆడదానివి నువ్వు?" అని చీదరించుకున్నాడు.

వీధి తలుపు తెంచుకుంది. నెట్టీ! కుట్టు పనిమనిషి చప్పున కూలబడి పనిచేస్తున్నట్టు నటించింది. ఆయన నేరం చేసినవాడిలా తగదిలో కెళ్ళాడు.

"ఏమమ్మో, అంచులు కుట్టడం ఇంకా పూర్తికాలేదు"

"అవునమ్మా, వొంట్లో బాగాలేక పని సాగడంలేదు."

మరుసటి రోజు ఆవిడ పనికి రాలేదు. వొళ్ళు బాగాలేదని ఫోన్ చేసింది. నెట్టీకి కోపమొచ్చింది. తానే ఆ పని పూర్తి చేసింది. ముసలాయన ఆరోజేమీ మాట్లాడలేదు. కాని మనిషిలో ఏదో మార్పు కన్పిస్తూవుంది. ఆదోరకంగా చూస్తున్నాడు. నెట్టీ ఆయన్నేమీ అడగలేదు.

"హుం. ముసలిముండ. నన్ను పెళ్ళాడాలనుకుంది. నాకే వేసింది ఎత్తు!" అనుకున్నాడు తనలోతాను ఆ ముసలాయన!

* * *

"పూరికే ఇంట్లో కూర్చుంటే ఏం తోస్తుంది మామయ్యా. అలా పార్కుకేసి వెళ్ళిరా. చలి పోయిందిలే" అంది నెట్టీ ఒకరోజు.

ఆయన బారుకోటు వేసుకొని, మఫ్లర్ చుట్టుకొని, వంకికర్ర చేత బుచ్చుకొని వాషింగ్టన్ పార్కుకో, లేక క్లబ్బుకో వెళ్ళేవాడు.

ఆనాటినుంచీ ఆయన జీవితంలో మార్పువచ్చింది.

పార్కుకు ఎందరో ముసలివాళ్ళు వొచ్చేవారు. అందరికీ బారుకోట్లు, మఫ్లర్లు, చేతి వేళ్ళకు తొడుగులు.

ముసలాయన తప్పనిసరిగా రోజూ పార్కుకు వెళ్ళేవాడు. భోజనం వేళ, మధ్యాహ్నం కాసేపు కునుకుతప్ప, ఇతరత్రా ఎప్పుడూ పార్కులోనే గడిపేవాడు.

పార్కులో ముసలివాళ్ళంతా ఒకచోట చేరి, అవీ ఇవీ చెప్పుకొనేవారు. వాళ్ళలో రెండురకాలవాళ్ళున్నారు. ఒకరకం పెండ్లయిన కొడుకుల దగ్గర, కూతుళ్ళ దగ్గర వుండేవాళ్ళు. రెండవ రకం గ్రాంట్‌హోంలో వుండేవాళ్ళు. గ్రాంట్‌హోమ్ అంటే ముసలివాళ్ళు వేరే వుండే వసతి గృహం. పార్కులో నుంచి చూస్తే కొంతదూరంలో ఎర్రటి ఇటుకలతో కట్టిన ఆ వసతి గృహం కన్పిస్తుంది.

మొదటిరకం వాళ్ళు "ఎబ్బే. మా అబ్బాయికీ, మా అమ్మాయికీ నేను గ్రాంట్‌హోంలో వుండడం ఇష్టంలేదు." అని గర్వంగా చెప్పుకొనేవారు.

రెండోరకం వాళ్ళు "హుం, కుర్రకుంకలు. వాళ్ళదగ్గ రుంటానా. వాళ్ళు నాకు పెట్టేపాటివాళ్ళా. వాళ్ళదగ్గరుంటే పిల్లలకింద కట్టేస్తారు. చెప్పినట్టు విని పెట్టినట్టు తిని వుండమంటారు. నాకేం స్వయం రాజా స్వయం మంత్రి" అని డంబాలు చెప్పుకొనేవాళ్ళు.

మొదటిరకం వాళ్ళు ముభావంగా వుంటారు. కోడళ్ళను గూర్చి ఆలోచిస్తున్నట్టు కన్పిస్తారు. మనుమల్ని తీసుకొచ్చి పార్కులో ఆడిస్తారు. వాళ్ళ చేతులు పట్టుకొని నడిపించుకు పోతారు. ఒక్కొక్కప్పుడు తాతా మనుమల్లో ఎవరు ఎవరిని నడిపించుకుపోతున్నట్టో చెప్పడం కష్టం.

రెండవరకంవాళ్ళు స్వేచ్ఛాజీవులుగా కన్పిస్తారు. ఒక లోకంనుంచి మరోలోకానికి వచ్చినట్టుంటారు. వారి ముఖాల్లో ఎడబాటుచిహ్నాలు కన్పిస్తాయి. మరోచోట నాటిన మొక్కలు. ఏమిటో మాట్లాడతారు.

ఆ పార్కులో ముసలివాళ్ళంతా అనేకవిషయాలను చర్చించి నిర్ణయాలు చేసేవాళ్ళు. వీళ్ళు కేవలం అంతర్జాతీయ మనుష్యులే కాదు. అంతర్గ్రహమానవులు. యుద్ధం, శాంతి, ఆయుధ విసర్జన, చైనా లాంటి విషయాలెన్నో చర్చకు వొచ్చేవి. అదొక పెద్ద వేదిక. వారిలో కొందరు సోషలిస్టులు. కొందరు స్వతంత్ర భావుకులు. కొందరు విప్లవకారులు.

ముసలాయన కొత్తపదజాలం నేర్చుకున్నాడు. ప్రజాస్వామ్యం ...కష్టజీవులు...పాలకవర్గం... వాక్స్వాతంత్ర్యం .. ప్రజానీకం....

పార్కులో అంతా బల్లలమీద కూర్చొని, కాసేపు ఎండ కాచుకొనేవారు. కొంతదూరంలో తమవలెనే ఎండకోసమొచ్చిన ముసలమ్మలు కన్పించేవారు. వాళ్ళని చూచి, వ్యాఖ్యలు, విమర్శలూ చేసేవారు. యువతులెవరైనా చకాచక నడచిపోతూ వుంటే వాళ్ళను పరిశీలనగా చూచి ఏమో అనుకొనే వాళ్ళు. శరీరానికి ముదిమిగాని వాంఛలకూ అనుభూతులకూ ముదిమిలేదనిపిస్తుంది.

వాళ్ళందరిలోనూ ఈ ముసలాయన నాయకుడు. మిగతా వాళ్ళకి సరిగ్గా మాట్లాడ్డమే చేతకాదు. ఈయన సంభాషణకు ఉపక్రమిందాదంటే వాళ్ళందర్నీ ఆకట్టుకొనేవాడు. వాళ్ళకు

మంచి కాలక్షేపంగా వుండేది. వారిలో ఒకాయన "మీరు గ్రాంట్ హోంలో వుంటున్నట్టు లేదే" అని అడిగాడు.

"అవును. కొడుకుదగ్గర వుంటున్నా. మరోచోట...."

"అయితే వాళ్ళమీద ఎంతకాలం వుంటారు ?"

"గ్రాంట్‌హోంలో దిక్కు మొక్కూ!"

"ఓక్కేమిటి ? అక్కడుంటే దిక్కున్నట్లు, ఇక్కడ దిక్కులేనట్లా. నేనామధ్య ఆరునెల్లు నా కూతురిదగ్గరున్నా. అవస్థపడ్డాననుకో !"

పార్కుకు వెళ్ళడం మొదలెట్టిన తరువాత ముసలాయన ఆరోగ్యం మెరుగ్గా వుంది. జార్జీ, నెట్టీ అమాటే అన్నారు. ఆరోజు ఆయన పార్కులో వలసవిధానాన్నిగూర్చి ఒకే బిగువున మాట్లాడాడు. ఈమధ్య పత్రికలుకూడా ఎక్కువగా చదువుతున్నారు. మరి మాట్లాడానికి సంగతులు తెలిసిందొద్దూ. జార్జి ఇంటికి తెచ్చే అర్థశాస్త్ర గ్రంథాలన్నిటినీ ఆసాంతం చదివేస్తున్నాడు. పార్కువాళ్ళంతా ఈయన్ను అభిజ్ఞుడన్నారు. ఈయనకు తోడు పెంచను వుచ్చుకొన్న ఉద్యోగి ఒకాయన దొరికాడు. ఇద్దరూ తంటలతరబడి చర్చించేవారు.

* * *

వేసవి గడచింది. ఆకురాలుకాల మొచ్చింది. ముసలాయనకు మళ్ళీ బెంగపట్టుకుంది. చలికాలంవొస్తే తానెక్కడికి పోవాలి ? మళ్ళీ తాను, ఆ గదీ శూన్యమూ.

అనుకున్నట్టే అయింది. నవంబరు వొచ్చేసరికి పార్కు అంతా నిర్మానుష్యమైపోయింది. ఎలా వెడతాడు ? వీధి మలుపులో ఒక చుట్టలకొట్టు, బిలియర్డుశాల వున్నాయి. అక్కడికెళ్ళి చుట్ట కాల్చుతూ ఆట చూచేవాడు. వూరికే ఎంతసేపు చూస్తాడు ? పైగా పార్కుస్నేహితులు అక్కడికెవరూ రారు. వాళ్ళకు గ్రాంట్‌హోంలోనే పేకాట ఏర్పాటు వుంది.

చుట్టలకొట్టుకు వెళ్ళడంకూడా మానేశాడు. మనిషికేమీ తోచదు. మళ్ళీ చలికాలం వొచ్చింది. ధైర్యంతో గడపాలనుకున్నాడు. మనిషి రోజురోజుకూ క్రుంగిపోతున్నాడు.

గదికి చేరుకున్నాడు. లోపలంతా కలయచూచాడు. తన రబ్బరుబూట్లు తడిసి మట్టికొట్టుకున్నాయి. నెట్టీ గదిలోని తివాచీ ఎంతో ఫాషన్‌గావుంది. ఆనాడేదో వేడుకదినమన్న సంగతి ఆయనకు జ్ఞాపకమొచ్చింది. వంటగదిలోకెళ్ళి రబ్బరు బూట్లు తీసేసి చేతబుచ్చుకొని భోజనాల గదిలోకెళ్ళాడు. ఏవో కబుర్లు, పకపకలు విన్పించాయి. నెట్టీ స్నేహితురాళ్ళొచ్చినట్టున్నారు. అంతా కలిసి టీ త్రాగుతూవుంటారు. తిరిగి తన గదికి వెడదామనుకున్నాడు. తనపేరు ఎవరో అనడం విన్పించి ఆగిపోయ్యాడు. ఎవరోకాదు. కోడలే తన్నుగూర్చి చెబుతూవుంది.

"మామగారు లేకపోతే అలాగే చేసేవాళ్ళం. కాని ఆయన మాదగ్గరున్నంతకాలం ఎలా వీలవుతుంది. మరోగది ఏదీ లేదు. పెద్దఇల్లు తీసుకుందామంటే ఈరోజుల్లో భరించగలమా ! జార్జితో మాట్లాడాను. మామయ్య వున్నంతవరకూ వీలుకాదు. కాన్పుకు ఇబ్బంది కావచ్చు. ఇంకెవరైనావొస్తే వాళ్ళకు గది కావద్దూ ? ఒంటరిదాన్ని...."

ఆయన ఈ మాటలు వింటూ భోజనాలగదిలో నిలబడిపోయ్యాడు. వొళ్ళు కొయ్యబారిపోయింది. మనస్సు తీవ్రంగా ఆలోచిస్తూ వుంది. ఆవేశపడుతున్నాడు. చావు స్ఫురించింది. కాని అదే ఆయనకిష్టంలేదు. ఇంకా ఈ లోకంలో బ్రతకాలనే ఆయన ఆకాంక్ష. పార్కు, చెట్లు, క్లబ్బు, పక్షులు, వాదోపవాదాలు, వీటినన్నిటినీ వొదిలిపోవడం దారుణమనుకున్నాడు. నెట్టీ మంచిపిల్ల... అయినా చిన్నవాళ్ళకు చోటిస్తూ ముసలివాళ్ళు వైదొలగాలి. మరి ఈ ప్రపంచంలోకి రావలసిన హక్కు కొందరికివుంది. వాళ్ళు వచ్చితీరుతారు. వీళ్ళపెళ్ళయి నాల్గేళ్ళయింది. ఇన్నాళ్ళకు ఒక కాయ కాస్తూవుంది ఎంత శుభసూచకం! ఎప్పుడో జరగాల్సింది. కొత్తవాళ్ళు రావలసిందే. పాతవాళ్ళు జీవించాల్సిందే.

దొంగతనం చేసినవాడిలా వెనక్కి తిరిగి మళ్ళీ వంటగదిలో కెళ్ళాడు. వెడుతూ బెల్ మ్రోగించాడు. ఆయనకు గది తాళంచెవి అనేది ఎన్నడూ లేదు. తన్ను ఒక పిల్లాడి క్రింద కట్టేసి వాళ్ళు తనకు తాళం ఇవ్వలేదు.

అప్పుడే నెట్టీ స్నేహితురాళ్ళు వెళ్ళిపోతున్నారు. టీ, కేకులు, బిస్కెట్లు, పౌడర్ వాసనలు కొడుతున్నాయి.

ఆ వొచ్చినవారు తన్ను చూచి "బాగున్నావా బాబయ్యా" అని అడిగారు. ఆయన సమాధానం చెప్పలేకపొయ్యాడు. మళ్ళీవాళ్ళే "పరవాలేదు. ఆరోగ్యం బాగుపడింది" అన్నారు.

ఆయన నవ్వాడు. బారుకోటు విడిచేస్తూ "నాకేం బాగానే వున్నా. ఎక్కడున్నా బాగానే వుంటా. వచ్చేవారం వెడుతున్నా" అన్నాడు.

నెట్టీ ఆశ్చర్యపోయి "ఎక్కడికి మామయ్యా వెళ్లడం ?" అని అడిగింది.

"ముసలాళ్ళు వైదొలగి కొత్తవాళ్లకి చోటివ్వాలమ్మా! అది జీవిత ధర్మం."

నెట్టీ ముఖం ఎర్రబారిపోయింది. "అదేంటి మామయ్యా, ఈ ఆలోచన ఎప్పటినుంచీ ?" అంది.

"ఆలోచనేం వుందమ్మాయి. ఇది నే చెయ్యవలసినపని. ఇవాళే గ్రాంట్‌హోంలో దరఖాస్తు పడేసివొచ్చా."

ఆ వొచ్చిన స్నేహితురాళ్ళు నెట్టివంకచూచి చిరునవ్వు నవ్వారు. ముసలాయన అవిడకు దగ్గరగా వొచ్చి బుజంతట్టి, సన్నగా బుగ్గ మెలిపెట్టి ముశిపెమాడాడు.

"నువ్వనేది నా కర్థం కావడంలేదు మామయ్యా!"

"అర్థమవుతుందిలే అమ్మాయి!"

ఈమాట తేలిగ్గా అన్నాడేగాని ఆయనముఖంలో ఏదో బాధ, కాఠిన్యం....

మరుసటివారం గ్రాంట్‌హోంలో ప్రవేశించాడు. అక్కడ కొందరు ముసలాళ్ళు చలికాచుకుంటున్నారు. అంతా డెబ్భయ్యో పదిలో పడ్డవాళ్లే. అంతా ఈయనకు స్వాగతం చెప్పారు.

"రా రా, ఎప్పుడో వస్తావనే అనుకున్నాము. నువ్వు లేక పోతే పొద్దే పోవడం లేదు. ఇదిగో ఈ పెద్దమనిషి చైనాను అగ్రరాజ్య చతుష్టయ సంధిలో చేర్చుకోవాలంటాడు" అన్నాడొకాయన.

ముసలాయన గొంతు సవరించుకొని "ఇప్పుడా, చైనాకా వీలులేదు. ఇంకా కొంతకాలం పోవాలి" అన్నాడు.

అక్కడికి కొక పనిమనిషి వొచ్చింది. మనిషి బుగ్గలు టొమాటో పళ్లలాగున్నాయి. నల్లటి దుస్తులు వేసుకొని వుంది. ముందువైపు తెల్లటి రుమాలు కట్టుకుంది. బహుశా వసతిగృహంలో పనిచేసే మనిషి అయివుంటుంది. అవిడ తిన్నగా ముసలాయన ముందుకొచ్చి నిల్చుంది ముసలాయన సంభాషణ ఆపాడు.

"మీగది తయారైందని మేనేజరు చెప్పారు. వొచ్చి చూడండి" అంది ఆమనిషి.

"చూడక్కర్లేదులే. నామంచంపై రెండు దిండ్లు వుండాలని ఆయనతో చెప్పు" అంటూ ముసలాయన ఏదో ఆలోచనలో పడిపొయ్యాడు.

అనువాదం : డి. రామలింగం

చర్చావేదిక :

## గురజాడ కవి ?

గురజాడ అప్పారావుగారు కవిశబ్దవాచ్యుడు కాడని సీతారామరావుగారు వ్రాసినారు. ఆయనకు సమాధానాలు వ్రాస్తూన్న కొందఱు ఆమాటన్నందు కాయనపై కోపగించుకుంటున్నారే కాని అప్పారావుగారు ఎందుచేత కవియో, ఆయనలోని కవితా గుణా లేమిటో చెప్పుటలేదు. మహా అయితే ఆయన దోషాలన్నవాటిని దోషాలు కావని నిరూపించుటకు ప్రయత్నము చేస్తున్నారు. ఆ మాట ఒప్పుకొన్నప్పటికీ అప్పారావుగారు కవేనా? అన్న ప్రశ్న మిగిలియే ఉంటున్నది. ప్రధానమైన ఆ ప్రశ్నకు సమాధానము చెప్పకుండా అప్రధానములైన అనేక విషయాలకు సమాధానాలు చెప్పుట జరుగుతున్నది.

ఈ సమాధానాలు అనేక విధాలుగా కొనసాగుతున్నవి. విశ్వనాథ సత్యనారాయణగారే నవ్యసాహిత్య పరిషదధ్యక్ష పీఠమునుంచి గురజాడవారిని మెచ్చుకొన్నారు. మీరు కాదంటారేమిటనే ధోరణిలో కొంత. మీరు చూపెట్టిన దోషాలు మహాకవు లనబడుతున్నవారందరూ చేసినవే అనికొంత. ఫ్యూడలిస్టు మొదలైన రాజకీయ శబ్దాలు కొన్ని ప్రయోగించి, అభ్యుదయమార్గము యొక్క సొగసు మీ కెట్లా తెలుస్తుందిలే అని కొంత. అప్పారావుగారు సంఘ సంస్కర్త, దేశభక్తుడు, దార్శనికుడు. ఆయనను కవికాదనుట న్యాయముగా లేదు అని కొంత. ఇట్లే మరికొన్ని.

అప్పారావుగారు కవి కాడని వాదించే కొందరికి సత్యనారాయణగారి వాక్కు ప్రమాణము కనుక ఆయన మాటలు పేర్కొని నీ చేతితో నీ కన్నే పొడిచినాను చూచుకో అని సంతోషించవచ్చు. ఏదో ఒకటి చెప్పి, ఎదుటివాని నోరు మూయించే ప్రయత్నమే ఇందు కనబడుతున్నది కాని ఇదికూడా అప్పారావుగారు కవి అనే విషయాన్ని స్థాపించగలుగుటలేదు. ఎందుకంటే ఎంతటి మహాపురుషవిషయములోనైనా వ్యవహారాపతితమైన ప్రతి వాక్కునకూ ప్రామాణ్య ముండుట సంభవము కాదు. ఒకప్పుడు శ్రీ శ్రీ దృష్టిలో అప్పారావుగారు కవికాదు. ఆ మాట ఆయనే ఒప్పుకొన్నారు. ఇప్పుడు చాలా కష్టపడి పాత పత్రికలన్నీ తిరుగవేసి ఆ మాటలు దొరికించుకొని ప్రయోగిస్తే కలిగే లాభ మేమీ లేదు. ఎందుకంటే అప్పారావుగారు కవిఅగుట, కాకపోవుట, దేశములోని కొందరు ఆయననుగురించి అన్నమాటలమీద ఆధారపడి లేదు, ఆయన వ్రాసిన కవిత్వముమీదే ఆధారపడి ఉన్నది. ఆ కవిత్వములోని గుణదోషముల చర్చ వదలి, ఇతరుల వాక్యము లనువదించుట వాదమును పెడమార్గానికి లాగుటవంటిది, అది వాద దౌర్బల్యానికి చిహ్నము.

పైగా గురజాడవారి విషయములో విశ్వనాథవారు చెప్పవలసిన దేమున్నది? సామాన్య బుద్ధి కందని మహా విషయాలు తమ కవిత్వాలలో దాచిన కాళిదాసు, నన్నయ్యగారు మొదలైనవారినిగురించి ఆయన చెప్పవలసిన అవసరమున్నది. వారి అంతర్యమును కనుగొనుటకు ఆయన బుద్ధి నాశ్రయించవలసి వస్తున్నది. కాని మనకుమనమై తేలికగా అర్థము చేసికోగలుగు రచనల విషయములో ఆయన కాదుకదా ఇంకెవ్వరి సహాయమూ అవసరము లేదు.

వ్యాఖ్యాతలు విశదీకరిస్తేగాని ప్రకాశించని గూఢార్థాలు గురజాడవారి కవిత్వములో ఏమైన ఉన్నవా? ఉంటే ఎవరు చూపెట్టినా అవి శిరోధార్యాలే. ఆయనను కవిగా కీర్తించువారే అవి ఉన్నవని చెప్పినట్లు లేదు. పైగా రసము, ఔచితి, ధ్వని, వ్యంగ్యము, వృత్తి, రీతి ఇత్యాదు లున్నవని ఒప్పుకొన్నచో, ఈ దేశములో వారు నిలబెట్టదలచుకొన్న కవితా సిద్ధాంతానికే భంగము కలిగే అవకాశ మున్నది. అవి లేకపోతే ఇంకొకరు చెప్పే ప్రసక్తి లేదు. అందరికీ అర్థమగు సల్లక్షణము గురజాడవారి కవిత్వానికున్నది కాబట్టి అదిమాకుగూడ అర్థము కావలయును. ఆ అర్థమైనదానినిబట్టి చూస్తే

అయన కవిగా మా దృష్టిలో నిలువడు. కవి అంటే అయనే అనేవారు దేశములో ఉన్నారు కాబట్టి ఎందుచేత కవియో వారు చెప్పవలయును. ఊరకే వాక్యాలు అనువదించుట ప్రచార మగునుగాని విమర్శ కాదు.

నికృష్టబుద్ధి ఐతేతప్ప ఇటువంటి దోషాలు చేయడని సీతారామరావుగారు కొన్ని దోషాలు చూపించినారు. ఆ దోషా లుంటే అతడు కవి అనే మర్యాద మూలచ్ఛేద మైనదన్నమాటే. కాని అవి లేనంతమాత్రాన అతడు మహాకవి కాజాలడు. గుణసహిత మైనది కవిత్వమగునుకాని, దోషరహిత మైనది కాదు. దోషము రసభంజకము. గుణము రసపోషకము. కవి కాడని చూపించువానికి దోషచర్చ యెంత ప్రసక్తమో కవియగునని చూపించువానికి గుణచర్చ యంత ప్రసక్తము. అప్పారావుగారి కవిత్వము గుణరహితమూ, దోషబహుళమూ అందుచేత అతడు అకవి— ఇది సీతారామరావుగారి వాదన. ఆయనతో వివదించువారి ప్రధానకర్తవ్యము గుణస్థాపన చేయుటకాని దోషాలు లేవని ఘోషించుట కాదు. అసలు గుణమనేది ఉంటే తరువాత దోషాలను గురించి విచారించవచ్చును. వాని రసభంజకత్వశక్తిని గూర్చి విచారించవచ్చును. ఆదినుంచీ కొన్నివేలమంది కవులు తెలుగుదేశములో పుట్టితే వారిలో పది పన్నెండుగురు మాత్రమే కవులుగా నిలిచియున్నారు. ఎందుచేతనంటే, ఆ మిగిలినవారిలో లేని విశిష్ట గుణాలు వీరిలో కొన్ని ఉండుటచేత. అప్పారావుగారిలో కూడా అటువంటి గుణము లుంటే ఆయనను నిరభ్యంతరముగా కవిగా స్వీకరింపవచ్చు. మహాపురుషుడు, మహాకవి, అని పుస్తకములపై వ్రాయుట, సభలలో చెప్పుట తప్ప ఆ గుణము లింతవర కెవ్వరూ చూపినట్లు లేదు. అవి చూపకుండా చేసేదంతా వృథా తర్కము.

మరియు, గుణోత్కర్ష ఈ తెలుగు దేశములో విచిత్రముగానున్నది. ఒక కవి గుణాలు చూపించుటకై వ్రాసే వ్యాసాలు చాలవరకు ఉదాహరణ వ్యాసాలుగాఉంటున్నవి. ఒక పద్యమో గేయమో ఉదాహరించి ఇది గొప్పగా నున్నదని వ్రాయుట పరిపాటి. అది యెందుచేత గొప్పగా నున్నదో వ్రాయుటయుండదు. పట్టి చిలుకపలుకు లుండును. ఒకరికి గొప్పగానున్నచో ఇంకొకరికి లేదు. సమన్వయము కుదురుటెట్లు? పట్టి వితండ వాదము క్రిందికి దిగును. అట్లే ఒక కవికిరచనా సౌకుమార్యము తెలియదని ఒకరన్నచో, ఇంకొకరు కొన్ని ఉదాహరణలు చూపించి ఊరకుండుట జరుగుతున్నది, అంతమాత్రముచేత కాదు. సౌకుమార్యమనగా నేమిటో మొదట చెప్పవలయును. కఠిన శబ్దములులేకుండ వ్రాయుట అనేకులు సౌకుమార్యము క్రింద జమకట్టుతున్నారు. మీసాలు లేని పేడి మూతిని సుకుమారమని అనవచ్చునా? ఒక గుణము ఒకచోటనున్నదని చెప్పువాడు అది అక్కడ ఎట్లు భాసిస్తున్నదో, దానిలోని విశేష మేమిటో సహేతుకముగ చూపవలెను గాని అది యట్లున్నదని వ్రాయుట కాదు. హేతువాదానికి ప్రమాణభూతుల మనుకొంటున్న అనేకాధునికుల విమర్శలీ దోషము చేత దూషితములై ఉన్నవి.

ఈ సమాధానాల సందర్భములో కొంత రాజకీయ శబ్దజాలము ఎదుటి వానిపై ప్రయోగించుట జరుగుతున్నది. ఇది మూఢత్వానికి చిహ్నము. మూఢవిశ్వాసాలని గోల పెట్టే అనేకులకు మరల మూఢవిశ్వాసాలున్నవి. విమర్శా విచారాలు లేకుండ, దేనినైనా అవధిభూతముగా విశ్వసించుట మూఢ విశ్వాసముక్రింద లెక్క. ఈ మూఢ విశ్వాసాలు మతవిషయముననున్నట్లు, రాజకీయ విషయమున, కవితావిషయమున కూడ ఉండును. అనంతకాలము మీది చరిత్రను ఎవడో కొన్ని యుగాలక్రింద విభజించి వానికి కొన్ని పేర్లు పెట్టగా, అది పరమ సత్యమనుకొని, ఆ వివరీతపు పేర్లు వ్యక్తుల భావాలకు లగింపచేయుట మూఢ విశ్వాసము కాకపోతే మరేమిటి? ఆధునికు లనే

కులు తాము విశ్వసించుచున్న సిద్ధాంతాలలోని సత్యాసత్యములను గూర్చి విచారించరు. అవి కాదన్నవానికి అభ్యుదయ నిరోధకుడు, మొదలైన పేర్లు పెట్టి పరిహసించుటకు ప్రయత్నిస్తారు. వాడు చూపించిన హేతువులు ప్రతిసమాధేయములౌనో కాదో వారికక్కరలేదు. మాకు నోరున్నది. మూక యున్నది. ప్రచారములో మమ్ము మించినవాడిక ముందవతరించవలెను, తమమార్గమున కభ్యుదయ మని పేరు పెట్టుకొన్నవారిలో ఈ వ్యాధి ప్రబలముగా నున్నది. అప్పారావుగారు మహాకవి యన్న భావము ఈ వ్యాధి జన్యమైన ఒక విపరీత లక్షణము.

నిజానికి తెలుగువారిలో అప్పారావుగారికి కవి అనే మర్యాద ఉన్నదా? తెలుగువారి ఇండ్లలో అప్పారావుగారి కావ్యాలు భారత భాగవతాదుల వలె చదువబడుతున్నవా? ఒక ప్రత్యేకమైన కవితా పద్ధతిని ప్రచారము చేసేవారికి దక్క, ఆయన కవిఅన్న భావము ఇంకెవ్వరికీ ఉన్నట్లులేదు. మొత్తము తెలుగు జాతిని కైకొంటే అది నన్నయ తిక్కనాదులను, ఆ కోవకు చెందిన ఇతరులనూ కవులుగా పరిగణిస్తున్నది. నన్నయాదులలోని గుణములు కాదనుటకు వీలులేదు. ఆ గుణాలు అప్పారావుగారిలో చూపించుటకు వీలులేదు. ఏ లక్షణాలు చూచి నన్నయాదులను కవులన్నామో తద్వ్యతిరేక లక్షణాలను ప్రదర్శించిన వానిని కవి యనుట ఎట్లు? అయితే నన్నయాదులను కాదనవలె. లేకపోతే అప్పారావుగారు కవి అనే ప్రచారము వదలుకోవలె. రెండూ కొనసాగవు, ఒకే నోటితో తిక్కన, అప్పారావు ఇద్దరినీ మహాకవులుగా పేర్కొనువారు లోకమును వంచిస్తున్నారని అర్థము. తిక్కనను కాదనజాలని బలహీనత, ఎట్లయినను అప్పారావుగారిని కవిగా నిలబెట్టవలెనన్న ప్రయత్నము, ఈమాటలో గోచరిస్తున్నవి. రాజకీయములంటని అకల్మషజీవులెవ్వరును వీరిద్దరిని ఏకపదస్థితులుగా అంగీకరించలేరు. తిక్కన్నగారిని కాదన్నచో చిక్కేలేదు. తెలుగు కవిత్వము మీకు తెలియదని వారికి జవాబు. భూమిమీదనున్నవానితో వాదింపవచ్చునుగాని పాతాళమున బడిపోయినవానితో వాదింపలేము.

ఇంతకూ ఒక ప్రత్యేకమైన రాజకీయపార్టీ సాహిత్య విషయములందు ఐక్యము కలిగించుకొని ఉండకపోతే, అప్పారావుగారు కవి అగునా కాదా అన్న ప్రశ్న ఇప్పుడుండేదికాదు. రాజకీయ పక్షములవారు తమపక్ష ప్రయోజనార్థ మనేకములైన పనులు చేయుదురు. వారికి సత్యముపైకన్న తమ ప్రయోజనముపై దృష్టి యధికము. గురజాడవారి దేశభక్తి గేయము సభలలో పాడబడి అనేకుల నాకర్షించినమాట వాస్తవమే కావచ్చును. కవిత్వముయొక్క ఉచ్చనీచత్వముల నిర్ణయించునది రాజకీయనాయకుల పొల్లుమాటల వినుటకైకూడిన మూకలు కావు. కేవలము జనసామాన్యము నాకర్షించు పాటలు వ్రాయుటచేత ఎవరైన మహాకవు లగుదురా? అయినచో బొబ్బిలిపాట వ్రాసినవాడు మహాకవి యేలకాదు? 'చల్ మోహన రంగా' పాటలు వ్రాసిన వాని సంగతియేమి? అంతచక్కని బుఱ్ఱకథలు వ్రాసిన సుంకర సత్యనారాయణగారి మాటయేమి? ఆయన నిస్సందేహముగా అప్పారావుగారికన్న అధిక కవితాశక్తి గలవాడు. తెలుగుదేశములోని వారాయనను కవిగా పరిగణించుట లేదేమి? అందుచేత మేము మా సభలో పాడించగా ఇంతమంది తలలూపినారన్నది కవిత్వానికి కొలబద్దగాదు.

అప్పారావుగారు దేశభక్తుడు, సంఘసంస్కర్త మొదలైనవన్నీ అనవసరపు మాటలు. అతడు దేశభక్తుడైతేనేమి. కాకపోతే నేమి? సంఘసంస్కర్త ఐతే నేమి? కాకపోతే నేమి? ఆయన కవిత్వము నాస్వాదించదలచుకొన్నవాని కతని యీ గుణములతో సంబంధము లేదు. ఆ జాతికిచెందిన వారనేకులున్నారు. దర్శనస్పందన మొదలైనవి కూడా

వాదమును పెంచుటకే తప్ప ఇంకెందుకూ ఉపయోగపడుటలేదు. దార్శనికుడని చెప్పుటయేతప్ప ఆయన దర్శించిన మహాభావమేమో ఎవ్వరూ చెప్పుటలేదు. ఆ మహాభావానికి ఆయన కవిత్వము ప్రతిబింబమైనదో లేదో తెలియబరచుటలేదు. అవి నిరూపించేవరకూ, ఆయన కవిత్వములోని గుణములను చూపించేవరకూ, ఆయన అకవి యని భావించుట ఎవరిదోషమూ కాదు.

—జువ్వాడి రామేశ్వరరావు

## సాహిత్యధార :

జయంతి పాఠకులకు నమస్కారము.

ఇది ప్రథమదర్శనమున నెరపు మర్యాద.

వసంతాగమముతోపాటు నన్నవతరింపవలసిన దని జయంతి సంపాదకుల యాజ్ఞ. ఆ యాజ్ఞను పాలించుటలో కొంత ఆలస్యమైనది. కొంత యనగా ఒక్క నెల. ఆలస్యము భారతీయుల లక్షణము గనుక పరవాలేదు.

నెలనెలకు మిమ్ము తప్పక దర్శింపవలయునని జయంతి సంపాదకుల మధ్య, నామధ్య కట్టుబాటు. ఇది వ్రాయుచున్నప్పుడు బుధవారము. సప్తమీ తిథి. వర్జ్యము లేదు. ఈ ప్రయత్న మిట్లు కొనసాగునని యే నమ్మకము.

అసలు విషయము చక్కగా చెప్పలేక, ఈ డొంకతిరుగుడు తిరుగవలసి వచ్చుచున్నది. ఏది చెప్పినను గురజాడ అప్పారావుగారిని వదలి చెప్పుటకు వీలులేని పరిస్థితి యేర్పడినది. ఆయన అకవి యని కొందరు, మహాకవి యని కొందరు. ఈ మహాకవి శబ్దములో కొందరు అవగ్రహము చేర్చినారు, వారిలో 'మహాకవి గండ్రగొడ్డలి' శ్రీ పొట్లపల్లి సీతారామరావుగారు ముఖ్యులు. దానితో వాదోపవాదములు చెలరేగినవి.

ఈ వాదోపవాదములలోని నిజానిజముల నట్లుంచి, ఇంతగా పరస్పర వ్యతిరేకములైన భావములు తెలుగు దేశములో నెందుకున్నవి? కొందరకు మహాకవియైనవాడింక కొందరకు అంతకన్న కొంత తక్కువ కవి యైనచో విడ్డూరము లేదు. అకవి, మరియు మాటాడినచో మహాఽకవి యగుటలో నున్నది చమత్కార మంతయును. పర్యవసానార్థ మేమనగా, తెలుగుదేశములోని విమర్శకొక ప్రమాణ మున్నట్లు లేదు.

కాదు. గురజాడ అప్పారావుగారు మహాకవి కానేకావలయును. కాని ఒక్క అప్పారావుగారినే మహాకవిగా చెప్పినచో అంగీకరింపజేయుట అంత తేలికకాదు. అందువలన చరిత్ర త్రవ్వి, వేమనను బయటికి తీయవలయును. ఆయనను మహాకవిగా నిలబెట్టినచో గురజాడ అప్పారావుగారుకూడ నిలబడుదురేమో! 'ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు' ఇక్కడ ఆ రెంటి భౌతిక ధర్మములను చెప్పినాడు. ఇది 'థీసిస్' (?) చూడ చూడ రుచుల జాడ వేరు. ఆ రెంటి రసాయనిక ధర్మము వేరని చెప్పినాడు. ఇది 'అంటిథీసిస్'. పురుషులందు పుణ్య పురుషులు వేరయా? ఇది 'సింథెసిస్'. ఇది చాల గొప్ప శిల్పమని అభ్యుదయ మహాకవి శ్రీ శ్రీ వ్యాఖ్య.(అభ్యుదయ - మార్చి, '59)

'తనకు వచ్చిన చదువు ధారపోసెదనంచు
బ్రహ్మచారి యొకడు భామ జేరె
నేర్పుకొన్నది యేమొ నెలదప్పెరా తుదకు.'

మొదటిది కారణము. తరువాతిది కార్యము. కారణము కార్యమునకు పూర్వరంగము. ఇది యెంత గొప్పశిల్పము? పైగా భామలకు చదువు చెప్పుటకు బ్రహ్మచారులు పోగూడదని సాంఘికమైన నీతికూడ యిందున్నది. అందుచేత ఈ కవిత్వము నిస్సందేహముగా గొప్పదే. ఆ కవిత్వము

యొక్క గొప్పదన మెట్లున్నను, విమర్శకుని అవ్యవస్థితమనస్కతకుమాత్ర మిది నిదర్శనము.

కొందరికి ధనము విశేషముగా లభించును. ఆ లభించుటకు వాని సామర్థ్యము కారణము కానే కాదు. అట్లే కొందరికి కీర్తి లభించును. ఆ ధనప్రాప్తికి కారణము చూపజాలనట్లే ఈ కీర్తికికూడ కారణము చూపలేము. వేయి యేండ్లుగా ఈ భారత దేశములో రెండే రెండు ఉత్తమ నాటకములు వచ్చినవి. ఒకటి మృచ్ఛకటికము. రెండు కన్యాశుల్కము, అను వారికి (శ్రీ శ్రీ. అభ్యుదయ- మార్చి) ఎవ రేమి చెప్పగలరు? ఇది యొక అగ్నికిరీటపు ధగ ధగ. శాకుంతలము, ఉత్తరరామ చరితము అన్నీ దీనిముందు వెలవెలబోవలసినదే. ఈ మాట తొందరగా మాస్కోవారికి చెప్పవలయును. శాకుంతలము చూచినతరువాత అక్కడ కొంతమంది శకుంతలలు బయలుదేరిరట! ఇక ముందు వసంతసేనలు, మధురవాణులు వేంచేయుదురు. ఎంతయైనను, శకుంతల దుష్యంతుని భార్య. వర్గస్వభావ మామె కలవడకపోదు. వీరిరువురు వేశ్యలు. అనగా పతిత జాతులు. వారి కక్కడ మిక్కిలి ప్రాముఖ్యము వచ్చును.

విశ్వనాథవారి విశిష్టతతో కూడుకొనియున్న అల్లసానివాని అల్లిక జిగిబిగి వ్యాసములు 'నవభారతి' మార్చి సంచికతో అంతమైనట్లున్నవి. ఇకముందు మనుచరిత్రమొక క్రొత్త దృష్టితో చదువుటకీ వ్యాసములు మార్గమును చూపించుచున్నవి. 'జయంతి' లో వారు వరుసగా కాళిదాసు శాకుంతలమును గూర్చి వ్రాయుచున్నారు. ఈ రెంటిలోనను వారు అక్కడక్కడ వేదాంతము త్రవ్విపోయుచున్నారు. సాహిత్య విమర్శకును, వేదాంతమునకును, సంబంధమేమి యను ప్రశ్నించువారు లేకపోలేదు. వారికొరకు విశ్వనాథవారు ప్రత్యేకముగా కొంత వ్రాసినచో బాగుండును.

'నవభారతిలో' వారి శేషగిరి శతకము (మధ్యాక్కరలు) ప్రకటింప బడుచున్నది. సత్యనారాయణగారి కవిత్వమును గూర్చిన యొక నిందాపూర్వకమైన యభిప్రాయము లోకములోనున్నది. ఆయన కేవలము సంస్కృత మయముగా వ్రాయునని. ఈ మధ్యాక్కరలలో వారువ్రాసినది తెలుగు. ఇంతకన్న తెలుగు ఇంకొకచోట నుండుననుకొనుట కష్టము.

శ్రీ దొప్పలపూడి శ్రీనివాసరావుగారు 'అభ్యుదయనాటిక'లను వ్యాసము 'జయంతి'లో వ్రాసిరి. అభ్యుదయ శబ్దము వారు వాడిన అర్థములో నేడెవ్వరును వాడుటలేదు. ఒక ప్రత్యేకమైన దృక్కోణము కలిగిన రచయితలే నేడభ్యుదయ రచయితలుగా చెప్పబడుచున్నారు. ఆ యర్థమునందా శబ్దమునకు రూఢి కల్గినది. కన్యాశుల్కము తర్వాత వచ్చిన నాటకములనన్నింటిని వారభ్యుదయ నాటికలలో జేర్చినారు. ఈ యొక్క దోషమును పరిహరించిచూచినచో వారనేక విషయములను చర్చించినారు. నేటిసాహిత్యమును గూర్చిన విమర్శయంతగా పత్రికలలో ప్రకటింపబడుటలేదు. సాహిత్యపత్రికలు దీనిని గురించి అంతగా పట్టించుకొనక పోవుట కారణము కావచ్చును. కొన్ని వ్యాసములు సేకరించి ఒకచోట ప్రచురించినంతమాత్రాన సంపాదకులు తమ విధినెరవేరినట్లు భావించుచున్నారు. పత్రికయొక్క వ్యక్తిత్వము బాగుగా నుద్దీపింపజేయుటయే మంచిసంపాదకుని లక్షణమని హెన్రీ ఫెర్రే, 'ది కేస్ ఆఫ్ డేలీ మిరర్' అను వ్యాసములో చెప్పినాడు.

మన సాహిత్య పత్రికాసంపాదకు లీమాటలు జ్ఞాపకముంచుకొన్నచో మంచిదేమో!

నేటి సాహిత్యమును గురించి తత్ర తత్ర ప్రకటింపబడుచున్న విమర్శలలో దోషము లనేకములు. ప్రతిసంవత్సరము శ్రీ వాత్సవగారు "సాహిత్య సింహావలోకనములు" వ్రాయుదురు. కొన్నిచోట్ల యవి మిక్కిలి హాస్యాస్పదములుగా నున్నవి. వారు మధ్యాక్కరకానిదానిని మధ్యాక్కరగా ఉదాహరించినారు. రామాయణ కల్పవృక్షములో

లేని పద్యములు ఆ గ్రంథములోనివిగా చెప్పినారు. (స్వతంత్ర - 11-4-59) మరి సంపాదకు లేమిచేయు చున్నారని ప్రశ్న రావచ్చును. వారికిమాత్ర మేమి పట్టినది? వచ్చినవ్యాసముల నచ్చుకిచ్చుటయే వారి ప్రధానవృత్తియాయెను! ప్రచురించుపత్రిక లుండ వలయును కాని అదేపనిగా విమర్శలు వ్రాసినవా డెవ్వడైనను విమర్శకాగ్రేసర పదము నందుకొని కూర్చుండును. ఆ విమర్శలోని సత్యాసత్యములు, మంచిచెడ్డలు ఈ దేశమునకే పట్టినట్లు లేవు. ఒక సంవత్సరపు సాహిత్య సింహావలోకనము చేయు టకుముందు ఆ సంవత్సరపు రాజకీయ చరిత్ర యంతయు వ్రాయుట యవసరమా? ఏదో ఒక రాజకీయమైన కలవరము పుట్టినది. అది కారణ ముగా ఈ దేశములో కొంత సాహిత్యసృష్టి జరిగి నచో సాహిత్యవిమర్శ సందర్భములో మాత్రము ఆ రాజకీయపరిస్థితులు చెప్పుట యవసరము. కాని కనులుమూసికొని, జరిగిన సర్వవిషయము లేకరువు పెట్టుట మనకు పత్రికావార్తలతో నున్న పరిచయ మును సూచించునేమోకాని అది సాహిత్యవిమ ర్శలో చేరదు.

చాలకాలము తరువాత క్రొత్తగా కంఠము విప్పిన పాతకవులు శ్రీ నాయని సుబ్బారావు గారు. సుబ్బారావుగారి వాణి నేడు మునుపటి కన్న ప్రౌఢమైనది. ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో వారు రచించిన 'షష్టిహాయన మాతృక' వారి ఆత్మ సౌందర్యమును వెలికి తెచ్చుచున్నది. వీరిలో కన పడుచున్న వేదాంతభావము కొందరి కిష్టమైనట్లు లేదు.

సాహిత్యములో తన స్థానమును సుప్రతిష్ఠిత మొనర్చుకొనుచున్న వారు శ్రీ బూర్గుల రామకృష్ణా రావుగారు. వారి గంగాలహరిఅనువాదము పద్య రచనలో వారందుకున్న యంతస్తును సూచించు చున్నది. వారి స్వాతంత్ర్య రచనలకన్న ఈ యను వాదము మెరుగు. అనేకుల యనువాదములు ప్రసాదమునకుప్రసాదము,నీళ్ళకు నీళ్లుగానుండును. కొన్నిచోట్ల మూలమొకత్రోవ, అనువాదమొక త్రోవగా సాగును. అనువాదకుని అశ్రద్ధ, అసమ ర్థత, దీనికి కారణములు. రామకృష్ణారావు గారు శ్రద్ధావంతులు. సమర్థులు.

ఏప్రిల్ భారతిలో ప్రకటింపబడిన కవితా శీర్షికలలో సుప్రసన్న గారి 'సాహస్రమాన్మథము' ఎన్నదగినది. హృదయము నూగించు జీవశీలమైన వేదనయొకటి ఈయనలోనున్నది. ఆవేదనను పట్టుకోజాలక ఉక్కిరిబిక్కిరి యైన లక్షణముకూడ ఆయన కవిత్వమందు కనపడును. అది కొంత అస్పష్టతకు దారితీయుచున్నది. నేడు పద్యములు వ్రాయుచున్న కవులనేకులకు పద్యముయొక్క ఎత్తుగడ యెట్లుండవలయునో తెలియదు. ఆరహస్య మీకవికి కొంత తెలియును. తన భావ ప్రకటనలోని యస్పష్టత నీకవి జయించ గలిగినచో తన రచనకు మరింత మెరుగు పెట్టుకో గలడనుటలో సందేహము లేదు.

—"సమవర్తి"

---

ఫలాభావమువలన పుస్తక సమీక్ష ప్రకటింపజాలనందుకు చింతించుచున్నాము. —సం.

## వచ్చే సంచికలో

అనుముల కృష్ణమూర్తి

పి. యస్. ఆర్. అంజనేయశాస్త్రి

చెఱుకుపల్లి జమదగ్నిశర్మ

కొండముది శ్రీరామచంద్రమూర్తి

ధూళిపాళ శ్రీరామమూర్తి

కావూరి పూర్ణచంద్రరావు

కొర్లపాటి శ్రీరామమూర్తి

విశ్వనాథ సత్యనారాయణ

[illegible], సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : [illegible]
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.